# పాటలి

మల్లాది వసుంధర









ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు

# పీఠిక

నాకు చాల యేండ్లనుండి సాతవాహనులనాటి కథను తీసుకొని యొక నవలను వ్రాయవలెనని వాంఛ. పూర్వపు నవలలైన దూరపుకొండలు, తంజావూరు పతనము, యుగసంధి, త్రివర్ణపతాక మొదలైనవిగాక నీ నడుమ 'రామప్పగుడి' యను నవలను వ్రాసితిని. 'పాంచాలి' యన్న పేరుతో నొక గొప్ప నవల వ్రాయవలెనని సంస్కృతాంధ్ర భారతముల రెంటిని ఆద్యంతములు చదివితిని. కాని సాతవాహనులను గూర్చిన నవల వ్రాయుటకు సాతవాహన సంచిక మొదలైన కొన్ని గ్రంథములు కొంచటివద్ద తెచ్చితిని. నాలుగేండ్లుగ వారి గ్రంథములు నావద్దనే యుండిపోయినవి.

ముందు సాతవాహనులను గూర్చిన నవలయా, పాంచాలియా అన్న ప్రశ్నలో నాలుగేండ్లనుండి యెవరి గ్రంథములు నావద్దనున్నవో వాటికి నేను కలిగించిన యసంతృప్తియు నీ యెకాడమీ బహుమతికి వ్రాయఁదగిన విషయము పాంచాలికంటె సాతవాహనుల కథయే యోగ్యమనుకొనుటయు నా సందిగ్ధావస్థను మాన్పినవి.

ఈ పాటలికి అన్ని యధ్యాయముల మొదట గాథాసప్తశతిలోని యొక శ్లోకమును తాత్పర్యము నుదాహరించితిని. ప్రతియధ్యాయమునందలి ప్రారంభమున కథకు తగిన శ్లోకముకొఱకు సప్తశతి పదిపర్యాయములైన తిరుగవేయవలసివచ్చినది. ఈ శ్లోకములను వెదకుటకు చాల శ్రమపడవలసి వచ్చినది. కాని గాథాసప్తశతి మాత్రము నాకు కరతలామలక మయినది!

ఈ **'పాటలి'** యన్న గ్రంథములో సాతవాహన సంచికలో నున్న బహు విషయములు – అప్పటి సాంఘిక పరిస్థితులు – రాజకీయ పరిస్థితులు – గ్రామీణ జీవితము – ఆనాటి శబ్దములు నవలలో గ్రహింపఁదగినన్ని గ్రహించి వ్రాసితిని.

ఆనాటి గ్రామీణ జీవితమునకు సప్తశతికంటె మరియొక ప్రమాణ గ్రంథము దొఱకబోదు. ఆ సప్తశతిలో వాచ్యార్థములుగల శ్లోకముల సంఖ్య తక్కువ, వ్యంగ్యార్థములుగల సంఖ్య యెక్కువ.

నే నెన్నుకొన్న శ్లోకములు పదమూఁడుకంటె నెక్కువ లేకపోయినను ఆ శ్లోకములలోని యర్థములు నా నవలలోని యధ్యాయములలో నేను చెప్పెడి విషయములకు వ్యంగ్యముగానో స్ఫూర్తిగానో పనికివచ్చునట్లుండవలయునుగదా! ఆ శ్రమ నా కెక్కువైనది.

ఇది బహుమతి నవల కానిచో నేనంత శ్రమపడి యుండెడిదాననుకానేమో! ఈ బహుమతి ఎకాడమీవారు నా కొసంగిరి. వారు బహుమతి నా కీయకపోయినను నేను వారికి కృతజ్ఞురాలనుగానే యుండవలయును.

వారి హేతువుగ నేను సాతవాహన సంచికయు గాథాసప్తశతియు మరికొన్ని గ్రంథములను క్షుణ్ణముగా చదువుట జరిగినది.

బహుమతి వచ్చుటచేత కృతజ్ఞత రెట్టింపుగ నున్నది. శమ ఫలించినదన్న తృప్తి యున్నది.

ఈ నవలలో కథానాయిక పాటలి. ఆమె మహాప్రతిభావంతురాలు. నేను రచయిత్రిని. నా గ్రంథములందొక స్త్రీని, విశేషించి పాటలివంటి స్త్రీని సృష్టిచేయుట కొంత మానవ లక్షణముకదా! ఇంక నవలలో నధ్యాయముల విభజనము శీల చిత్రమును పెంచవలసినచోట్లు తగ్గించవలసినచోట్లు అధ్యాయములు ప్రారంభించుట, ముగించుట, ఏది వ్రాయవలయునో ఏది పాఠకుని స్ఫూర్తికి వదలిపెట్టవలయునో మొదలైన బహువిషయములకు నా బుద్ధియొక్క తీర్పులకు కడచిన పది పదునేనేండ్లుగ నా గురువుగారైన విశ్వనాథ సత్యనారాయణగారు అడప దడప చేసెడి యుపన్యాసాదికములే దేశికములు.

ఈ నవలలో నేనొక చిన్న చిత్రమును చేసితిని. సామాన్యముగ కథలో ప్రతినాయకుఁడు చనిపోవును. నాయకుఁడు బ్రదికియుండును. ఇందులో మిగిలినవాడు ప్రతినాయకుఁడు! నాయికా నాయకు లిద్దఱు మరణించిరి. ఇంతకంటె రసహీనత యుండదు. నాకుఁ దెలియును. పాశ్చాత్య గ్రంథములయందుకూడ నిట్లుండునని నే ననుకొనను. కావ్యమునందు రసమునకున్నంత ప్రాధాన్యము, నవలలో నక్కఱ లేదని చిట్టచివరకు నేను సమాధానముఁ జెప్పికొంటిని.

ఇందలి భాష నా పూర్వగ్రంథములలోకంటె నెక్కువ సరళముగ నున్నదని నా యభిప్రాయము. నా సమాసములు, నా పాండిత్యము నీ నవలయందు తగ్గించితిని. ఇది ఎకాడమీవారి నిబంధన, బహుమతి రావలయునన్న కోర్కెవలన జరిగినది.

అంతయు నీశ్వర సంకల్పము!

మల్లాది వసుంధర

# 1

ప్రేక్షంతేఽనిమిషాక్షాః పథికా హాలికస్య పిష్టపాండురితామ్
తనయాం దుగ్ధ సముద్రోత్థరత్నలక్ష్మి మివ సతృష్ణాః

పిండి అంటుకొనుటవలన తెల్లగ కనిపించు కృషీవలుని పుత్రికను క్షీరసముద్రమునుండి యుద్భవించుచున్న లక్ష్మీదేవిని వలె సతృష్ణాకమైన దృష్టులతో పథికులు చూచుచున్నారు.

ఆ హాలికతనయ పేరు పాటలి. ఆమె యొడలంతయు, మొగముమీఁద, చేతుల పైభాగమున కంచులికయొక్క చివరి చుంగులపై, ముంగురులపై, నెఱ్ఱని పరికిణీ కుచ్చెలలపై, కాలి యందెలపై, దంచుచున్న పిండి చింది, శరదాకాశ లక్ష్మివలె పాల సురుగులచే నొత్తుకొనఁబడి పాలకడలినుండి పైకిలేచుచున్న విష్ణు పత్నివలె, సకలజన నయనానందకారిణియై దర్శన మొసగు చున్నది. ఆమె జడలో పాటలీ పుష్పములను ధరించెను. పాటలిని ధరించుట యొక భోగము. అట్టి భోగమును కలిగియుండుట కామె ధనవంతురాలై యుండవలయును. జనులకానాడు పాటలి యెంత ప్రియమైనదో యంత యలభ్యమైనది !

పాటలీసుమములను గృహారామమునఁ గలిగియుండుటది యొక ఘనత. ఆ తరువును వ్యయప్రయాసముల కోర్చి దూర ప్రాంతములనుండి తెప్పించి, పెరటిలో నాటి శ్రద్ధగ పెంచవలెను. ఆ పుష్పములను నిత్యము ధరించు పాటలి నిజముగ నదృష్టవతి !

పాటలి తండ్రి ధనంజయుఁడు. అతఁడు గ్రామణి. ఆ గ్రామ మంతటిపై నాతఁడధికారి. గ్రామమున వేయి గడప యున్నది. వేయి యిండ్ల వారాతని మన్నింతురు. అయన తీర్పుల ననుమో దింతురు. వేయి కుటుంబములందలి తరుణవయస్కుల మనస్సులు పాటలినే ధ్యానించుచుందును. గ్రామణి మాట యనిన వారందఱకు రాజాజ్ఞ యన్నమాట !

ఆ గ్రామమున సాధారణముగ నెలకు రెండు పర్యాయము లెవో యుత్సవములు జరుగుచునే యుండును. ఆ యుత్సవ వేళల నన్నియిండ్లవారు నొకే యింటివారివలె నొకచోఁజేరి యానందవార్ధిలో మునుకలు వేయుచుందురు. గ్రామమునకు చుట్టును శాలిక్షేత్రము

లున్నవి. శ్రీ పార్వతీ నివాసభూములైన పుండ్రేక్షు వనములున్నవి - హరితహరితములై నిబిడములైన సస్యములతో నాచ్ఛాదితములైన మాగాణి పొలము లున్నవి. చిలుక పచ్చని చీరలు కట్టుకొని - తెలివలిపపు మేలిముసుఁగులు వైచికొనిన రాజస్త్రీ సౌందర్యమును వెలార్చు కంది శనగచేలు, మంచు ముత్తియముల జాలరులలో కప్పఁబడి నేత్రాభిరామముగ నుండును. బహువిధ ఫల వృక్ష భరితములైన తోఁపులున్నవి. వీని నన్నిఁటి నతిక్రమించి ప్రాణ దాయినియై సాయంకాలముల యందు చిఱుతరగలపై నుండి నాట్యముఁ జేయుచు శీతలత్వమును నింపుకొని వచ్చి స్పర్శ సుఖ మును కల్గించుచు, తీరములందలి కదంబ పుష్ప పరిమళమును మోసికొనివచ్చు పిల్లగాలులతో శరీరమనః ప్రాణములకు పరితృప్తి నొసంగు కృష్ణవేణీ తరంగిణి యా గ్రామము నంటుకొని ప్రవహిం చును. అది యా గ్రామీణుల చిరంతన తపఃఫలము !

ఆ నది వారి విహార భూమి, ప్రాణధాత్రి ! అనేక మధుర రహస్య ప్రణయజీవనప్రేక్షకురాలు. ప్రణయవేదనా పరిదీన గాథ లను కడుపులో దాఁచుకొన్న కన్నతల్లి. సకలజన సౌభాగ్య సంప త్సమృద్ధి హేతుభూతురాలైన చల్లని పాలవెల్లి ! ఆ గ్రామవాసులం పర్వదినములలో కౌముదీ జాగరము, సువసంతకము, మదనోత్స వము, యక్షరాత్రి, మొదలైన యుత్సవదినములలో నీ నదిపై నౌకా విహారముల కేరింతలుగ కాలము వేగింతురు.

ఆ గ్రామము రాజధానీనగరమైన ధాన్యకటకమునకు గవ్యూతి దూరములో నున్నది. ఆ గ్రామమున సైనికు లాశ్వికులున్నారు. సమయము వచ్చినచో పిలుపుపై యుద్ధముల కేగెదరు.

ధనంజయుని కుటుంబము పెద్దది. ముప్పురన్నదమ్ములు, వారి భార్యలు, పిల్లలు, వృద్ధమాత, అందఱును సమష్టిగనే జీవింతురు. ఆ కుటుంబమునకు గృహాధిపతి ధనంజయుఁడు. గృహపత్ని మిహిర, ఆయన భార్య. కుటుంబమంతయు వీరి కనుసన్న మెలఁగును. సమష్టి వ్యవసాయము చేయుదురు. ధనం జయుని తమ్ము లిద్దరిలో నొకఁడైన మందారకుఁ డాశ్వికుఁడు. రెండవ యాతఁడు శాలికుఁడు. మందారకుఁడు ప్రతిదినము కొలువు కూటమునకు వెళ్లివచ్చుచుండును. అతనికొక మగబిడ్డ రోహితుఁడు. రెండవ తమ్ముఁడైన శాలికుఁడు వ్యవసాయము చూచును. అతని భార్య రోహ. అతని కిరువురు కూతుండ్రు పసివారు. తల్లి బప్పిక వృద్ధ. ధనంజయుని కొక కూఁతురు, కొడుకును. కూతురు పాటలి

కొడుకు లలితుఁడు. లలితుఁడు పాటలికన్న పెద్దవాఁడు. మందారకుని భార్య శ్రీపాలి రోగగ్రస్త. ఆమెకుఁజేయు సపర్యలన్నియు పాటలీలలితులే చేయుదురు.

రోహితునికి పాటలియొద్ద చనవు మిక్కిలిగ నున్నది. వాని విషయము లన్నియు నామెయే చూచికొనును. మందారకుఁ డిల్లు పట్టకుండ కాలము గడపును. అతఁడు భార్య నెంతేని ప్రేమించును. ఆమెను రోగిగ చూడలేడు. ఎల్లవేళల కొల్వుకూటమున కేగు సమయము మిగిల్చి శాలిక్షేత్రములందు కృష్ణానదీ తీరములందు స్నేహితుల యిండ్లలో కాలము గడపును. శాలికునకు వ్యవసాయ మేమో తానేమో! భార్య పిల్లలును కూడఁ బట్టరు.

రోహ గడుసరి, అలంకారప్రియ. ఆమె కన్ను లెప్పుడు కోర్కెల వెలిగ్రక్కుచుండును. ఆమెకు భర్త యనిన మనస్సునందొక విధమైన యనాదరము, పిల్లలనుసైత మెదోబాధ్యత యన్నట్లు చూచునే గాని ముద్దుసేయదు. అందులకు కారణము వారు తనవలె నంద కత్తియలుగఁ గాక తండ్రినిబోలి మోటుగఁ గనిపించుటయే. ఆమె యింటి పనులు చేసికొనుచునే మధ్య మధ్య వాతాయనముల తెరలు తొలగించి వీథులలోనికి కోర్కికన్నులఁ బఱపుచుండును. ఉత్సవ సమయములం దామె మొగమును చూడవలెను. వేయితామర లొక్క పరి పకపక నగినట్లుండును. పర్వమెల్ల తన కనురూపమైనట్లుగ సంచరించును.

శాలికునికీ విషయములు పట్టవు. పోగా పిల్లల నిర్వారను ధనంజయుని భార్య మిహిరయే చూచుకొనవలెను. ఆమె గంభీర స్వభావము మెత్తని మాటలు ప్రేమమయప్రవర్తనలచే నూరిలో నెల్లరకు గౌరవనీయురాలైనది. పెద్ద కుటుంబమున కధికారిణి నన్న గర్వమామెకు లేదు. వినయ సంపదకామె కాణాచి, ధనంజయునికామె క్రియానైపుణ్యమునం దమితమైన విశ్వాసము, ఆమెతో సంప్రతించి కాని తానే నిర్ణయమును దీసికొనఁడు. మగని మనస్సున కెక్కిన యిల్లాలుగ విధేయురాలైన కోడలుగ ప్రేమమయియైన వదినగ జాలిగుండెగల యజమానినిగ నందఱి మనస్సుల నాకట్టుకొనినది. పాటలియం దామెకు ప్రత్యేకమగు ప్రేమ యున్నది. తన కూఁతురి సౌందర్యమునకు తానే మురిసిపోవును. పాటలి నొక గొప్పరాజాస్థానమునందున్నత పదవియందున్న వరున కిచ్చి పెండ్లి చేయవలెనని యామె సంకల్పము. ధనంజయున కామెను తనవంటి యొక ధనికభూస్వామి గృహమున నిచ్చినచో

నిర్విచార సుఖజీవనము జరుగునని యూహ.

పాటలి మనోభావములు వేరొక విధమైనవి. ఆమెకు తానొక వీరపత్ని కావలెనని, తానుగూడ వీరవనిత కావలెనని యభీష్టము. సాతవాహన సామ్రాజ్యమునఁ దన కీర్తి సుస్థిరముగ నిలిచిపోవలెను. తన భర్తయుఁ దానును వీరగాథలలో నగ్రగణ్యులుగ వాసికెక్క వలెను. ఇట్టి వొకతెగ యూహలు తాను శృంగారరస సామ్రాజ్య పట్టమహిషి. తన భర్త తనయందు నిరంతర లగ్నబుద్ధి. తమ శృంగారలీల లన్యజనుల కీర్ష్యాజనకములుగ నుండవలె. తాను రతీదేవి. తన భర్త మన్మథుఁడు! ఇట్టివే యెడతెగని యూహలు సాగుచుండెను.

పాటలికి తన యింట కావలసినంత స్వేచ్ఛాస్వాతంత్ర్యము లున్నవి. తా నందఱకు గారాబుబిడ్డ. ఊరిలో నందాలరాశియని గొప్ప. ఆమె యా చిన్న గ్రామమునకు మహారాణివలె నుండెను. ఆమె యూహ లిట్లు సాగు నిట్లు సాగవని లేదు. ఆమె యేదియేని యూహించినచో మరునిముసమున దాని నాచరణలో నుంచును. ఆమెకు వీరగాథలన్న మక్కువ. సత్యభామ యామె కారాధ్య దేవత. ఆమె గదియందు సత్యభామా శ్రీకృష్ణదేవుల శృంగారలీలల వర్ణచిత్రములు పెక్కు లున్నవి. శృంగార వీరముల తానుగూడ నామె యంతటి స్థాయికి రావలెనని యామె యౌవనోదయము నందలి మధురోహ!

ఆమెకు తన పినతండ్రు లిరువురిలో సైనికుఁడైన మందార కుని యొద్ద మాలిమి హెచ్చు. అయిదాఱేండ్లు వచ్చిన దగ్గఱనుండి పినతండ్రితో వాహ్యాళులు, నదిలో నీదులాడుటలు, గుఱ్ఱముపైఁ గూర్చుండి యూరేగుటలు! పినతండ్రి యుద్ధములు, వీరుల సాహస గాథలు, గూఢచారుల చర్యలు, సైనిక విన్యాసములు మొదలైనవాని గూర్చి పరమోత్సాహముగఁ జెప్పుటలు తానంతకంటె మితిమీరిన యానందమున ముక్కులు వైచుచు వానితో తాదాత్మ్యము ననుభ వించుటలుగ పదిరెండేండ్లు సాగినవి. ఈ పదిరెండేడులలో పాటలి వివిధములైన సైనిక ప్రక్రియలలో నారితేరినది. ఆమె కృష్ణానది ఒకే బిగువున నొడ్డులొరయు ప్రవాహము నవలీలగ నీదరినుండి యాదరి కీదగలదు. బల్లెమును విసరుటలో విల్లు చేఁబూని లక్ష్య భేదన మొనర్చుటలో గుఱ్ఱము నెక్కి లంఘించుటలో నారితేరినది. కత్తిపట్టి యుద్ధము చేయుటలోని మెలకువ లిప్పుడిప్పుడే నేర్చుకొను చున్నది. పండ్రెండేడు లనవరతముగ సాగిన యీ పరిశ్రమచే నామె

తనువల్లి దృఢమై పరిపుష్టమై సమవిభక్తాంగములు కలదై కను
విందుగ నుండెను. ఆమె కత్తివలె నిటారుగ నుండును. ధనస్సు
వలె వంగగలదు. బల్లెమువలె దూసికొని పోగలదు. చేపవలె నీద
గలదు !

మందారకునికి పాటలి యనిన ముద్దు. భార్యయైన శ్రీపాలి
యందెంత ప్రాణమో బిడ్డయు శిష్యురాలు నయిన పాటలి యన్న
నంత ప్రాణము. రాజధానిలో నేవింత జరిగిన నది యానాడే
పాటలికిఁ దెలియఁజేయును. ఆ తండ్రి కూఁతు లిరువురు ప్రతి
దినము సాయం సమయముల కృష్ణానది యిసుక తిన్నెలలోనికి
వాహ్యాళి పోవుదురు. రాజకీయములఁ జర్చింతురు. రాజాంతఃపుర
వార్త లుబుసుపోకకుఁ జెప్పుకొందురు. మహారాజు గౌతమీపుత్ర
సాతకర్ణికి తల్లి యనిన నమితానురాగము. తన పేరు శ్రీసాతకర్ణికాగా
తన తల్లిపై ప్రేమకు, భక్తికి, నిదర్శనముగ తన నామధేయమునకు
ముందు "గౌతమీపుత్ర" యని చేర్చుకొనెను. తన బిడ్డనికిఁ గూడ
వాసిష్ఠీపుత్ర పులుమావి యని మాతృనామముపపదముగ నుంచెను.
ఆయన సాక్షాత్తు దేవేంద్రునివలె నుండును. ఆ గౌతమీదేవి పరమ
సౌందర్యవతి. మహారా జేకపత్నీవ్రతుఁడు. రాజులలో నట్లుండు
టాశ్చర్యముకద! మొన్న నేమైనదో తెలియునా? శకరాజ్యము
నుండి గుఱ్ఱములు వచ్చినవి. వానిపై స్వారిచేయుట కష్టసాధ్యమైన
విషయము. కాగా యువరా జవలీలగ వానిని వశపఱచుకొనెను."

ఇట్టి విషయము లన్నియు పాటలి హృదయములో పీట
పెట్టుకొని కూర్చుండి యామెను నిరంతరము తద్భావనాభావిత
చిత్తవృత్తి కలదానినిగ నొనర్చెను. అన్నయైన లలితునితో తా నివి
యన్నియుఁ జెప్పును. లలితుఁడు నవ్వి—"చెల్లీ! పోవే నీకివి
యన్నియు నెందులకే?" యనును. పాటలి చిఱుకోపముతో
బిగియును. లలితుఁడు "చిన్నాన్న నిన్ను చెడగొట్టినాడే" యనును.
పాటలి "నన్ను చెడగొట్టినచో నిన్నును నంతియేకదరా" యనును.
లలితుఁడు "నేను మగబిడ్డనే" యనును పాటలి, "ఓహో!
పాపము ఆడువారు తక్కువవారా? మేమే కీర్తి తేవలసినవార"
మనును. సత్యభామాదేవిని తలచుకొను మనును. అన్నా చెల్లెండ్రు
మువ్వల మ్రోతలుగ గలగలమని నవ్వుకొందురు. మందారకుఁడు
వారిని జూచి కన్నుల నానందము వెల్లివిరియించును. ధనంజ
యుఁడు వీరి నందరిని పసివారుగ లెక్కగట్టును. శాలికునితో
మాత్రము వ్యవసాయమును గూర్చి ముచ్చటించును.

ధనంజయు నిప్పుడు రెండు సమస్యలు వేధించుచున్నవి. పాటలి యుక్తవయస్కురాలైనది. పెండ్లి చేయవలెను. లలితుఁడు నిరుద్యోగియై యూరక తిరుగుచున్నాఁడు. వానికిఁగూడ పెండ్లిచేయు టవసరము. వాని జీవనవిధాన మెట్లుండును? వ్యవసాయము మీఁద వానికి శ్రద్ధ యున్నటుల లేదు. రాజధానిలో నేదైన పని దొరకునేమో మందారకునికి చెప్పవలెను: పాటలి కొఱ కైదారు సంబంధములు వచ్చినవి. కాని యవి తనకు నచ్చలేదు. తన బిడ్డ విధివశమున హాళికులలో జన్మించినది. కాని రాజాంతఃపుర యోగ్య! ఆమెను సరియైనచోట నీయకున్న తన మనస్సునకు శాంతి లేదు. ఆమె విద్యావతి. బహువిషయ పరిజ్ఞానము కలది. సర్వనాగరక కళలయందు నభ్యాసము కలది. మన్మథోత్సవములలో నైదాఱేండ్ల నుండి రతి యామెయే యగుచున్నది. ఆమె యే నృత్య మొనర్చినను, ఏ గీత మాలపించినను జనులు మోహితు లైపోవుదురు. పురుష విద్య లన్నింటిని నేర్చినది. "ఈ నా చిట్టితల్లిని భరించు నాతఁడు శివుఁడైనఁ గావలె, కేశవుఁడైనఁ గావలె"—ధనంజయుని యూహ యిట్టిది.

వచ్చిన సంబంధము లెల్ల విచ్చిపోవుచుండగా జనులు గుసగుసలుగ నీ విషయమును విడ్డూరముగఁ జెప్పికొనుచుండిరి. అవి తనదాఁక వచ్చెను. కాని తానేమి చేయును? మిహిర కూడ నంగీకరించవలె గద! బప్పిక మనుమరాలి పెండ్లికై తొందర వెట్టును. మందారకుఁ "డింత తొందర యేమి? చిన్నపిల్లకదా" యనును. పెండ్లి యైనచో పాటలిని వదలి యుండవలసివచ్చునని యాతనికి దిగులు. వీని నన్నిఁటి నటుంచి ముఖ్యముగ పాటలి తన కిప్పుడు వివాహము వలదనును. తానేదో చేయవలె ననును. అప్పటి దనుక నింతే యనును.

పాటలి యభీష్టమునకు వ్యతిరేకమును చెప్పు టాయింట నలవాటులేదు. పాటలిపాణి నభిలషించు యువకుల కందఱకు నాశాభంగ మగుచుండెను. కోడెవయస్సు కావరములో హాలిక క్షేత్రములలో చెఱకుతోటలలో పాటలి దారిఁగాచిన కొంతమంది యువకుల నరములు మెలికలు తిరిగినవి, చెంపలు కెంపులైనవి. పాటలి యనిన వారి కెల్లరకును సింహస్వప్న మయినది. ఆమె నెవ్వరు నేమియుఁ జేయలేరు. ఆమె యా గ్రామమునందలి యువకులకు పెరటి తంగేటిజున్నువంటిదైనను దరిజేరఁ బోవుచో తేనెటీగలు కుట్టును. ఆమె వారి బ్రదుకుల గట్టితనమునే తేల్చి

వేయును. అందువలన నామెను దూరమునుండి చూచి యానందించవలసినదేగాని దరియుటకు సాధ్యముగానిదయ్యెను. ఆమె యాకాశదీపమువంటిది! అందుచే చేయునదిలేక యువకులెల్లరు నిస్పృహతో డిల్లపోయి తలిదండ్రులు తెచ్చిన సంబంధములఁ జేసికొనుచు పాటలిని మనస్సులందు నిల్పుకొని కన్నుల కఱవుదీరఁ గాంచుచు దినముల వెళ్ళదీయుచుండిరి.

ఇది యిట్లుండ నొక చమత్కారము జరిగినది. పాటలి కొక సంబంధము వచ్చినది. తండ్రికొడుకు లిరువురు పాటలినిగూర్చి విని ధనంజయుని మంచితనముఁ దెలిసికొని సాహసించి పాటలి నడుగుటకై వచ్చిరి. ధనంజయుని యూరైన వికుంఠపురమునకు నాలుగు గవ్యూతుల దూరముననున్న విరజపురమునుండి సంబంధమునకై వచ్చిరి. వారు ధనంజయునంతటి ధనవంతులు గాకపోయినను వారిది అన్నవస్త్రములకు లోటులేని సంసారము. పాలము వ్యవసాయము ప్రధానముగా గలవారు. మర్యాదగలవారు. ధనంజయుఁడు వారిని వారూహించనంత ఘనముగ గౌరవించెను. పాటలిని వారికి చూపించెను. వారు వచ్చు వేళకామె పిండివిసరుచున్నది. శరీర మంతయు పిండికొట్టుకొని యున్నదానిని, రేగి వొంకులు తిరిగిన ముంగురులపై నంటుకొనిన తెల్లని పిండిచే, పుప్పొడి యంటుకొనిన తుమ్మెదలు మూసిరిన పద్మమువలె నున్న ముఖము కలదానిని, నిత్యవ్యాయామముచే కఠినములై నృత్యాభ్యాసముచే లాలిత్య మలవడిన యవయవములు కలదానిని, నల్ల కలువరేకులవలె విశాలములై సూర్యాంశువులవలె తీక్ష్ణములయిన చూపులుగల కన్నులదానిని, పాటలీకుసుమములచే నలంకరించుకొనిన జటాబంధము కలదానిని, మెఱుపుతీగవంటి శరీరకాంతి గలదానిని, యెఱ్ఱని పావడాను నీలికంచులికను ధరించి పసుపుపచ్చని వలెవాటుఁదాల్చి జగన్మోహినియై కన్పించిన పాటలిని, తండ్రికుమారు లిరువురు పాలసంద్రమునుండి లక్ష్మి యుదయించినది, పాలనురువు లింకను పచ్చియాఱక యామె శరీరమున నంటుకొని యున్నవి కాబోలు నన్నట్లు మోహితచిత్తులై యనిమిషదృష్టులై సతృష్ణముగ చూడఁదొడగిరి!

లజ్జారహితమైన వారి ప్రవర్తన పాటలి కసహ్య మనిపించెను. ఆమె గిరుక్కున వెనుదిరిగి లోపలికేగెను. ధనంజయుఁడు నవ్వుకొనెను. ఆ తండ్రికుమారు లిర్వుర కామె వెడలిపోవుట గాని, యాతఁడు నవ్వుకొనుటగాని యేమియుఁ దెలియదు. తాము వినిన

దానికంటె కనినప్పటి యామె సౌందర్యము వారి కన్నుల మిఱుమిట్లు గొల్పగా నవాక్కులు ననిమిషులునై చేష్టలుడిగి యుచ్ఛ్వాసమాత్ర చేతనులై యుండిరి. నాలుగైదు నిముసములు గడచుపరకు వారలకు తెలివివచ్చినది. ధనంజయుండు పొనర్చిన సపర్యల స్వీకరించి వెడలివత్తుమనిరి. ధనంజయుఁ 'డదియేమి? మా పాటలి నచ్చినదా? ఇంత త్వరపడుచుంటిరేల?' యనెను. వారు తమ గ్రామమునకేగి మరల వచ్చెద మనిరి. ధనంజయుఁ డటులే కానిం డనెను. లలితునికి వారి వైఖరి చిత్రముగ గన్పించెను. అతఁడు వారు వెడలి పోవుచుండగా కందిచేల మధ్యనుండి వారికిఁ దెలియఁబడకుండ వారల వెన్నంటిపోఁ దొడఁగెను. జనసంచారము పలుచబడినచోట తండ్రికొడుకు లిరువురు నోరువిప్పి మాటాడుకొనిరి.

తండ్రి : ఏమిరా! ఏమందువు? ఆ పిల్ల నీకు నచ్చినదా?

కొడుకు : నాన్నా! ఆ ప్రశ్న నిన్నే యడుగుకొనరాదా?

తండ్రి : పెండ్లి యాడఁబోవునది నేను కానుగద!

కొడుకు : నీ వామెను చూచిన చూపునుబట్టి నీవే పెండ్లి యాడెద వనుకొంటిని లెమ్ము.

తండ్రి : ఓరీ! తండ్రితోనా నీ పరిహాసము?

కొడుకు : కాదు నాన్నా! అది యా పిల్లలో నున్నది. అందఱు నెదో యందకత్తెయని చెప్పుకొనుచుండగా నేమోకాబోలు ననుకొంటిని గాని. అమ్మో! ఇదేమి! ఆమెను చూడగనే నాకు కన్నులఁ జీకట్లు క్రమ్మినవి. మహారాజమాత గౌతమీదేవి యట్లుండును. నే నామెను చూచి మహారాజమాత యిచ్చటికేలవచ్చెనా యనుకొంటిని!

తండ్రి : మహారాజమాతను నీ వెప్పుడు చూచితివి?

కొడుకు : విజయోత్సవములలో నొకనాఁ డామె పర్యవేక్షణలో సైనిక విన్యాసములు జరిగెనుగదా! అప్పుడు నేను చూడబోయితిని, గౌతమీదేవి యొక యిరువదేండ్ల వెనుదిరిగిననామెవలె నుండు నని పించును.

తండ్రి : అయినచో నిప్పుడింక నీవేమందువు?

కొడుకు : నాన్నా! ఆమె చంద్రకిరణమైనచో నుత్తరీయ మొడ్డి దాఁచుకొనఁగలను కాని యామె యగ్నిజ్వాల! ఆమెను మనము మన సామాన్యగృహములలో దాఁచుకొనగలమా? ఆ దీపశిఖ ప్రజ్వరిల్లి మన గృహముల మండించును. ఆమె సౌందర్యా నలములో మన మానమర్యాదలు భస్మము కావచ్చును.

తండ్రి : అదేమి మాటరా? చిత్రముగ నున్నది.

కొడుకు : నాన్నా ! ఈమెను దెచ్చి యింటిలో నుంచుకొనిన మరునాఁడు మన విరజగ్రామమునందలి పాటలీ సుమములన్నియు మన యింటి ముంగిట రాశులై పడియుండును. మన యింటిచుట్టు వందలకొలది కన్నులెడతెగక రెప్పవాల్చక దడికట్టినట్లుగ చూచు చుండును.

తండ్రి : తెలిసినది నీ భయము, ఆ పిల్ల దేవతాస్త్రీవలె నున్నది.

కొడుకు : అవును. అట్టి స్త్రీలు గృహములలో నుండుట కయోగ్యలు, గృహపతికి దుఃఖహేతువులు కాగలరు. మన కా సంబంధము వలదు. మనము దూరముండుండి నమస్కరింప వలసినదేకాని మరేమియుఁ జేయరాదు.

తండ్రి : నీ వన్నది నిజము. ఆ పిల్ల యెదో కామినీగ్రహము వలె నున్నది. లేకున్న నీకు సంబంధముఁ జూచుటకు వచ్చిన నా మనస్సామెయందుఁ దగుల్కొనుట యేమి ? ఇట్టి దెచ్చటనైన నుండునా ?

కొడుకు : నాన్నా ! ఆమె యటువంటిదే యగును. అదే యామె యందము ! చిమ్మని గ్రోవి చిలకరింపులవలె నా యొడలంతయుఁ బులకలెత్తించినది. నాన్నా ! నీవు గమనించితివో లేదో గాని నా కచట నామెను చూడగానే మోహము క్రమ్మినది. అందుచే గమనించలేదు కాని, యిప్పుడు యోజించగా తోచుచున్నది. ఆమె కన్నులలో నేదో జ్యోతి మెలికలు తిరుగుచున్నది. అది యచ్చముగ యుదయకాలపు టీరెండలో శనగచేను గట్టుపై మెలికలు తిరుగుచు జరజర సాగిపోవు గోదుమవన్నె త్రాఁచు శరీరపు తళతళవలె నున్నది. అమావాశ్యనాటి రాత్రివేళ పొదలోనుండి మండుచు గన్పించు పెద్దపులి కన్నులలోని కాంతివంటిది. ఏది యెట్లయినను నామె కంటికి వ్రేఁగైన యందగత్తె మాత్రమగును. సందేహము లేదు.

తండ్రి : నిజమే. అంతటి యందము మన రైతుకుటుంబములలో నెట్లువచ్చినదో యాశ్చర్యముగ నున్నది. ధనంజయుఁడు కూడ మనవంటివాఁడె ! అధికుఁడేమియుఁ గాడుకద !

కొడుకు : నీ వేమందువు ?

తండ్రి : ఆమె పుట్టుకయే యాశ్చర్యము ! దానియందేమైన రహస్యము లున్నవేమో యని !

కొడుకు : అదియు వాస్తవమే కావచ్చును. అయన గ్రామణి

కద! సైనికులు రాజాధికారులు వచ్చుచుందురు పోవుచుందురు. మన కేమితెలియును? ధనంజయుని కుటుంబములోని వారందఱు విశృంఖలముగ నుందురఁట! అందులో నీ పాటలి మగరాయని వలె పినతండ్రితో అన్నగారితో సమముగ యుద్ధవిద్యలు గూడ నేర్చినదఁట!

తండ్రి: అంతేకాదు నాయనా! ఈమె గ్రామములోని చాల మంది యువకుల నవమానించినదఁట. కొందరిని కొట్టినదఁట కూడ!

కొడుకు: అటులనా! మనకా సంబంధము వద్దు. నాకంత యందకత్తియ యయిన భార్య వద్దు. నాకు భార్యకావలెననుకొన్న యువతిపై నా తండ్రి కన్నులు నిల్చినవన్నచో నామె నాకు భార్య కారాదు.

తండ్రి: అది నీయిష్టము.

లలితుఁడు వారి సంభాషణము నంతయు వినుచుండెను. నిముష నిముషమునకు వాని నరములు బిగుసుకొనిపోవుచుండెను. వారిర్వుర నొక్కుమ్మడి కీళ్ళువిరిచి కుప్పలుపెట్టద మనుకొనెను. తన చెల్లెలినిగూర్చి యిట్లు మాట్లాడిన వారినేమి చేసినను తప్పు లేదు. కాని తాను గ్రామణి కుమారుఁడు. తమ గ్రామమునకు వచ్చిన పెఱవారి నవమానించి వారినేమైనఁ జేసినచో విషయము రాజధాని పర్యంతము పోవును. దానిపై నింక విచారణలు. అది గాక తనతండ్రి మర్యాదకలవాడు. అయన యిట్టివి సహించఁడు. ఛీ! వీరితోనేమియని లలితుఁడు వెనుదిరిగిపోయెను. అయినను తనచెల్లెలి నామెయెత్తు ధనము రాశిపోసినను ఆ మూర్ఖునికిత్తుమా? అనుకొనెను.

ఇంటికి వచ్చిన లలితుని చూచుట కందఱ కాశ్చర్యముగ నుండెను. ఒకటే నవ్వు. నాలుగైదు నిముసములు గడచు దనుక యథాస్థితికి రాలేకపోయెను. ఇంటిలోని వారందఱు లలితుని చుట్టుముట్టిరి.

మిహిర: ఏమినాయనా! ఏమిటి పగులబడి పోవుచున్నావు? విషయ మేమిటి?

రోహ: అక్కా! మనవాఁడు తోటలో నెదో ఘనకార్యము చేసియుండును!

రోహితుఁడు: అన్న ఎవరినో చితుకఁదన్నియుండును!

శాలికుఁడు: వాడిపొగరు. పనిపాటలు లేకుండ తిరుగును.

బప్పిక : వాఁడు కుఱ్ఱనాగన్న. ఏదో నవ్విన నింత గొడవ కావలెనా ?

పాటలి : 'అన్నా ! మధు'...........లలితుఁడు కనుసైగ చేయగా నిట్లనెను. కాదు. మాధవుఁడేమైన చమత్కారములు చేసినాఁడా మరల ?

ధనంజయుఁడు : ఏమిటిరా గొడవ ? విషయము చెప్ప రాదా ?

మందారకుఁడు : లలితా ! పెండ్లివారేమయిన నన్నారా ?

లలితుఁడు : చిన్నాన్నా ! నీవు సూటిగ గ్రహించినావు.

లలితుఁడు తిరిగి నవ్వుచు—"నాకు మొదటినుండి వారి పద్ధతి చిత్రముగ నున్నది. వారికి తెలియ కుండ వారివెంట నేగితిని. ఇఁక వారి మాటలు వినవలె ! నాకు నవ్వును కోపమును వచ్చిన వనుకొనుము. నాలుగు పుచ్చుకొంద మనుకొన్నాను." అనినాఁడు.

ధనంజయుఁడు : అంతపని చేసితివికాదు. మంచివాఁడవు.

మందారకుఁడు : విషయమేమియో తెలియనేలేదు.

లలితుఁడు : చెప్పుచున్నానుమరి ! ఆ పెళ్లికొడుకున్నాడే వాఁడు శుద్ధ బుద్ధావతారము. నాన్నా ! అటువంటి వాళ్లను నేనెక్కడను చూడలేదు. వారికి మన పాటలి మోహినీపిశాచము వలె కామినీగ్రహమువలె కన్పించినదఁట ! మనుష్యులలో నింత యందముండదఁట, అందు వలన నీమెగ్రహమఁట.

అనుచు లలితుఁడు తిరిగి నవ్వసాగెను.

మిహిర : లలితా ! నా బిడ్డ నంతమాటలన్నారురా ? నీ నవ్వులకేమి ? విషయము చెప్పురా !

లలితుఁడు తేరుకొని – చిన్నాన్నా ! మన పాటలిని పెండ్లి యాడిన నూరిలోని పాటలీ కుసుమము లన్నియు కుప్పతిలఁబడు నఁట ! కోడెగాంగ్ర నేత్రయుగ్మము లింటిచుట్టు దడిగట్టునఁట ! పాటలి యగ్నిజ్వాల యఁట ! చంద్రకిరణమైనచో బెడఁదలేదఁట. త్రాఁచుపాము సౌందర్యమఁట. పెద్దపులి కన్నులఁట ! ఆమె నింటిలో పెట్టుకొనిన పరువుమర్యాదలు నష్టమగునఁట. ఎన్ని యన్నారని ! నాకు నవ్వు కోపము వచ్చినవి. ఆ తండ్రికిఁగూడ పాటలిని చూడగనే కోర్కె కలిగినదఁట ! ఛీ ! వారిమాటలెంత యసభ్యముగ నున్నవని !

మందారకుని కనులెఱ్ఱబడెను. రోహ కన్ను లింతలు చేసి

కొని పాటలిని క్రొత్తగ చూచుచుండెను. ధనంజయుఁడు గంభీరముగ నుండెను. బప్పిక మనుమరాలి నక్కునఁజేర్చుకొని – "నాతల్లి లక్ష్మీ దేవివంటిది. దృష్టితీయుఁ" డనెను. మిహిర – "వారల కదేమిరోగము? నా బిడ్డ నంతమాట లనినారా? మన మేమైన వారిని రండని యాహ్వానించితిమా? వారికి బిడ్డ నిత్తుమంటిమా? అదృష్టహీనులు. నా బిడ్డ వారియింట నుండు టరిష్టమా? వారు పాటలిని చూచుటే దోషము. బిడ్డ కెఱ్ఱనీరు తీయవలె" ననెను.

రోహితుఁడు: పెద్దమ్మా! ఆ పెండ్లికొడుకు గాడిదవలె నున్నాడు కదూ!

అనగా నందఱును విరుగబడి నవ్విరి. ధనంజయుఁడు రోహితు నెత్తికొని "నీవు నిజము చెప్పితివిరా, అక్క గాడిదను కట్టుకొను నటరా! అక్క జాతిగుఱ్ఱము వంటిదిరా! అది యున్న యిల్లు లక్ష్మీనివాసమురా" యని పాటలి మూర్ధమును ముద్దిడుకొనెను.

తరువాత నలువురు నాలుగుపనులపైఁ బోయిరి.

పాటలీ రోహితులు మాత్రము మిగిలిరి.

రోహితుఁడు: అక్కా!

పాటలి: ఏరా!

రోహితుఁడు: జాతిగుఱ్ఱ మంటే నాన్న నీవు అన్న యెక్కే గుఱ్ఱమేనా?

పాటలి నవ్వుచు – "కాదురా! పంచకల్యాణి యని యుండును. దాని నెక్కినచో నది యాకాశమున కెగురును. మేఘములలో పర్వులిడు" ననెను.

రోహితుఁడు: అది యెక్కడ నుండును?

పాటలి: మహారాజుల యొద్దనుండును బాబూ!

రోహితుఁడు: నీవు మహారాజును పెండ్లి చేసికొందువా అక్కా!

పాటలి: తప్పు. అట్లన కూడదు.

రోహితుఁడు: పోనిమ్మ. మహారాజు వంటవానిని చేసికొందువను కొందును.

పాటలి: ఛీ! పో! యని తమ్ముని కౌగలించి ముద్దువెట్టి పంపివేసెను.

సాయంకాలమైనది. అకస్మికముగ ప్రియునిచే కౌగిలింపఁ

బడిన ముగ్ధప్రేయసి వదనమువలె లజ్జారుణముకాగా నామె తన తెల్లని చేతులలో మొగము కప్పుకొనినట్లు ఆకాశము విరాజిల్లు చుండెను.

పాటలికాదృశ్యము మనోహరముగ నుండెను. కృష్ణవేణీ తరంగములపైనుండి పంటచేలపైబడి సాగివచ్చు చల్లగాలులు శరీరమునకు హాయిని కలిగించుచుండెను. గ్రామము నందలి పూరిండ్లపై నుండి ధూమరేఖలు వలయములై ఆకసమున వ్యాపించుచు నాట్యవేళల వాయుద్ధూతమై నలుదిక్కుల పర్విన శివజటాటవివలె స్పృహణీయముగ నుండెను.

ప్రొద్దుటి విషయమును గూర్చి పాటలి తలపోయుచుండెను. కామినీగ్రహము! దేవతా సౌందర్యము! తనకు భార్యయగుట కయోగ్యురాలా? అంతకంటె నాతఁడు పురుషుఁడగుట కయోగ్యుఁ డనుకొనరాదా? ఒకవేళ వారంగీకరించినచో తన తండ్రి తన్ను వారికిచ్చెడివాఁడా! ఆ వికారపురుషు నెవ్వరు వివాహమాడెదరు? ఆ ముదుసలి తన్ను కన్నులతో త్రావెను. సిగ్గులేదు. కుమారుని సంబంధమునకై వచ్చి తానట్లు ప్రవర్తించెను. తనకు పెండ్లియే కాదా! తన్ను పెండ్లాడుట కెవ్వరు సాహసించరేమో! తన యాశయములు సిద్ధించవలయుననిన తన భర్త గొప్ప సేనాపతియై యుండ వలయును!

తమయింటికి చాలమంది వచ్చుచుందురు. వారిలో నెవ్వరును తనకు నచ్చినవారు లేరు. ఏదో జీవికానిర్వహణమునకై వృత్తి మాత్రముగ యుద్ధములు సేయుటెగాని దేశభక్తి రాజభక్తి స్వవిద్యా నైపుణ్యముపై నాసక్తియు కనిపించవు. ఈ లక్షణము లన్నియుఁ గలిగి రూపమున మన్మథ సదృశుఁడైన యువకుఁడు కావలె! అతని యుద్యోగమున నాతని కధికుఁడుండరాదు. మహారాజునకు బహిః ప్రాణమా యన్నంత దగ్గఱవాఁడు కావలెను. నగరమున నల్వురి నోళ్ల వాని జయగానము ముఖరితము కావలె! శ్రీకృష్ణదేవునివలె నల్లనివాఁడైన మరియు సంతసము! అట్టి వీరాగ్రణి తనకు భర్తగ లభించునా? జీవితాంత మట్టివానికై వేచియుండగలదు తాను.

పాటలి మధురోహలలో తేలిపోవుచు కన్నులరమోడ్పుగ కూర్చుండి యుండెను. దూరమున జాత్యశ్వము తీవిగఁ బరువెత్తి వచ్చుధ్వని వినిపించుచున్నది. పాటలి సత్వరములేచి వీధిలోనికిఁ జూచినది. గుఱ్ఱపు డెక్కల ధ్వని యంతకంతకు దగ్గఱ యగుచున్నది. పాటలికా ధ్వని వీరగీతమువలె వినిపించెను. ఆ నడకనుబట్టి యది

రౌతు గొప్ప యాశ్వికుఁడని విదితమగుచుండెను. ఔత్సుక్యమును బట్టలేక పాటలి మేడదిగి వీధిగడపలోనికి వచ్చెను. చిఱుగాలి వీచెను. ఆమె తన వలెవాటు చెంగును శిరముపైకి లాగుకొని మేలి ముసుఁగు వైచికొనిన రాచకన్నియవలె వీధిలోని కడుగు వెట్టెను. ఒక మహాశ్వము నధిరోహించి వచ్చుచున్న సైనికుఁడు కన్పడెను. పాటలి యా యశ్వమును జూచి యాశ్చర్యపడెను. ఇదియేమి ? ఉచ్చైఃశ్రవమువలె నున్నది! ఒడలంతయు నిష్కళంకమైన చందమామవలె నున్నది ! తానిదివర కెన్నఁడట్టి యశ్వమును చూడలేదు. ఆమె యాశ్చర్యముతో కన్నులింతలు చేసికొని ఆ యశ్వము నాలోకించుచుండెను. అశ్వికుఁడునట్లే పాటలిని తాను మున్నెన్నఁడు కనివిని యెఱుఁగని మహా సౌందర్యవంతురాలిఁజూచి యనిమిషుఁడై నిలిచెను. నాలుగైదు క్షణములు గడచినవి. అశ్వమా నాలుగైదు క్షణములు నిలుచుట కోర్వలేకుండెను. అది ముందునకుఱుకుట కుద్యమించుచుండెను. కళ్ళెము బిగియుచుండెను. పాటలికి దానినిఁ జూడగనే పైని యాశ్వికుఁడున్నాఁడని స్ఫురించి పైకిఁ జూచెను. ఆమె కచ్చెరువయ్యెను. తన మనస్సులోని మన్మథుఁడు వెలికివచ్చి తనయెదుట సాక్షాత్కరించెను. తన కన్నులలోఁ గన్నులుంచి సంభ్రమముగఁ జూచుచున్నాఁడు. పాటలి సిగ్గుపడి దోసిలిలో మొగముఁ దాచికొనెను.

# 2

కురునాథయివహి పథికో వ్యథతే కిలమాధవస్య మిలితేన
స్పృష్టో యదృచ్ఛయాఽయం ధక్షిణవాతేన భీమేన.

మధుమాసమున దక్షిణానిలముచే స్పృశింపఁబడిన పథికుఁడు మాధవునితో గూడిన భీముని దక్షిణ పాదముచే తన్నఁబడిన సుయోధనునివలె బాధపడుచున్నాఁడు.

పాటలీ ప్రథమ దర్శన మాత్రముననే యాతని హృదయ మామె యందు లగ్నమాయెను. పాటలీ సౌందర్య మోహితుఁడైన పుండరీకునికి సర్వ ప్రాపంచిక విషయములపై విరక్తి కలుగు చుండెను. ఆతనికి మధుమాసము గ్రీష్మమాయెను. మలయానిలము మహానల సదృశముగ, పండువెన్నెల నిండు చీఁకటిగ ఆత్మీయులు పెఱవారివలె ననిపించు చుండెను. స్నేహితులు మేలమాడు చున్నారు. తానేమియుఁజెప్పలేడు. ఆమె యెవరో తనకుఁదెలియదు. రెండేండ్లుగ తాను రాజధానియందుండుటలేదు. మహారాజు తన్ను మహారాష్ట్రమున నుండ నియమించెను. రెండేండ్లన్న మాటయేగాని యించుమించు నాల్గయిదు సంవత్సరములుగ తాను మహారాష్ట్రము ననే యున్నట్లు లెక్క. ఆతని కాంధ్రముతో సంబంధము తక్కువగ నుండెను.

మహారాజునకు తనయందు విశ్వాసము హెచ్చుగ నున్న ట్లున్నది. రాజ్యమునందు క్లిష్టమయిన పరిస్థితులున్న తావులనేరి తన్నచ్చట నియమించుచున్నాఁడు. తన్నెదో హారమున కమాత్యునిగ నియమించునని కింవదంతి వినిపించుచున్నది. తన్నుఁజూచి తోడి వారీర్ష్యఁ జెందుచున్నారు. మహారాష్ట్రభూభాగమున క్షహరాటుల యొత్తిడి యెక్కుడుగనున్నది. వారెదో మహా వ్యూహమును రచించి యుద్ధమునకు సన్నద్ధులగుచున్నట్లు చారుల వార్త!

క్షహరాటులు మహాశూరులు. వారిని నిర్జించుటన్న సామాన్య విషయముకాదు. మహారాజు తన్ను క్షహరాటులపై గూఢచారిగ నియమించెను. తానెన్నిమారులో శత్రువులచేతిలో చిక్కెడివాఁడే. కాని సాతవాహనీదేవి యనుగ్రహమున మహారాజు శుభకామనలచే నట్లు జరుగలేదు. త్వరలో భీషణ యుద్ధము రానున్నది. సాత

వాహన సామ్రాజ్య స్థాపనకి క్షహరాటులు మొదటినుండియు నడ్డుగ నిలుచుచున్నారు. ఈ పర్యాయము గౌతమి పుత్ర శ్రీ సాతకర్ణి మహారాజు క్షహరాటుల నామమాత్రావశిష్టులుగ చేయును. తన కట్లనిపించుచున్నది. చక్రవర్తి తానై స్కంధావారమునుండి సేనల నాదేశించును. ఆయన యంతటి సామ్రాజ్య స్థాపనాబుద్ధి! ఏ చిన్న విషయమునైన నతి సూక్ష్మముగ విచారించి తానుగ పరిశీలించిగాని యాచరణమునకుఁ దేడు.

ఆయన సామ్రాజ్య స్థాపకుఁడుగ నెంత సమర్థుఁడో యోద్ధగ నంత ప్రవీణుఁడు. పరిపాలనాదక్షత యాయన కుగ్గుతో నలవడిన లక్షణము. మహాసైన్యాధ్యక్షునినుండి పదాతిసైనికుని వఱ కాయన కుశలప్రశ్న లడుగుచునే యుండును. అందఱను కన్న బిడ్డలవలె నన్నదమ్ములవలె నాత్మబంధువుల రీతిని మన్నించును. రాజమాత గౌతమీబాల శ్రీదేవి సైతమెల్లర నట్లే సమాదరించును.

మహారాజునకు తల్లి యనిన నమితానురాగము, గౌరవము, భక్తి. రాజకీయ వ్యవహారము లన్నియు నామెకు నివేదించి యామె నిర్ణయముల స్వీకరించిగాని తానే కార్యము నమలుజరుపఁడు. సామ్రాజ్య విస్తరణమునకు మహారాజు ప్రయత్నించుచుండ నా మహాదేవి రాజ్యపాలనాభారమంతయు తనపై వైచికొని కొడుకునకు సహాయురాలై నిర్వహించును. తల్లియనిన మహారాజునకుఁ బ్రాణము. ఆయన యచ్చముగ నామెను బోలియుండును. అందు వలననే ఆయన యదృష్టవంతుఁ డయినాఁడు.

గౌతమీబాల శ్రీదేవికి మహారాజనిన కౌసల్యకు శ్రీరాముఁడు, యశోదకు శ్రీకృష్ణుడు నట్టివాఁడు. ఆయమ తన యేకైక పుత్రుని కుగ్గుపాలతోనే సర్వపురాణాంతర్గత మహాగాథలన్నింటిని విశదముగ వివరించి చెప్పెను. రామ కృష్ణావతారములందలి జీవితపరమార్థ ముల నాయనలో ప్రవేశపెట్టినది. శ్రీకృష్ణుని రాజనీతిచాతుర్యము, శ్రీరామచంద్రుని రాజ్యపరిపాలనాదక్షత, యేకపత్నీవ్రతము, వేద ధర్మ పరిరక్షణము మొదలైనవన్నియు నాచరణములో ప్రదర్శించు నట్లుగ నాయనను తీర్చిదిద్దినది. ఈ సామ్రాజ్యమున కేలిక రాజ మాతయా, రాకుమారుఁడా యన్నట్లుండెను.

రాజకుటుంబముల నట్టి మాతాపుత్రులుండు టాశ్చర్యకరమైన విషయము. గౌతమీపుత్ర్ర సాతకర్ణి యుద్ధయాత్రలకుఁ బోయి రాజ్య పాలనను తల్లిపై నిలిపి నిశ్చింతముగ నుండఁగలఁడు. అట్టి తల్లు లందఱకు నుండరుగద!

పుండరీకుని యాలోచనలు సాగుచుండెను. రాజకీయముగ పరిస్థితులు చిక్కులుగ నున్నవి. ముందీక్షహారాటుల బెడఁద నొక దాని నడ్డుకొనవలెను. అది సామాన్య విషయము కాదు. ఏండ్లు కూడ పట్టవచ్చును. వారితోడి సమరమనిన నదియొక ప్రళయము వంటిది. ఈ యుద్ధావసానము తనకు శుభంకరము కావచ్చును. ఈ ప్రళయము గడచినఁగద తమ యదృష్టములు నిర్ణయింపఁ బడుట! ఎంత యదృష్టమున్ననేమి! ఆ యందాలరాశి తనది కావలయును. అప్పుడు తా నదృష్టవంతుఁ డనుకొనవలెను. అది యేమి! ప్రథమ వీక్షణముననే యామె తన మనస్సును హరించి వేసినది!

తాను పలుదేశములు తిరిగెను. మహారాష్ట్ర ప్రాంతము లన్నియుఁ దనకు సుపరిచితములు. ఎచ్చట నితఃపూర్వము తన కన్నుల నాగి నిల్చిన సౌందర్యము కనిపించలేదు. తనకు తల్లిలేదు. తండ్రి లేడు. ఎవ్వరును లేరు. వరుసకు పినతండ్రి యయిన శంకరుని దయాదాక్షిణ్యములతో పెరిగి సాతవాహన సామ్రాజ్య సైన్యములో తొలుత పదాతిగఁ ప్రవేశించి నేటి కింతవాఁడైనాఁడు. ఆడువారితో తన కెట్టి పరిచయములు లేవు. వారినిగూర్చిన భావము సైత మతనికి రాదు. వచ్చిన గౌతమీబాలశ్రీదేవి వచ్చును. ఆమె నాతఁడు దుర్గాదేవివలె నర్చించును.

తన కిరువది యేండ్లు దాటుచున్నను స్త్రీ సంబంధముగ యోజనసేయు భావమే కలుగలేదు. తీరికయు లేదు. యుద్ధ సమయములం దప్పుడప్పుడు తోడి సైనికుల యసభ్య ప్రవర్తనల నేవగించుకొనెడివాఁడు. కాని అదేమి! ఆ చిఱువెన్నెలలో నామెను చూచిన నాటనుండి తన యొడలు తనవశము తప్పినది. ఆమె యెవరు? గ్రామ్యయువతులలో నంత సౌందర్య లావణ్య సౌకుమార్యములుండునా! ఆమె తన యశ్వమును మెచ్చుకనులతోఁ జూచెను. ఆమె యశ్వారోహణమునందు నేర్పరివలె ననిపించినది. గుఱ్ఱమును పరిశీలించుటలో నది మరియు స్పష్టముగ గోచరించినది. అయిన నా యింట నెవ్వరో సైనికులై యుండవలయును!

వికుంతపురముననున్న సైనికుల వివరములు సేకరించినచో నప్పుడామె విషయమంతయు తెలయఁగలదు. తన్నుఁ జూడగనే యామె సిగ్గు వడినది. ఆమె లజ్జాశీలము తన్ను ముగ్ధు నొనర్చినది. ఒక ప్రవీణయైన నర్తకి నాట్యవేళ ప్రదర్శించిన లజ్జాభినయము వలె నయనాభిరామ తనువై నిలిచినది. అది యామెకు సహజ

లక్షణము. తాను కన్ను మూసినను తెఱచినను, ఏపనిఁ జేయు చున్నను ఆ యువతియే సాక్షాత్కరించుచున్నది. మానవయువతు లలో నంత సౌందర్యము దుర్లభ మనిపించును. ఆమె యూర్వశీ రంభా మొదలైన దివ్యవనితల శ్రేణిలోనిది కావలయును!

పదునైదు దినములుగ తన మనస్సుడికిపోవుచున్నది. ఆమెను తిరిగి చూడవలెనననిన నెట్లు పొసఁగును? మరల వికుంఠపురమున కరిగిన బాగుండు ననుకొనును. వారి యింటికిఁ బోవు టెట్లు? వా రెవరో తా నెవరో! ఈ స్త్రీ వ్యామోహము మానవు నెంతసేయును! పదునైదు దినములలో ముక్కు మొగ మెఱుఁగని యా సుందరిని జూచి మోహితుఁడై బడలిపోయినాఁడు. ఆ యువతికి సైతము తనపై మోహ మేర్పడియుండునా! లేనిచో నామె యానాడంత సిగ్గుపడ వలసిన యవసరము లేదు. ఆహా! యేమి సిగ్గువడుట! జగన్మో హనముగ నున్నది. సిగ్గునకు సిగ్గు వచ్చునట్లున్నది! ఆమెను కలిసి కొనక తానిఁక నిలువలేడు. ఆ కలయిక యెట్లు సంభవము కాఁగలదు?

పాటలినిగూర్చి భావించుచున్న పుండరీకునికి సమయజ్ఞానము కలుగుటలేదు!

నాఁడు పూర్ణిమ. ఆకసమున చంద్రుడు పదాఱుకళలతో పరిపూర్ణుఁడై కర్పూరపురజము వెదజల్లుచున్నటుల దిక్కులన్నియు జ్యోత్స్నామయములయ్యెను. కృష్ణానదీ సైకతము చల్లనై వెల్లనై హిమరాశివలె గన్పించెను. నదీనీరముల వెండివెన్నెలలు ప్రతి ఫలించి కన్నెపిల్లలు వినోదమునకై యెగిరెగిరి గంతులిడుచున్నట్లు తరంగములు సొగను లొలికెను. సాయంసమయశీతలమంద పవనములు పుండరీకుని మేన సోకుచుండెను. ఆ చల్లగాలు లా వెన్నెలలు పుండరీకునికి బాధాహేతువులుగ నుండెను. ఎవరో తన్ను పరిహసించుచున్నటులను అవమానించుచున్నటులను ఊహించుచుండెను. సాయం వాహ్యాళికై వచ్చిన యువదంపతులఁ జూచి యాతని కొడలు మండిపోవుచుండెను. ఆతఁడు లేచి నదిలోని కేగి నీరు త్రావి కొంత మొగముపై చల్లుకొనెను. అతని మనస్సు నందలి విరహాగ్ని నీ కృష్ణాతోయములు చల్లార్చఁగలవా!

ప్రొద్దుపోవుచున్నది. యామికుల కేకలు వినవచ్చుచున్నవి. పుండరీకుని కివి యేమియు పట్టుటలేదు. తనవంటివాడేమైనఁ జేయవలసి వచ్చుచో తానైన నిర్వహించుకొనవలసినదేగాని తనకుఁ జేసిపెట్టువా రెవరును లేరు. ఆ పినతండ్రిసైత మిప్పుడు సజీవుఁడు

కాడు. ఎటులైన తానామెను వివాహ మాడవలయును. లేనిచో తన జన్మమునకు సార్థకత లేదు. మనస్సును స్థిరము చేసికొని యాతఁడు నదీపులినముపైనే నిద్రించెను. మెలకువవచ్చు వేళకు సూర్య కిరణములు వెచ్చనగుచు నాతని శరీరమును తాకుచుండెను. పుండరీకునికి నవ్వు వచ్చెను. తన జీవితములో నింత యలసత్వమును పొందుట కిదియే తొలిసారి యనుకొనెను.

మహారాజు తన్నీనాఁడు రహస్యమందిరమునఁ గలియవలెనని యాదేశించినాఁడు. ఏమి మాటాడునో! క్షహరాటులతోడి యుద్ధమును గూర్చి ప్రస్తావించునా ? ఆయన యేమిచేయునో యూహించుటకుఁ గూడ నందని గంభీరుఁడు! పుండరీకుఁడు లేచి కాల్యముల నిర్వర్తించి తన గృహమున కేగెను. ఆతని యింట నిరువురు పరిచారికలు నొక వంటకత్తియ మాత్రమే కలరు. ఆతని గృహము చిన్న గృహారామము కలిగి ముచ్చటగ నుండును. ఎల్లవేళల పరిశుభ్రముగ నుంచఁబడును. ఇంట నేమూలఁ జూచినను నాతని యుద్ధనైపుణ్యమును సూచించు పలురకములైన యాయుధములు, గోడలకు తగిలించినవి కన్పించును. వాని సౌందర్యలోలుపతకు నిదర్శనముగ పరమసౌందర్యరాశులైన చిత్రపటములు, దంతము, పింగాణి, యుపలము మొదలగువాని శిల్పము లెంతో మెలఁకువగ నమర్చఁబడియుండెను. గృహమునందున్నవేళల పుండరీకుని కా శిల్పములే స్నేహితులు.

ఆతనియొద్ద గూఢచారి వృత్తాంతములు, ఆ విద్యయందలి మెలఁకువలను గూర్చిన గ్రంథము లనేకము లున్నవి. వివిధాయుధ ప్రయోగ లక్షణములను నిరూపించు గ్రంథము లున్నవి. అతఁడు దివారాత్రము లీ గ్రంథములను పరిశీలించుటలో గడపును. ఆతనికి గ్రంథములు తలిదండ్రులు, ఆయుధములు సోదర వర్గము, శిల్పములు మిత్రబృందము. రాజు భగవంతుఁడు. స్వదేశ స్వధర్మ రక్షణములలో ప్రాణము లొడ్డుటకైన వెనుదీయని ధీరబుద్ధి. తన చుట్టునున్న సాటి సైనికులకు నాశ్రితులకు విరివిగ ధనము నొసగు నుదార స్వభావము గలవాఁడు. తనకు లభించు వేతనము, తాను గాక నింక నాలుగు కుటుంబములఁ బోషించగల్గినంత యుండును. అంత ధనమును తా నేమిచేయును ?

తన జీవితము గూఢచారివృత్తి ప్రధాన మయినది. క్షణక్షణ సంశయగ్రస్తమయిన బ్రదుకు. తన సంపద తన్నుఁ గాపాడఁ జాలునా ? తన బొందిలో నూపిరి యాడునంతకు రాజాజ్ఞాపరిపాలన

తన ధ్యేయము. అందువలనఁ దన యాశ్రితవర్గ మాతనికిఁ బ్రాణము వెట్టుదురు. అతని యింటనున్న వంటకత్తియ యాతనిని స్వీయపుత్త్రకునివలె ప్రేమించును. ఆమె యాతని గృహమున కుదురుట కొక గాథ యున్నది. ఆమె భర్తయు తనయుఁడు నిరువురు సైనికులు, శకులతోడి గౌతమీ పుత్త్రసాతకర్ణికి జరిగిన యుద్ధములో నామె భర్త మరణించెను. పుత్త్రుఁడు క్షతగాత్రుఁ డయ్యెను. మహారాజ సైనికవైద్య నిలయమున చికిత్సలకు సైత మాతఁడు కోలుకొనలేదు. పుండరీకుఁ డాతనికై జాలిపడి నూత్న వితంతువు, నేకపుత్త్రకయు నైన యామె దుస్థితికి కఱగిపోయి ప్రత్యేకశ్రద్ధతో స్వీయధనమును వెచ్చించి యాతనికి చికిత్సలు చేయించెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఆ తల్లి దీనదశకు జాలినొంది యామెను తన గృహమునందే నిల్పెను. అప్పటినుండి యామె పుండరీకుని తన కన్నసంతానమువలె భావించుచుండెను. పుండరీకుఁడు గ్రామమునందు లేకున్నను ఆమె యా గృహమును స్వగృహమువలె తీర్చిదిద్దును. గృహారామమున నాయా ఋతువుల కనుగుణములైన పూదీవెల నేర్పుతో పెంచును. ఆమె సర్వ ప్రాణములు పుండరీకునిపై నిల్పుకొనెను. ఆమెకు వే రెవ్వరును లేరుకదా !

పుండరీకుఁడు సైత మామెను వంటకత్తియగ గాక తల్లినివలె గౌరవించును. చూచువారు వారి నిర్వుర మాతాపుత్త్రు లనియే భావింతురు. ఆమె యాతని 'బాబూ!' యని సంబోధించును. ఆతఁ డామె 'నమ్మా!' యనును. రెండేండ్లుగ దూరమున మహా రాష్ట్రమున నుండి తిరిగివచ్చిన పుండరీకునిలో నామె చాల మార్పులను గమనించెను. దేనినో పోగొట్టుకున్నటుల దిగులుగ కన్పించును. బొత్తిగ తిండి తినడు. రేబవళ్లింటియొద్ద నుండఁడు. పుస్తకములఁ బరామర్శించఁడు. ఆయుధములవైపు చూచుటలేదు. అంతయు చిత్రముగ నున్నది. ఎంత యోజించిన నామెకు కారణ మవగత మగుటలేదు. విషయ మేమని యడుగ నంతటి స్వాతం త్ర్యమును తాను నెఱపలేకుండెను.

వచ్చిన పుండరీకుఁడు స్నానాదికములు నిర్వర్తించి కొల్వు దుస్తులు ధరించి వెడలిపోయెను. ఫలహారమైనఁ దీసికొనలేదు. అతఁడు సూటిగ మహారాజు రహస్యాలోచనా మందిరమునకుఁ బోయెను. మహారాజింకను రాలేదు. అప్పటికే యుద్ధమంత్రి వచ్చి యుండెను. పుండరీకుఁ డాయనకు నమస్కరించి కూర్చుండెను.

ప్రభు వేతెంచెను. వచ్చిన మహారాజునకు పుండరీకుఁడును యుద్ధమంత్రియు ఖడ్గములఁ దూసి సైనికవందన మొనర్చిరి. మహారా జాసీనుఁడై వారినిగూడ కూర్చుండ నియమించెను. ఆయన యుద్ధమంత్రియైన శ్యామికునివైపు చూచెను. శ్యామికుఁ డిట్లనెను—“పుండరీకా! క్షహరాటుల సమాచారము లేమైనఁ దెలిసినవా? వారు మన యాంధ్ర సామ్రాజ్యముపై దండెత్త దలంచుచున్నారా? వారి ప్రయత్నము లేమి? ఏయే ప్రదేశములందు వారి బల మధికముగ నున్నదో గమనించితివా? మహారాజులు విన నభిల షించుచున్నారు.”

పుండరీకుఁడు మహారాజునకు సవినయముగ నమస్కరించి—మహాప్రభూ! గడచిన రెండు వత్సరములుగ నేను వారి చర్యలను సూక్ష్మముగఁ బరిశీలించితిని. వారిలో నొకఁడనై వారి యూహల నాకళింపు చేసికొంటిని. వారికి మన యాంధ్రసామ్రాజ్యముపై కన్ను కుట్టినది. సాతవాహనుల సామంతుల నొనర్చుకొనవలెనఁట! నేటి రాజ్యములలో సాతవాహనుల కుండిన ప్రశస్తి వేరెవ్వరికి లేదఁట. తాము నహపాన వంశజులై క్షత్రియులై యొక్క బ్రాహ్మణ ప్రభువైన గౌతమీపుత్త్రసాతకర్ణి రాజ్యమును చూచుచు నూరకుండుటయా? వారికిని మనకు ననాదినుండి వైర మున్నదఁట. అందువలన నీమారు మనపై దండయాత్ర సాగింతురఁట.

మహారాజు: ఆ క్షహరాటరా జంతవాఁ డైనాడన్నమాట! అతఁడు కేవలము శిశునంది! ఆ శిశువునకంత చాపల్యమేలనో! మంచిది. అయినవారి పరిపాలనా విధానమెట్లున్నది? ప్రజాభి ప్రాయమెట్లున్నది? సైన్యవిభాగము సంగతి యేమి? రాజ బంధువుల వైఖరియేమి? ఇరుగు పొరుగు రాజ్యముల విశేషము లేమైనఁ దెలిసికొంటివా?

పుండరీకుఁడు: మహాప్రభూ! అపరాంతమున యుద్ధాభిలాష హెచ్చుగ నున్నది. అచటి ప్రజలు స్వాతంత్ర్యప్రియులు. అకరావంతిలో క్షహరాటుల యాయుధములు తయారుచేయు స్థావరము లున్నవి. విదర్భయందు గూఢచారుల కూటములున్నవి. అనూప మునకు నర్మదానది జలదుర్గము వంటిది. పుష్కరతీర్థము నందలి సైనికులు విజయమో వీరమరణమో యనువారేగాని వెనుదిరుగు వారుకారు. సురకకుకురములఁ గూర్చి యాందోళనఁ జెంద నవసరములేదు. ముళక రాష్ట్రమునకు గోదావరి త్రవ్వని యగడ్తగ నున్నది.

మహారాజు : రాజకీయముగ నేమైన ఛిద్రము లున్నవా ?

పుండరీకుఁడు : ప్రభూ ! కొన్ని రాష్ట్రములలో మంత్రులకును సేనాధిపతులకును విరోధములున్నవి. మరికొన్ని రాష్ట్రములలో శిశునందిపై నంతభక్తి శ్రద్ధలున్నటులఁ గనిపించదు. అసక రాష్ట్రమున నా మండలాధిపతి విలాసప్రియుఁడు. వాని కధికార గర్వము హెచ్చు. ప్రజల యవసరముల మన్నించఁడు. వారి గోడును వినిపించుకొనఁడు. ఆ రాజ్యమున పరిపాలనా వ్యవస్థయే లేదని పించును. అల్లరులు దోపిడులుగ నుండును. ఏకముఖముగఁ జూచినచో వారి బలము చాల గొప్పది. దానిఁ బ్రతిఘటించుట కష్టసాధ్యమే యగును.

మహారాజు : నీవన్నది నిజము. వారు చాల మొండిపట్టుదల కలవారు. కాని పూర్వ క్షహరాటుల కున్నంత శౌర్యము, ధైర్యము శిశునందికిలేవు. అమాత్య శ్యామికుల యూహ యెట్టిదో !

శ్యామికుఁడు : మహారాజా ! క్షహరాటులు శరులు. వారు ప్రాణములపై నాసవీడి తమ లక్ష్యసిద్ధికై పోరాడు పట్టుదల గల వారు. వారితోడి పోరు సమ్యగాలోచనఁజేసి వ్యూహములఁబన్ని దాన భేదములను ప్రయోగించి చేసిన బాగుగ నుండునేమో !

పుండరీకుఁడు : మహాప్రభూ ! నిపుణలయిన వేశ్యలను గూఢ చారిణులగా బంపి భేదమును పండించవచ్చు ననుకొందును.

మహారాజు : అటులనే జరిగింతము. సైన్య సమీకరణము జరుగవలెను. క్రొత్తవారిని సైన్యమునఁ జేర్చుకొనవలెను. అమాత్యు లీవిషయమై శ్రద్ధ తీసికొనవలయును. పుండరీకునికి సర్వగూఢ చారదళములపై నాధిపత్య మీయఁ దలచితిమి. తత్సంబంధి వ్యవ హారము లన్నిఁటి నాతఁడే చూచుకొనవలయును.

శ్యామిక పుండరీకు లిరువురు మహాప్రసాదమనిరి.

మహారాజు వెడలిపోయెను. శ్యామిక పుండరీకు లిరువురు వచ్చుటనుండి బయలుదేరిరి. పుండరీకుఁ డాపొవుటగా నగరము నందలి తోటలు, విహారస్థలములు తిరిగి తిరిగి సందెచీకటులు నలు దిక్కులఁ బర్వువేళ కింటికిఁ జేరుకొనెను. అతని మొగము శోషించినట్లున్నది. నీరసముగ నున్నాఁడు. అతనిఁజూడగనే ముగ్గ లకుఁ గన్నుల నీరు తిరిగెను. ఇదేమి బిడ్డ యిట్లగుచున్నాఁడు ? ఎన్నఁడులేని దైన్యమీతని మొగములోని కెట్లు వచ్చినది ! మేరు గంభీరుఁడుగ నుండెడి వాఁడు ! హృదయములో నెదో బాధఁ జెందుచున్నట్లున్నాఁడు. రాజకీయ వ్యవహారములలో నెదైన క్లిష్టత

యేర్పడినదేమో ! భోజనము సేయఁడు.

తన భర్తయు. కుమారుఁడును చనిపోవగా తా నీతనిపైఁ ప్రాణముల నెలకొల్పుకొని బ్రదుకుచున్నది. ఇదెట్లు పరిణమించునో ! ఏమట్లుంటివని యడుగవచ్చునో యడుగరాదో ! ముగ్గల యిట్లనుకొనుచుండగా పుండరీకుఁడు వేరు విధముగ భావించుచుండెను — "ఈ రాజకీయము లీయుద్ధతంత్రము లిప్పుడే సమాపన్నమైనవి. జీవిత ప్రథమసోపానముననే యెదురుదెబ్బ తగిలినది. రాజసేవ నిజముగ కత్తిమీఁద సాముఘంటిది ! ప్రభువు తనపై నీనాఁడు మోపిన భారము మరియు దొడ్డది. బాధ్యతా పూర్ణమయినది. ప్రాణాపాయకర మయినది !''

ఆ సుందరిని గూర్చి కొంతకాల మూహఁగూడ సేయరాదు. తానట్లుండఁగలఁడా? పాపమీ ముగ్గల తనకై బాధఁజెందుచుండును. ఆమెకు తన మనస్స్థితి తెలియనిదికదా ! యనుకొనును. తా నాశ్రయ మొసగినందులకు తన్ను దేవునిగ స్వీయ సంతానమట్లు చూచుకొనును. ఎల్లవేళల తన శ్రేయస్సు నభిలషించును. తన ప్రవర్తన యామెకు బాధాహేతువగుచున్న దనుకొనును. తానేమియుఁ జేయలేకుండెను. పుండరీఁకుడు స్నానముఁజేసి తన గ్రంథములలో నుండి గూఢచార వృత్తాంతములున్న ప్రాకృత గ్రంథములను తిరుగవేయ నారంభించెను. ముగ్గల యాతని గదిలోనికి వచ్చి 'బాబూ !' యని పిలిచెను. పుండరీకుఁ డులికిపడి తన చేతిలోని పుస్తకమును మూసి 'యేమమ్మా !' యనెను.

ముగ్గల : బాబూ ! నిన్న ప్రొద్దుననగా భోజనముఁజేసితివి. రాత్రి చేయనేలేదు. ఈ దినమంతయు నింటి చాయలకే రాకపోతివి. ఈపూటయైన భోజనము చేయవా ?

పుండరీకుఁడు : అదికాదమ్మా ! రాజకార్యములపై తిరుగవలసి వచ్చుటఁజేసి యిట్లయినది. వేరేమియు కారణములేదు.

ముగ్గల : ఏమో బాబూ ! ఏపూట కాపూట బిడ్డ పస్తులుండగా నాకు ముద్ద నోటి కెక్కుటలేదు.

పుండరీకుఁడు : అదేమమ్మా ! పనుల యొత్తిడిచే నిట్లగుచున్న దంటినిగద ! అయిన నిఁక వడ్డించుము. ఇదిగో క్షణములో వచ్చుచున్నాను.

ముగ్గల సంతోషముతో పుండరీకునికి పీటవైచి వెండియాకు పఱచి నాలుగు రకముల వ్యంజనములతో నన్నము వడ్డించినది. పుండరీకుఁడు వచ్చెను. ముగ్గల యతని కభిముఖముగఁ గూర్చుండి

వలయు పదార్థములను మారడుగు చుండెను. పుండరీకునికి భోజనముపై నాసక్తిలేదు. కేవలముగ ముగ్గల మనస్సును కష్టపెట్ట వలసి వచ్చునని భోజనమునకు సిద్ధపడెను. ముద్ద నోటి కెక్కుట కష్టముగ నుండెను.

ముగ్గల కాతని మనస్థితి యర్థమగుటలేదు.

విషయమేమని యడిగిన నాతఁడు నొచ్చుకొనునేమో! తానింట పెద్ద దిక్కుగ నుండి యాతని మంచి చెడ్డలఁ బరిశీలించకుండుట పాపముగద యనుకొనెను. మనస్సును దిటవుచేసికొని — "బాబూ! నే నొక్క విషయ మడిగెదను. చెప్పెదవా?" యని ప్రశ్నించెను.

పుండరీకుఁడు: అదేమమ్మా! నీకు సందియ మేలవచ్చినది! నీవెన్నఁడైన నెదేని యడిగినచో నేను కాదంటినా? నాకు నీవుగాక మరి పెద్దదిక్కెవరున్నారని?

ముగ్గల: అదికాదు బాబూ! నేనన్నివిధముల జీవితములో కష్టముల నెదుర్కొనినదానను. నాదేవుఁడు నాబిడ్డ నన్యాయము చేసిపోవగా నీవు బిడ్డఁడవై నన్నాదుకొన్నావు. నీకేమైన నయినచో నేను భరించలేను. బాబూ! ఈ పర్యాయము నీవు వచ్చినదాది చూచు చున్నానుగద! నీలోని యా యుత్సాహమేదీ? ఆ చిలిపితన మేమయినది? నీ కన్నుల నేదో దైన్యము కొట్టవచ్చుచున్నది. మనిషివి సగమైనావు. ఇల్లుపట్టకుండ తిరుగుచున్నావు. నిన్ను చూచిన నాకేదో భయముగ నున్నది. నీ మనస్సునందలి యూహ నాకుఁ జెప్పకూడనిదా?

పుండరీకుని కామె యాప్యాయత బరువనిపించెను. తానామె కేమని సమాధానము చెప్పను! ఆ యువతి యెవరో తనకే తెలియ దాయెను. తానొక సుందరిని వలచి యామె ప్రేమకై తపించు చున్నాడనని చెప్పుట సిగ్గుకాదా?

ముగ్గల: బాబూ! గూఢచార కార్యనిర్వహణములో నేమైన చిక్కులేర్పడినవా? పరరాజ్యముల నేవైన నాపదలెదుర్కొనినవా? లేక మన యాంధ్ర సామ్రాజ్యముపై దండయాత్రలేవేని రానున్నవా? ఏమి బాబూ! మాటాడవు!

పుండరీకుఁడు: నీవనిన దానిలో నిజము లేకపోలేదు. అట్టివి మనల నేమిసేయఁగలవు? మన సాతవాహన సైన్యధాటి నెదు ర్కొని నిలువలేక యెంతటి శత్రుబలములైనను దాసోహమనవలసి నదే కదమ్మా!

ముగ్గల: అయినచో నింకేమి విషయములు నీ మనస్సును

కలవరపెట్టుచున్నవి ? చూడుము బాబూ ! నేను నీకు తల్లివంటి దానను. నీ మనస్సులోనున్న బాధ నాతోచెప్పరాదా ? నేనేమి చేయ లేకపోయినను నీ బాధలో భాగము పంచుకొనఁగలనుకద ! తనకుఁ గల్గిన కష్టము లొరులతో పంచుకొనుటలోకూడ శాంతియున్నది.

పుండరీకుఁడు : నీవనినది నిజమేనమ్మా ! నీకీ లోకములో నా యని చెప్పుకొనఁదగిన వారింకెవ్వరులేరా ?

ముగ్గల : ఉన్నారుబాబూ ! నా చెల్లెలొకతె చనిపోయినది. ఆమెకొక కుమారుఁడున్నాఁడు. పేరు వప్పస్వామి. వాఁడు కవిత లల్లును. వానికీ సైనికలక్షణములే లేవు. యుద్ధము లాతనికి గిట్టవు. నీవలె నతఁడు వీరుఁడు కాఁడు.

పుండరీకుఁడు : అతఁడిప్పుడెక్కడ నున్నాఁడు ?

ముగ్గల : ఏమోబాబూ ! వాఁడు పదియూళ్ళ పాపరాజు ! బరువు బాధ్యతలు లేవు. దేశములఁబడి తిరుగుచుండును.

పుండరీకుఁడు : నీయొద్ద కెన్నఁడును రాడా ?

ముగ్గల : రాడనికూడలేదు.

పుండరీకుఁడు : అతఁడు కూడ వచ్చి మనయొద్దనున్నచో బాగుండును. అందఱమొకేజాతివార మొకచోఁ జేరినట్లగును.

పుండరీకుఁడు నవ్వసాగెను. ముగ్గల మొగముదించుకొని, "పరిహాసము చేయుచున్నావా ?" యనెను.

పుండరీకుఁడు : లేదమ్మా ! సత్యమునే చెప్పుచున్నాను. నిజముగ నతఁడు వచ్చెననుకొనుము. మేమిరువుర మన్నదమ్ము లము. నీవుతల్లివి. ఏమి బాగుగలేదా ?

ముగ్గల : వాఁడు వచ్చినచో బాగుగనే యుండును. కాని రావలెగద !

భోజనము పూర్తికావచ్చెను. పుండరీకుఁడు పదార్థము లన్నింటిని వదలిపెట్టెను. ముగ్గల బాధపడి — "బాబూ ! ఇన్నిమాట లలో నన్ను మభ్యపెట్టి చివరకు నీవుచేసినదేమి ? అన్నమేమియుఁ దినలేదుగద !" యనినది.

పుండరీకుఁడు : అమ్మా ! నాకాకలి యగుటలేదు. అన్నముఁ జూచిన వెగటుగ నున్నది. నన్నేమి చేయుమందువు ?

ముగ్గల : బాబూ ! నాకు నీమనస్సును దాచుచున్నావు. వృద్ధు రాలను. నాతో నేమయినఁ జెప్పవచ్చు. ఎవతెనేని మనసునందుంచు కొంటివా ? బాబూ ! నాతో చెప్పుము. నేను నీ రహస్యముల దాచ గలను. నేనొక సైనికుని భార్యను. వేరొక సైనికునికి తల్లిని.

బాబూ! నేను రహస్య గోపనము చేయలేననియా?

పుండరీకుఁడు: ఎంతమాటనినావమ్మా! అవునదే నీవనినదే. నేను........సిగ్గువేయుచున్నదమ్మా!

ముగ్గల: నీవు పురుషుడవు. సిగ్గు స్త్రీల లక్షణమయ్యా! నాకుఁ జెప్పవచ్చును.

పుండరీకుఁడు: అమ్మా! వప్పస్వామి వచ్చిన నెంత బాగుండును!

ముగ్గల: అతఁడెచ్చట నుండెనో తెలిసినఁగద!

పుండరీకుఁడు తనగదిలోనికిఁ బోయెను—ఆ యువతి విషయమామెకుఁ జెప్పిన నేమగును? వప్పస్వామి యెట్లుండును? తానిఁక నా యువతిని చూడఁగలఁడా? యుద్ధ మెప్పుడారంభమగునో! ప్రభువు తనపై గురుతరమైన బాధ్యత నుంచినాఁడు. తాను ప్రణయ ప్రళయముల మధ్య చిక్కుకొనినాఁడు. ఏమి కానున్నదో యేమో!

ఇట్టియాలోచనలలో పుండరీకునికి కునుకు పట్టినది.

# 3

స్నానహరిద్రాభరితాంతరాణి జాలాని జాల వలయస్య
కం కిల కృతార్థయిష్యసి శోధయంతీ ను వంశకంటకతః

స్నానము చేయుచున్నప్పుడు చిల్లులగాజులయొక్క చిల్లులలో చేరిన పసుపును వెదురుపుల్లతో తీసివేయుచున్న నీవెవరిని కృతార్థుని చేయుదువు ?

పాటలీ మధుర లిరువురు కృష్ణానదిలో స్నానమాడుచుండిరి. పాటలి మాటలకు మధుర నవ్వుచున్నది. "నేనేమైన గ్రామణి కూఁతురనా యేమే ! నీవలె నందాల.రాశినా ! గారాలకూచినా ?"

పాటలి నవ్వుచు — గ్రామణి కొమరితవు కాకపోయినను తత్స్థానీయురాలవు గావచ్చునుగద !

మధుర : అటులని యెవ్వరనినారో !

పాటలి : ఇఁకనెవరు ? నీ జతగాడే !

మధుర : జతగాడా ! ఏమి వింతలు మాటాడుచున్నావు ?

పాటలి : వింతలేమి మాటాడితినే లలితప్రియా ! నాకన్ను మొఱఁగి నీవేమైనఁ జేయఁగలవా ?

మధుర : తెలిసినది.

పాటలి : ఏమి తెలిసినది ?

మధుర : నీకన్నులెట్టివో అది !

పాటలి : నాకన్నులా, నాకన్నులవంటి కన్నులా !

మధుర : ఉభయము లోకమైన కన్నులు. తోడుదొంగల వంటి కన్నులు !

పాటలి : నీకన్నులఁగూడ తోడు రమ్మందునా ?

మధుర : మరిరెండు కావలె గద !

పాటలి : నీవెంతటి జాణవే !

మధుర : నీకంటె నటవే ! ఓసి యపరిచిత సైనిక హృదయ హారిణీ ! పాటలీ ! నీముందు నేనెంతటిదానను !

పాటలి : మంచిదానవే ! నీవేమైన కలగాంచుచున్నావా ?

మధుర : నిజమునే పల్కుచున్నాను. నీవు నీ హృదయము నెంత భద్రముగ దాచుకొన్నను నీ తొలి ప్రణయపు చిఱువలపులు

నాకుఁ దెలిసినవిలే !

పాటలి కోపము నభినయించుచు - "ఇంతకు లలితునకు బుద్ధిలేదు" అన్నది.

మధుర నవ్వుచు — "ఎందుకని ? మధ్య నతఁడేమి చేసినాఁడు ?" అని యడిగెను.

పాటలి : నాయన్నను నేనేమనుకొన్న నీకేమి ?

మధుర : పాప మనవసరముగ నిందఁబడుచున్నాడని.

పాటలి : చాలు నీజాలిమాటలు. లలితుఁడింకేమనినాఁడు ?

మధుర : ఏ విషయమున ?

పాటలి : ఛీ ! సిగ్గుసిగ్గు ! నీకు తెలియదా ?

మధుర : ఓహెూ అదా ! "మా పాటలి జాణయైనది. వలపుల మిటారియైనది. పథికజన మనోహారిణి యైనది. పథికులు దాని కడగంటి చూపుతూపులఁ జిక్కుకొని....పాటలి తెచ్చికోలు కోపముతో మధురపై నీళ్ళుచిమ్ముచు...." చాలుచాలు ! అపుమిక నీ వాచాలత్వము. లలితుఁడు నన్నుగూర్చి నీతో నిన్ని యనినాఁడా ? మరి నిన్నుగూర్చి నాతో నేమనినాడో తెలియునా ? అనినది.

మధుర : నీవు చెప్పనిదే యెట్లుతెలియును ?

పాటలి : నీవీవేళ వానినిఁ గృతార్థునిఁ జేయుదునన్నావఁటగా !

మధుర ఛీ యని పాటలిని నీళ్ళతోఁ గొట్టసాగెను.

పాటలి : ఉన్నమాటనిన నులుకు లెందులకు ? మీసంగతి యందఱకుఁ దెలియును.... త్వరలోనే పెండ్లి జరుగును గద ! వదినా ! లలితప్రియా !

మధుర సిగ్గుపడి—"పాటలీ ! నీవు మరీ చిలిపిదానవగుచున్నావు. నిన్నుఁగూడ నా సైనికుని కిత్తుములే" యనెను.

పాటలి : మాటిమాటికి సైనికుఁ డనుచున్నావు. ఎవఁడాతఁడు ?

మధుర : నిన్న మాయింటికొక యువకుఁడు వచ్చెను.

పాటలి : వచ్చిన ?

మధుర : ఆతఁడా సైనికుని తమ్ముఁడఁట !

పాటలి : ఏ సైనికుఁడు ?

మధుర : పోవే అమాయికురాలా ! ఆనాఁడు నీవు చూచినవాఁడే. ఆతని పేరు పుండరీకుఁడు. అతఁడు వట్టి సైనికుఁడు కాఁడు. సర్వగూఢచారి దళములపై నధికారి యఁట !

పాటలి : అటులనా ?

మధుర : ఆ వచ్చిన యాతని పేరు వప్పస్వామి. చిత్రముగ మాటాడును.

పాటలి : మన గ్రామమున కేల వచ్చెనో ?

మధుర : చెప్పనిమ్ము మరి ! నిన్నన్వేషించుటకు ! పాటలీ ! నిజముగ నీకాతనిపై మనసు పోయినదా ?

పాటలి : వదినా ! నీవాతనిఁ జూడలేదు. అతఁడెట్టి స్త్రీకైనను వరణీయుఁడు !

మధుర : అటులనా ? పాప మంత యందగాడా ? ఈ వప్ప స్వామిగూడ నల్లయున్నాడు.

పాటలి : వప్పస్వామి యేమైనాడు ?

మధుర : గూఢచారి దళాధిపతి తమ్ముఁడుగద. గూఢముగనే తన యన్వేషణము సాగించునేమో !

చీఁకట్లు ముసురుకొని వచ్చుచున్నవి. యువతు లిరువురు స్నానములు ముగించి శుభ్రవసనములఁ దాల్చి నీటికడవలు తీసికొని యూరిలోనికి బయలుదేరిరి. కొంతదవ్వు గడచుసరికి లలితుఁ డెవ్వరినో వెంటనిడుకొని మాటాడుచు వారి కెదురు వచ్చుచు కనిపించెను. మధుర పాటలిని గిల్లి యా క్రొత్తయాతఁడే వప్పస్వామి యనెను. పాటలి యాతనిఁ జూచెను. అంతలోనే కన్నులు దించుకొనెను. ఆమె కన్నులముందు పుండరీకుఁడు తోచెను. ఆతనికి నీతనికి పోలిక యెక్కడ! అతఁడు వివిధౌషధీ వృక్షములతో నానావిధ పరిమళమిళితవాయుతరంగములతో బహువిధజంతుసంతానముతో వన్యవిహంగముల మయూరక్రేకారావములతో గిర్యుపత్యకల ప్రతిధ్వనించు హిమవన్నగశృంగము వంటివాఁడు. గంభీరమూర్తి. ఈతఁడు గృహోద్యానమున నేర్పుగ నల్లిన లతానికుంజమువంటివాఁడు. పేరు పుండరీకుఁడా ! నిజముగ పుండరీకమువంటి రాజసప్రవృత్తి కలవాఁడు. ఆతనిని తాను మరల చూడఁగల్గు టెన్నటికో ! అతఁడుగూడ తన్ను భావించుచుండెను గాబోలు. తా నదృష్టవంతురా లనుకొనెను.

మధుర నడచుచుండెను. పాటలి నిలిచి యోజించుచుండెను. మధుర వెనుదిరిగి "హే పుండరీక ప్రియే ! రావమ్మా !" యనెను.

పాటలి సిగ్గిలి—"పొమ్మ. బదులు తీర్చితివి. అందఱు నీ యంతటి యదృష్టవతులు కావలదా ?" యనెను.

మధుర : ఓసి నంగనాచీ ! ఏమి మాటాడెదవు ! నీ పినతండ్రి

రాజోద్యోగి. నీ యన్నకూడ క్రొత్తగ కొల్వులో చేరెను. నీ తండ్రి గ్రామణి. నీవు సాక్షాత్తు రతిదేవివి. నీకున్న యదృష్ట మందఱి కుండునా? తన్నిన బూరెలగంపలో పడినట్లు నీ వలపుపండిన చోటు మహారాజున కాప్తుఁడు, విశ్వాసపాత్రుఁడు, సర్వగూఢచారి దళాధ్యక్షుఁడు నగుట విచిత్రము. ఇంకను జూడుము. నీ యాశ యము లన్నియు ఫలించుటకు దోహదము కలిగించు చోటు అది. నీవు గూఢచారిణివై నీ పతి ననుగమించి రాజ్యమును రాజును వేయి కన్నులఁ జారచక్షువులై రక్షింపవచ్చును. సాతవాహన సామ్రాజ్యేతి హాసమున నీ నామము సువర్ణాక్షరములలో లిఖింపఁబడఁగలదు.

పాటలి: మధురా! అంతకుమించి జీవితమున వాంఛింపఁ దగినదేమి యుండును? మా యన్న యేమనుచున్నాఁడు? తా నాతనిఁ జూచెనా?

మధుర: నీతో చెప్పనిది నాకుఁ జెప్పునా?

పాటలి: కొందఱకు చెప్పవచ్చును. మరికొందఱకు చెప్ప రాదు.

మధుర: గడుసుదానవు. నిజముగ చెప్పిన నా కేమిచ్చెదవు?

పాటలి: నీకేమి కావలెను?

మధుర: మా పాటలి పుండరీకుని యిల్లాలు కావలెను.

పాటలి: అనిన?

మధుర: మీ యన్న యనిన మాటలవి.

పాటలి: నిజముగనా?

మధుర: అబద్ధ మెందులకు? పుండరీకుని జూచి మీ యన్న విరహముఁ జెందుచున్నాఁడు.

పాటలి: నీవు నన్ను జూచి విరహపడుచున్నావు పాపము!

పాటలీ మధుర లిరువురు గృహోన్ముఖులై వేగముగ వెడలి పోయిరి. లలితుఁడును వప్పస్వామియు నడచుచునే యుండిరి. వారట్లు పోయి పోయి కృష్ణానదీ సైకతస్థలిపై నాసీనులైరి.

లలితుఁడు: వప్పస్వామీ! మా పాటలిని జూచితివా?

వప్పస్వామి: నే నీవర కెన్న డంత యందకత్తియను చూడ లేదు.

లలితుఁడు: నా చెల్లెలివంటి యందకత్తె వేరొక రెవరైన నుండినగదా నీవు చూచుటకు!

వప్పస్వామి: లలితా! నీవు చెప్పినది యథార్థము.

లలితుఁడు: పాటలిని గూర్చి మీ యన్న పుండరీకుఁ డింకే

మనినాఁడు ?

వప్పస్వామి : ఏమనినాఁడు ? పాటలి యాతని ప్రాణమంట. ఆమెను చూచినదాది మా యన్నకు నిద్రాహారములు దూరమయినవి. నిరంతర మామెనే ధ్యానించుచు కాలము గడపుచున్నాఁడు. ఆమెను మరల నొక్కమారయిన చూడవలయునని తపించిపోవుచున్నాఁడు.

లలితుఁడు : అటులైన నొకసారివచ్చి చూడలేకపోయినాఁడా?

వప్పస్వామి : ఈమె యెవరో అతనికిఁ దెలియదాయెను. ఈమె పేరే తెలియదు. ఎట్లు చూచును ? అందుకేగద నన్ను బంపినది !

లలితుఁడు : ఎందుకని ?

వప్పస్వామి : వికుంఠపురము నందలి సైనికు లెందరు ? వారి యిండ్లెన్ని ? వారల యిండ్లలో నాడపిల్ల లున్నారా ? ఆయుధ విద్యలు నేర్చినవా రున్నారా ? అందకత్తియ లెంతమంది ? కనుఁగొని రమ్మనినాఁడు.

లలితుఁడు : గూఢచారి వృత్తి కనుగుణముగనే యున్నది పదకము. నీవేమి చేసితివి ?

వప్పస్వామి : ఆయన చెప్పినట్లే చేసితిని. కాని నేను చేసిన పొరపాటు మీ యింటికి బదులుగ మీ పాటలికి బదులుగ నా మధురాదేవి యింటి కేగి యామెను కలసికొంటిని.

లలితుఁడు : మధుర యేమనినది ?

వప్పస్వామి : తనకును శస్త్రవిద్యకును సంబంధము లేదన్నది. తమయింట సైనికులెవ్వరు లే రన్నది. మిమ్ములఁగూర్చి నాకు చెప్పిన దామెయే.

లలితుఁడు : అటులనా ?

వప్పస్వామి : నేను మీ యింట సైనికుఁ డున్నాడనినాను. ఆమె లే డనినది. నేను చూచితి నన్నాను. అమె సిగ్గుపడి 'ఓహో! అతఁడు మా గ్రామణి కుమారుఁడు లలితుఁ'డన్నది. ఆపై సర్వము నామెయే తెల్పినది.

లలితుఁడు : నీ విప్పుడేమి చేసెదవు ?

వప్పస్వామి : రాజధానికిఁ బోయెదను.

లలితుఁడు : ఇంత చీఁకటి పడినది. ఇప్పుడేమి పోయెదవు, లెమ్ము. మా ఇంటికి రమ్ము. నేడు మా ఇంట నాతిథ్యము స్వీకరింపుము. మా యిల్లుకూడ చూచినట్లగును.

నదృష్టవంతుఁడు వేరొకఁడుండ డనుకొందును.

వప్పస్వామి : పుండరీకుఁ డనియేమి ! ఆమెను గృహిణిగఁ బడయఁగల్గిన యే పురుషుఁడైన నదృష్టవంతుఁడే యగును.

ముగ్గల : అవును. మరి యామె పుండరీకుని చూచినదా ? అతనిపై నామె మనస్సును నిల్పినదా ?

వప్పస్వామి : అది నాకు తెలియదు. ఆమె యన్నకుమాత్రము పుండరీకుఁడు నచ్చినాఁడు.

ముగ్గల : నా కొకమారా పిల్లను చూడవలెనని యున్నది.

వప్పస్వామి : దానికేమి ! మదనోత్సవములలో నామె రతి యఁట ! ఆ దినములలో పోయి చూడవచ్చును.

ముగ్గల : మంచిది. అటులే చేయవచ్చును. పుండరీకుఁ డెచ్చటికో పోవలె ననుచున్నాడు. నీకేమైన తెలియునా ? పనిపాటలు లేక నీవు, రాజకార్యములతో నుక్కిరి బిక్కిరియై యతఁడు నెప్పుడు నింట నుండరుగద !

వప్పస్వామి : అవునమ్మా ! మహారాజాతని నెచ్చటికో పంప నున్నాడని నాతో చెప్పినాఁడు. తిరిగివచ్చుటకు నెలదినములు పట్ట వచ్చునఁట. అమ్మా ! నేనొకటి యనఁదలచితిని. కోపగించు కొనవుగద !

ముగ్గల : ఏమది ?

వప్పస్వామి : పుండరీకుఁ డెప్పుడు రాజకార్యములపైఁ దిరుగుచుండును. ఇంటిపట్టున నుండుటయే పొసగదు. మరి యాతనిఁ బెండ్లియాడి పాటలి యేమిసుఖపడునని !

వప్పస్వామి మాటలు ముగ్గల మనస్సును కలఁచి వేసినవి. ఇదేమీతఁ డిట్లు మాటాడునేమి యనుకొనెను.

ముగ్గల : ఆమెకూడ వానియంతటి ధీరురాలంటివిగద ! ఆమె యాతని వెన్నంటియే యుండును. అతఁడెచ్చటికిఁ బోయిన తాను నచ్చటికే పోవును. పుండరీకుఁడు భార్యను ప్రేమించలేనంత నీరసుఁడుకాఁడు.

వప్పస్వామి : అదిగో నీకు కోపమువచ్చినది. ఎట్లయినను పెంపుడుబిడ్డపైనున్న ప్రేమ చెల్లెలి బిడ్డపై నుండునా ?

ముగ్గల : ఇప్పుడు నేనేమన్నానని ! నీవు నాకుఁ గాని వాఁడవా ? నీవును పుండరీకుఁడును నా కిరువురు రెండు కన్నుల వంటివారు. తెలిసినదా ! మీ రిరువురు చక్కగ నొక యింటివారై పిల్లపాపలతో నానందముగ నుండినచో చూచి నా జన్మము ధన్య

మయిన దనుకొందును. నాకి జీవితమున నింతకుమించి యభిల షించదగిన దేమున్నది ?

వప్పస్వామి : నాకుతోడు పెండ్లి యొకటి తక్కువైనది ! మొదట నాకు తినుటకులేదు. పెండ్లమునకేమి పెట్టవలెను ?

ముగ్గల నవ్వి—"పెండ్లియయినచో నన్నియు వానియంతట నవియే సమకూడును. మీ యన్న యున్నాఁడు గద. ఆతఁడే నిన్నాదుకొనును. కొల్వులో నీకుఁ దగిన పని నిప్పించగలఁడు" అనెను.

వప్పస్వామి : మాటలకేమిలే ! అయినను నాకింకొక పాటలి దొరకవలదా ? పాటలి వంటి వారు వేరొకరుండు టెట్లు ?

ముగ్గల ముక్కుపై వ్రేలుంచుకొని—"ఏమిరా ! నీవొడలు తెలిసియే మాటాడుచున్నావా ? నీయన్న ప్రేమించిన స్త్రీ సౌందర్య మును గూర్చి భావించుచున్నావఁటరా ? తప్పుతప్పు. నీకు పాటలి కన్న నందకత్తెయే దొరకవచ్చును. దేశము గొడ్డుపోయినదా యేమి ?"

వప్పస్వామి : అది యసాధ్యములే యమ్మా.

ముగ్గల : అయినచో నీవనునదేమిటి ?

వప్పస్వామి : ఏమున్నది? నాబ్రదుకు నన్ను బ్రదుకనిమ్ము. నాకు పెండ్లివలదు, గిండ్లివలదు ! అడుగో అన్న వచ్చుచున్నాఁడు.

వప్పస్వామి పుండరీకుని కెదురుపోయి యాతనిఁ దోడ్కొని వచ్చెను. వచ్చిన పుండరీకునిఁ జూచి ముగ్గల— "బాబూ ! నీ తమ్ముఁడు చూచితివా ? స్వామి నిజముగ లక్ష్మణస్వామియే యను కొనుము" అనెను.

పుండరీకుఁడు : ఏమిటమ్మా ! నీవనునది ?

ముగ్గల : బాబూ ! నన్ను మభ్యపెట్టకుము. వప్పస్వామి నాకంతయుఁ జెప్పివేసినాఁడు. ముందువచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములు వాడి యన్నట్లు స్వామి నీకు దగ్గఱవాడైనాడు కదా ! నేనెంత మొత్తుకొన్నను చెప్పని విషయ మాతనికిఁజెప్పి యాతనిఁ బ్రియాన్వేషణమునకు గూడ పంపితివటగా !

పుండరీకుఁడు వప్పస్వామి వైపు చూచెను.

ముగ్గల : నాకు తెలియును. మీరిరువురు తోడుదొంగలు. మీరు మాటాడుకొనుచుండుడు. నేను మీకు స్నానాదికముల కేర్పాటు చేయుదును.

పుండరీకుఁడు : వలదమ్మా ! మేము నదికి పోయెదము.

ముగ్గల నవ్వి—"సరే పోయిరండు. స్వేచ్ఛగ మాట్లాడుకొన వచ్చును" అనెను.

వారిరువురు కృష్ణకేగిరి. ఇరువురు నడుములోతు నీళ్లలో నిలబడి స్నానముఁ జేయఁదొడఁగిరి.

పుండరీకుఁడు : స్వామీ ! చూచితివా ?

వప్పస్వామి : చూచితిని.

పుండరీకుఁడు : ఎట్లున్నది ?

వప్పస్వామి : నీవిప్పు డెట్లున్నావో నామెయు నట్లేయున్నది.

పుండరీకుఁడు : అనిన నీ యభిప్రాయ మేమి ?

వప్పస్వామి : నీవు స్నానముఁ జేయుచున్నావు. ఆమెయు స్నానమాచరించి నీరు తెచ్చుచుండెను.

పుండరీకుఁడు : నీకెట్లనిపించినది ?

వప్పస్వామి : ఆమె సౌందర్య మతిలోకముగ నున్నది.

పుండరీకుఁడు : ఆమె యెవరి కొమార్తె ?

వప్పస్వామి : వికుంఠపుర గ్రామణి కూఁతురు.

పుండరీకుఁడు : ఆమెను గూర్చిన వివరము లేమైన సేకరించితివా ?

వప్పస్వామి : మొన్ననీ మధ్య సైన్యములో జేరిన యొక యాశ్వికుఁడున్నాఁడు. అతనిపేరు లలితుఁడు. పాటలి యాతని చెల్లెలు.

పుండరీకుఁడు : ఏమి ! పాటలియా ? నామమెంత మధురముగ నున్నది !

వప్పస్వామి : ఆమెకన్న మధురమైనదా ?

పుండరీకుఁడు : అదికాదు. ఆమె సౌందర్యమునకుఁ దగిన నామముంచినారు. పాటలి ! చాలబాగున్నది. నీవు వారియింటికిఁ బోయితివా ?

వప్పస్వామి : నేను మొదట లలితునితో స్నేహముఁ జేసితిని. అందువలన వారియింట నాతిథ్యము లభించినది.

పుండరీకుఁడు : నిజమా! నీవెంతటి కార్యశూరుఁడవు! ఆమె నీతో మాటాడినదా ? ఏమన్నది ?

వప్పస్వామి : మొదలు మాటాడినఁగదా! తరువాత నేమైన ననుటకు ? నాతో నేమి మాటాడును ?

పుండరీకుఁడు : మరేమి జరిగినది ? నీవు వారియింటికిఁ బోయితివికద !

వప్పస్వామి : ఆమె భోజనము పెట్టినది. ప్రక్క పఱచినది.

పుండరీకుఁడు : నీవదృష్టవంతుఁడవు. నీకామె పరిచర్య చేసినదా ?

వప్పస్వామి : నామొగము పరిచర్య! అది గృహధర్మము. ఆమె దానిని నెఱపినది. అన్నా! నీ వామె నెప్పుడు చూచితివి ? ఆమె నీతో నేమైన మాటాడినదా ?

పుండరీకుఁడు : అయ్యో! నేనామె నొక్కసారి మాత్రమే చూచితిని. అది సైతము చిఱువెన్నెలలు చీఁకటులు కలబోసికొన్న వెల్గులో, రెండుమూడు నిమిషము లేమైన సామర్థ్య గడచిన వేమో! మూఁడు నెలలైనది. మరి చూడలేదు.

వప్పస్వామి : ఆమె తొలి వీక్షణముననే యంతటి ముద్ర వైచినదా!

పుండరీకుఁడు : నీకుఁ దెలియదు తమ్ముఁడూ! నా కస లాడువారితో పరిచయములు లేవు. నాకు తల్లి తెలియదు. తండ్రి నెఱుఁగను. అక్కచెల్లెండ్రు లేనేలేరు. నే నింక నెవరితో ప్రసం గింతును ? నాకు జ్ఞానము వచ్చునాటికి నేను సైన్యమునఁ జేరితిని. నా శిక్షణదేమో నేనేమో! వేఱొక యూహ నా మనస్సునకు వచ్చుటకుఁగూడ వీలుగానంత తీవ్రప్రకృతి నాది. మీ పిన్నిగారు వినా నాకు స్త్రీలు తెలియరనియే చెప్పవచ్చును. మహారాజమాత గౌతమీబాల శ్రీదేవియు తెలియును. ఆమె రూపుఁగొన్న సాతవాహనీ దేవి!

వప్పస్వామి : చిత్రముగ నున్నదే! నేను సైతము నీవంటి వాఁడనే, కాని నీ యంతటి యనభిజ్ఞుఁడను కాను.

పుండరీకుఁడు : అదియేమో నాకుఁ దెలియదు. ఆమెను చూడకపూర్వము నేనొక గూఢచారిని, సైనికుఁడను. ఆమెను చూచిన క్షణమునుండి నేను నేనుకాను. నేనొక పురుషుఁడ నని పించినది. నే నేమి చేయను ? నే నేపనిఁ జేయుచున్నను నా మనస్సున నామెయే నిలుచుచున్నది! నా సంగతి నాకే యాశ్చర్య ముగ నున్నది.

వప్పస్వామి : తొలివలపు బాధ లట్లేయుండును లెమ్ము.

పుండరీకుఁడు : నీ కట్టి యనుభవము లుండిన వన్నమాట!

వప్పస్వామి : అనుభవ మక్కఱలేదు. వట్టి లోకజ్ఞానము చాలును. ప్రస్తుత మింక మన కర్తవ్యమేమి ?

పుండరీకుఁడు : ఏ విషయమున ?

వప్పస్వామి : అన్నా ! పాటలి విషయమునసయ్యా !

పుండరీకుఁడు : పాటలియా ! నేనేమి చేయను ? నేను రాజాజ్ఞపై నగరము వీడిపోవలసియున్నది.

వప్పస్వామి : ఎప్పుడు వెళ్ళెదవు ?

పుండరీకుఁడు : పది దినములలో.

వప్పస్వామి : అనిన, వసంతోత్సవముల యనంతరముసనా?

పుండరీకుఁడు : అటులే యనుకొందును.

వప్పస్వామి : అయినచో నిఁక నేమి ? పది దినములలో నేమైనఁ జేయవచ్చును.

పుండరీకుఁడు : అది యంత త్వరితముగ కుదురునా ? యుద్ధము తఱుముకొని వచ్చుచున్నది. ఇప్పు డెట్టి వేడుకలు సాగవు.

వప్పస్వామి : అయినచో నేమందువు ?

పుండరీకుఁడు : నేనామెను మరల నొకసారి చూడఁగోరు చున్నాను.

వప్పస్వామి : అది యెంతటి పని ? నేఁడే వికుంఠపురము నకు పోవుదమా ?

పుండరీకుఁడు : ఈరోజుననా ? కాదు. వద్దు.

వప్పస్వామి : ఇట్టివాఁడవు నీకు ప్రేమవ్యవహారమెందులకు?

పుండరీకుఁడు : అది కాదు. నాకుఁ గోటలో పను లున్నవి. తీరుబడిలేదు. ముందు మహారాజు, స్వదేశము, తరువాతనే స్వీయ వ్యవహారము. అదే నా ధ్యేయము.

వప్పస్వామి : బాగున్నది. మన మహారాజుగారు తన స్వవిష యములను మొదట చక్క బెట్టుకొనరా ?

పుండరీకుఁడు : తప్పు. ఆయననుగూర్చి యట్లు మాట్లాడ రాదు. ఆయనకు తొలుత ప్రజలు, రాజ్యము, తరువాతనే గృహ కృత్యములు. ఆయన యేకబ్రాహ్మణుఁడు ! ఆయన యనేక కుటుంబములను పోషించును. ఆయన యంతటి యాశ్రితరక్షకుఁ డైన ప్రభువు వేరొకఁ డుండడు. ఆయన తన యంతఃపురమును మహారాజమాత గౌతమీదేవి పర్యవేక్షణలోనుంచి తాను రాజ్య పాలనమును సాగించును. ఆయనకు ప్రజలు వారి శ్రేయస్సును ప్రధానములు. అట్టి ప్రభుసేవలో నెంత తృప్తి యుండునని ! ఆ మహారాజునకు నాపై మిగుల ననుగ్రహమున్నది. ఆ భావమే చాలును. నా జీవితమున కదియే పరమార్థభూతమయినది. కాని

మధ్యలో నీ పాటలి వచ్చినది. నాకేమో యగుచున్నది. నాకు నిలుకడ లేకుండ నున్నది.

వప్పస్వామి : అన్నా ! నీ స్థితి నాకు జాలికలిగించుచున్నది సుమా !

పుండరీకుఁడు మాటాడలేదు. ఎండ తీవ్రత హెచ్చినది. అన్నదమ్ము లిరువురు స్నానము ముగించి యింటికేగిరి.

.... .... .... .... ....

సాతవాహన సామ్రాజ్యమున వసంతోత్సవములు అట్టహాసముగ జరుగుచున్నవి. ప్రజలెల్లరు మహోత్సాహముతో నీ పండుగలు జరుపుకొనుచుండిరి. చైత్ర శుద్ధ పాడ్యమి నుండి దశమి వరకు తొమ్మిది దినములు పురుషులందరు మన్మథులు, స్త్రీలెల్లరు రతీదేవులట్లు విహరింతురు. మహారాజ సౌధమున వారి కులదేవతయైన సాతవాహనీదేవికి నవరాత్రములు చేయుదురు. ఆ తొమ్మిది దినములు మహారాజు గౌతమీపుత్ర శ్రీ సాతకర్ణి, ఆయన భార్య వాసిష్ఠీదేవి మహారాజమాత గౌతమీబాలశ్రీదేవి, భగవతి యారాధన నుభయ సంధ్యల ననుష్ఠింతురు. తొమ్మిది దినము లుపవసింతురు. దశమినాఁడు పదివేలమంది బ్రాహ్మణులకు, పదివేలమంది యితరులకు భోజనము లేర్పాటు గావింతురు.

వేయిమంది సువాసిను లర్చింపఁబడుదురు. మహారాజ్ఞి వాసిష్ఠీదేవి స్వయముగ సువాసినులకు పసుపుకుంకుమలు నూత్న పరిధానములు నాభరణములు పూలమాలలు నిచ్చి సత్కరించును. అనేకములైన పండిత కుటుంబముల కగ్రహారాదికములు లభించును. గ్రామగ్రామమునుండి యుత్సాహవంతులైన యువతీ యువకులు రాజధానికి వచ్చి నాటకములు నాట్యములు ప్రదర్శించుచుందురు. మహారాజుచే నిర్ణయింపఁబడిన లలితకళా పర్యవేక్షకునిచే నెన్నికయైన నాటకములు కోటలో నాడుదురు. మహారాజు మహారాజ్ఞి యంతఃపుర నారీమణులు ప్రముఖోద్యోగుల స్త్రీలు అట్టి ప్రదర్శనములఁ దిలకింతురు. ఉత్తమమైన ప్రదర్శనములకు బహుమతు లొసఁగబడును.

దశమినాఁడు సైనిక విన్యాసములు జరుగును. మహారాజందు తప్పక పాల్గొనును. వివిధాయుధ ప్రయోగములయందు తమతమ నైపుణ్యమును యువకులు ప్రదర్శింతురు. సాహసికులు నిపుణులునైన యువకుల నానాఁడు క్రొత్తగా సైన్యమునఁ జేర్చుకొనుటకూడ జరుగును. సంవత్సరమునకు రెండు పర్యాయము లీ సైనిక

స్వీకరణము జరుగును. కృష్ణానదిలో నావల పోటీలు జరుగును.

గ్రామములలో నీ సంరంభము మరియు మిక్కుటముగ సాగును. ఎచ్చట చూచిన నచ్చట యువతీయువకులు రంగు రంగుల వస్త్రములను ధరించి కిలకిలలాడు నగవులతో క్రీగంటి ప్రసారములతో పూలమాలలతో, సువాసనాద్రవ్యములలదికొని రతీమన్మథులవలె చరింతురు. కోడిపందెములు గొఱ్ఱెపొట్టేళ్ళ పోరాటములు బండి పరుగుల పందెములు మొదలైె చిత్రమైన యాచారములతో నీ యుత్సవములు కనువిం దొనర్చును.

వసంత నవరాత్రములనే మదనోత్సవములని సైత మందురు. వికుంఠపురమున నీ యుత్సవములు ప్రతి సంవత్సరముకన్న నతి శయముగ జరిగినవి. అందులకుఁ గారణము మధురా లలితుల వివాహము లాయేడే జరిగియుండుట! గ్రామమునందలి యువతీ యువకు లందఱా పదిదినములొక సందడిగఁ గడపిరి.

ఈ మధ్యలో వప్పస్వామి వికుంఠపురమునకు నాలుగైదు పర్యాయములు వచ్చెను. వచ్చినప్పుడెల్ల ధనంజయుని యింటి వద్దనే యుండెడివాఁడు. ఆయింట నెల్లరకు వప్పస్వామి యెడల క్రొత్తఁదనము పోయినది. అతఁడుకూడ నింట నందఱతో మిక్కిలి కలుపుగోలుతనమును నెఱపును. మిహిరను 'అత్త' యనును. మధురతో నన్న వరుస కలుపుకొనెను. లలితుని పెండ్లి తానై జరిపించును. వప్పస్వామి కా యింట నందఱ గదులలోనికిని ప్రవేశ మున్నది. ఆత డందఱతో హాస్య మాడును—కవ్వించును. రోహితుని తన వెంటఁ ద్రిప్పికొనును. పాటలితో నెక్కువగ సంభాషింప నుబలాటపడును. ఆమెతో నంతయు నర్మగర్భముగ సాకూతముగ మాటాడును. పాటలి కాతని వచోధోరణి వెగటు పుట్టించును. కాని యామె సహించుకొనును. అతని వాగ్ధోరణి యందలి కవితామర్యాదను మన్నించును. అతని చమత్కారములు మెచ్చుకొనును. అం దంతర్నిహితములైయున్న యింగితముల నామె యభినందించలేదు.

అప్పటి కింకను వసంతోత్సవములు ప్రారంభము కాలేదు. పాటలి వైశాఖమాసములో జరుగనున్న మధురా లలితుల పెండ్లి సంరంభములలో మునిగియున్నది. వప్పస్వామి వచ్చెను. వచ్చు చునే పాటలి గదిలో ప్రవేశించెను. పాటలి తలవంచుకొని కూని రాగముఁ దీయుచు నేదో పని చేసికొనుచుండెను.

వప్పస్వామి: పాటలీ! నీ రాగమాధుర్యమును మేముగూడ

గ్రోలవచ్చు ననుకొందుము!

పాటలి: నీ రాగమైన చోట శబ్దమే లేదు.

వప్పస్వామి: శబ్దరహితమైన దేమియు లేదు. ఆకాశమే శబ్ద మయము కదా!

పాటలి: నే నన్నదా శబ్దమునుగూర్చి కాదు. బిందెపై గొట్టిన నదియు ధ్వని చేయును. అదియు శబ్దమే!

వప్పస్వామి: పోనిమ్ము. నీ వాలపించు గీతమును నాకుఁ గూడ వినిపింపరాదా?

పాటలి: మొదటనే యట్లడుగవచ్చును గద!

వప్పస్వామి: పోనిమ్మిప్పు డడుగుచున్నాను.

పాటలి: ఇప్పు డా భావము పోయినది. రాజధానిలో ఉత్స వపు టేర్పాటు లెట్లున్నవి?

వప్పస్వామి: అవును. నీ వెప్పుడు నింతియే. నే నెదైన నడిగిన దానిని వదలి యితరములను మాటాడుదువు.

పాటలి: పోనిమ్ము. చెప్పకుము. మా చిన్నాన్న చెప్పును లెమ్ము.

వప్పస్వామి: ఇంతలో నంత యలుక యెందులకు? నేను చెప్పనంటినా?

పాటలి: అలుక యేమిటి? నీవు చెప్పకున్న చిననాన్న చెప్పు నంటిని.

వప్పస్వామి: కాని యా యనుటలో—

పాటలి: ఏమున్నది? నీ కన్నియు వ్యంగ్యములు ధ్వనులు.

వప్పస్వామి: పోనిమ్ము, పాటలీ! నీవు నన్నెందుల కర్థము చేసికొనవు?

పాటలి నవ్వసాగెను.

వప్పస్వామి: అదేమి పాటలీ! అట్లు నవ్వెదవేమి?

పాటలి: నేను నిన్నర్థము చేసికొనవలె నంటివిగద! నిన్న మ్మినఁగద యర్థము వచ్చుట! నిన్నిచ్చట నెవ్వరు కొందురు?

వప్పస్వామి: చాలులే పరిహాసములు. అటులైన నిఁక నేను పోవుచున్నాను.

పాటలి: వద్దు వద్దు. నాకు రాజధాని యందలి వార్తలఁ జెప్పవా?

వప్పస్వామి: నీ పినతండ్రి చెప్పునులెమ్ము!

పాటలి: ఇంతలో నంత యలుకయా? నీవు చెప్పినచో

బాగుండును.

వప్పస్వామి : పాటలీ! నీవెట్టైన గడుసుదానవు. రాజధానిలో నేమున్నది? గూఢచారులు రక్షకభటులు సైనికులు నింతియే కద!

పాటలి : అదికాదు. వసంతోత్సవముల సందడిని చెప్పు మంటిని.

వప్పస్వామి : అక్కడ నన్నియు పోటీలు పందెములు!

పాటలి : ఏమి పోటీలు ?

వప్పస్వామి : నీ కెందులకు? గుఱ్ఱపు స్వారులు, కత్తి యుద్ధములు, విలువిద్యా ప్రదర్శనములు—ఒక టేమిటి! చాల గందరగోళముగ నుండును.

పాటలి : నా కవి చాల నిష్టము. ఇవన్నియు నెక్కడ జరుగును ?

వప్పస్వామి : మహారాజుగారి కోటలో.

పాటలి : ఇంక నేమి జరుగును ?

వప్పస్వామి : రాత్రులందు నాటకములు నృత్య ప్రదర్శనములు జరుగును.

పాటలి : బాగున్నది.

ఆమె యెదియో యోజించుకొనుచుండెను. వప్పస్వామి తన కేమియుఁ దోచక కుడ్యచిత్రములను జూచుచుండెను. అచ్చట నన్నియు సత్యభామాదేవి వీర శృంగారముల దీపించు చిత్రము లున్నవి. రామాయణ మహాభారతము లందలి గాథా చిత్రము లున్నవి. నరకాసురవధ చాల రమ్యముగ చిత్రింపఁబడినది.

వప్పస్వామి కవి యన్నియు మనోహరములై కనుపట్టినవి. అతనికి పాటలి యనిన నెదో భావ మేర్పడెను. ఆ సత్యభామ యీామెయా! లోకమున కృష్ణభక్తు లుందురు. దేవీభక్తు లుందురు. సత్యభామ భక్తి యేమి? పాటలి చిత్రమైన వ్యక్తి! ఎన్నివిధముల యత్నించినను ఆమె మనస్సర్థ మగుటలేదు. తాను వృథాశ్రమ పడుచున్నాడేమో! తా నామెను భావించకుండ నుండలేకున్నాడు. పెదతల్లి తన్ను మెత్తగ చివాట్లు పెట్టినదికూడ! పుండరీకుఁ డెంత మంచివాఁడు! అయిననేమి తాను నిస్సహాయుఁడుగ నున్నాడు!

వా రిరువురి నిశ్శబ్దతను భంగించుచు మిహిర వచ్చి "అమ్మా! పాటలీ! మధుర కబురుపెట్టిన దెందులకో!" అనినది.

పాటలి : ఇదిగోనమ్మా! ఇప్పుడే వెళ్లెదను. వప్పస్వామీ! మా వదిన పిలుచుచున్నది. నేను పోవుదునా ?

వప్పస్వామి : అవశ్యము. నేనుకూడ మా లలితుని యొద్ద కేగెదను.

పాటలి : అది నీ యిష్టము.

పాటలి గదినుండి వెడలిపోయెను. వప్పస్వామి కొన్ని క్షణము లట్లే నిలబడి నెమ్మదిగ గది వీడిపోయెను.

ఆతని కన్నుల నెదో యసంతృప్తి ప్రకటమగుచుండెను.

# 4

మధుమాస మారుతాహత మధుకర ఝంకార నిర్భరేఽరణ్యే
గాయతి విరహాక్షరకృత పథికమనోమోహనం గోపీ!

మధుమాసపు గాలులచేఁ గొట్టబడిన మధుకరఝంకారములచే నిర్భరమైన యరణ్యమునందు విరహసూచకమయిన యక్షరములతో గూడిన గీతమును పథికజనమనోమోహనముగ గోపిక యాలపించుచున్నది.

వసంతకాలపు తొలిరోజులు. అరణ్య ప్రదేశము. అడవి యంతయు పల్లవించి పుష్పించియున్నది. వసంతానిలములు వీచుచున్నవి. సంధ్యాసమయము, వికసిత కుసుమములపై మధుపములు వ్రాలి గాలులకు కదలుచు ఝంకారము లొనర్చుచున్నవి. ముగ్ధమోహనమై మదనోద్దీపకమైన యట్టి యటవీప్రదేశమున నొంటరియైన గోపిక విరహగీత మాలపించుచున్నది. ఆ గీతమునిండ విరహాధిక్యమును సూచించు సాహిత్యమున్నది. ఆ గీతమును వినినవా రెవరైన కరిగిపోయి తీరవలెను. పథికజనుల నాకర్షించుచు నా గోపిక గాన మొనర్చుచున్నది. ఆ యరణ్యము, వసంతానిలము, మధురఝంకారము, విరహ గీతము – ఇవి యన్నియు నామె తన యభినయమున రూపు కట్టించెను. ఆమె నాట్యవిన్యాసములలో మలయానిలము లనుభూత మగుచున్నవి. మనస్సును పులకింపఁ జేయుచున్నవి. శారీరమునందు మధుకర ఝాంకృతులు శ్రుతి గోచరము లగుచున్నవి. ఆమె గీతము స్త్రీ పురుషులెల్లర హృదయములను ద్రవింపఁజేయుచున్నది. ఆమె విరహిణియై యభినయించుచున్నది. దీర్ఘదీర్ఘముగ నిశ్వసించుచున్నది. ఆమె యూర్పుతీసికొని వదలినప్పుడెల్ల నామె కంచులికయొక్క కపాటము కుంచించుకొని పోవుచుండెను. ముకుపుటము లదరుచుండెను. కన్నులారక్తములు, సిక్తములునై యుండెను. ఆమె భృకుటి చిత్రచిత్రములైన విన్యాసములను ప్రకటించుచున్నది. తనువు శిథిలమైనట్లు పాలిపోవుచున్నది. చల్లగాలి స్పర్శను భరించలేక దోసిలితో నడ్డుకొనుచుండెను. కోకిలాలాపములను వినలేక చెవులు మూసికొనుచుండెను.

వాసంతికా పరిమళముల నాఘ్రాణించలేక నాసారంధ్రములను మూసికొనుచుండెను.

వనమెల్ల చిత్రచిత్ర వర్ణములఁ జిత్రించినటుల పుష్పించిన కుసుమరాశులఁ జూడజాలక కన్నులు మూసికొనుచుండెను. ఆమె యెఱ్ఱని పరికిణీపై నీలికంచులికఁ దాల్చెను. స్తన మధ్యదేశమున రెండంగుళముల వెడల్పైన యెఱ్ఱని కపాటమును ధరించెను. కపాటము చివరల రెండు చీలికలుగనుండి కుచ్చులు వేసినట్లుం డెను. ఆమె త్రికంటకలు శ్రవణములఁ దాల్చెను. ఏకావళి ఫలక హారము మెడలో వైచికొనెను. కనకదోరమును జఘనభాగమునఁ దాల్చెను. అంగుళీయకముల స్వర్ణకంకణ మంజీరముల ధరిం చెను. ఆమె పాదములకు చేతులకు లత్తుక వేసికొనెను. కనుగొన లందు కజ్జలరేఖలు సాగునట్లుగ రచించుకొనెను. దీపశిఖాకృతిగ తిలకరేఖను సంతరించుకొనెను. కేశములను చిత్రముగ ముడిచి ముత్తెపుసరులతో పుష్పజాలముతో నలంకరించుకొనెను. ముక్కున ముక్కెఱఁ దాల్చెను. కనుబొమలు సాగునంతమేరకు మకరికా పత్రములఁ దీర్చెను. రంగస్థలమున నామె ప్రేక్షకులకు సాక్షాత్తు ప్రియవిరహిణియైన రతిమూర్తిగ కనిపించెను. ఆమె పదవిన్యాసము లలో నరవిందములు పుష్పించినవి. అభినయ వైశిష్ట్యముచే నామె యంగుళుల కదలింపులలో నశోకములు పొడచూపినవి. గ్రీవాభంగ వేళల నామె కర్ణములందలి త్రికంటక లూగుచు చిఱుమావి పూలు రాలుచున్నట్లుండెను. ఆమె కనుతుదల నవమల్లికలు కోరకిత మైనవి. ఆమె విప్పారు నయనములు నీలోత్పలముల ననుకరించు చుండెను. ఆమె పంచబాణుని పంచసాయక సమాహారాకృతియై రూపొందినది.

ఆమె దొక క్రొత్త యభినయము.

ప్రేక్షకు లెల్లరామె నాట్యము ననిమిషులై చూచుచుండిరి. ఆమె హావభావములతో వారు తాదాత్మ్యమును భజించుచుండిరి!

అది మహారాజ శ్రీ గౌతమీపుత్ర సాతకర్ణి దుర్గాంతర్గతాంతః పుర పరివారమునకై ప్రత్యేకముగ నిర్మాణింపఁబడిన నాట్యమంది రము. అది మహారాజ్ఞిరాజమాత రాజబంధువులు ప్రధానోద్యోగుల కుటుంబములకు మాత్రమే పరిమితమైనది. ఆ మందిరముచుట్టును రక్షకభటులు విచ్చుకత్తులతో నిలబడియుందురు. అచ్చటచ్చట నొకరిద్దరు గూఢచారులు మసలుచున్నారు. వారు పానీయముల నందించువారో వీవనల వీచువారో తెలియరాదు.

గౌతమీపుత్ర శ్రీ సాతకర్ణి మహారాజున కామె యభినయము మనస్సు కెక్కినది. ఆమె వపుస్సౌందర్యము, ఆహార్యము, శారీరము, ఆంగికాభినయము నొకదానితో నొకటి స్పర్థించుచున్నటుల పందెము వైచికొని యొకదాని నొకటి యధిగమించవలె నన్నట్లభినయమున గోచరించెను. మహారాజామెతో సామ్రాజ్యమునకుఁ గావలసిన పనులున్న వనుకొనెను. మహారాజ్ఞి వాసిష్ఠీదేవి యామెకు రత్నహారమును బహూకరించెను. రాజమాత శ్రీ గౌతమీబాల శ్రీదేవి కామెపై నేదో మమకార ముదయించెను. ఆమె యా నర్తకి కన్నులయందు వీరరసమును దర్శించెను. ఆమెకును కుమారునికి కలిగిన యూహయే కలిగెను. వారిరువురును సాకూతముగ నొకరినొకరు చూచుకొనిరి. ఆ సంగతి నర్తకి కన్నులను దాటిపోలేదు. ఆమె మనస్సునందు చాల సంతోషించెను. సాతవాహనీదేవి యనుగ్రహమున్నచో తన ధ్యేయము ఫలోన్ముఖ మగుటకు సమయ మాసన్నమయిన దనుకొనెను.

నాట్యము పూర్తియైనది. నాట్యకర్త్రి నమస్కార ముద్రతో నిలబడినది. తెర యపసరింపఁ బడినది. ఆమె నాట్యాలంకరణ విభాగమునకుఁ బోయినది. అచ్చట నొక యువకుఁడు నిలబడి యుండెను. అతఁడాజానుబాహువు. సాలప్రాంశుఁడు. సమున్నతమైన నాసికా సౌందర్యము కలవాఁడు. విశాలనేత్రుఁడు. అతనిఁ జూడగనే యొక యానందము మొక భయము కలుగుచుండెను. ఆతనిని జూచుచు నా యభినేత్రి చకితయై యట్టులే నిలిచిపోయెను. ఆతనిఁ దా నిదివర కెచ్చటనో చూచినట్లున్నది. ఆ వ్యక్తి క్రొత్తవాఁడను భావముకూడ లేకుండ నామె యాతనిఁ జూచుచు జ్ఞప్తికిఁ దెచ్చుకొన నారంభించెను. అతఁడునట్లే నిశ్చేష్టుఁడై బహు జన్మ తపః ఫలమును పొందిన తపస్వివలె నిలిచి కనురెప్ప లార్పక నామెనే దర్శించుచుండెను. ఒకరికొకరు దృష్టపూర్వు లట్లుండిరి. పలుకరించిన నేమగునో !

అట్లు కొన్ని లిప్తలు గడచినవి. నాట్యమందిరము క్రమముగ నిశ్శబ్దమగుచున్నది. చివరకు నర్తకి ప్రకృతిస్థురాలై యనినది—
'మీ రెవ్వరు ?'

పురుషుఁడు : ఆ ప్రశ్నయే నేను మిమ్మడుగుచున్నాను.
నర్తకి : ముందు నేనడిగితికద !
పురుషుఁడు : తరువాత నడిగిన చెప్పరాదా ?
నర్తకి : అనికాదు. ఇది స్త్రీల నర్తనాగారముకద. మీరిచ్చట

నొంటరిగ నేలయుంటిరి ?

పురుషుఁడు : నేనెచ్చటనైన నుండవచ్చును. నాకు మహా రాజు ననుమతి యున్నది. ఇంతకు మీరెవ్వరు ? ఎచ్చటినుండి వచ్చితిరి ?

నర్తకి నవ్వుచు—"ఆమాత్రము మీకు తెలియదనుకొను మందురా ?" యనెను.

పురుషుఁడు : ఎట్లు తెలియును ?

నర్తకి : ఎక్కడబట్టిన నక్కడ నుండగల మీకెవరెచటివారో తెలియదనుకొను నంతటి యజ్ఞురాలిని గాననుకొందును !

పురుషుఁడు : నాకు నిజముగ తెలియదు. అంత చెప్పుట కిష్టములేనిచో మానివేయవచ్చును.

నర్తకి : అట్టిదేమియుఁగాదు. కన్పించుదాని కడుగులెందు లకో ! నేను నర్తకిని - రతిని - గోపికను - రాధను - ఎదియైన నగు దును. మరి మీరెవ్వరు ?

పురుషుఁడు : మీకభ్యంతరము లేనిచో రతిపతిని - శ్రీకృష్ణుఁ డను - గోపాలుఁడను.

నర్తకి : చమత్కారముగ మాట్లాడుచున్నారు. మీరుకూడ నాట్యములఁ బాల్గొందురా ?

పురుషుఁడు : కావలెనన్నచో నభ్యంతరము లేదు. మీ నిజ మైన పేరు చెప్పనేలేదు.

నర్తకి : నాపేరు పాటలి.

పురుషుఁడు నివ్వెరపోయి—'నాపేరు పుండరీకుఁ'డనెను.

పాటలి సంతోషముతో పొంగిపోయెను, ఆమెకు నాఁడు చిఱు వెన్నెలలో నశ్వారూఢునిగ దర్శించిన యాపథికుఁడు కన్నుల ముందాడెను. నాటికన్న గంభీరుఁడు సుందరుఁడు నైనాడను కొనెను. పాటలి యాతని పాదములపై వ్రాలి నమస్కరించెను. పుండరీకుని కాశ్చర్యము తలమున్కలగుచుండెను. "ఇదేమి ! ఈమెకూడ తన్ను ప్రేమించుచున్నదా ?"

అతఁడామెను మృదువుగ లేవనెత్తెను. ఆమె తానభిన యించినదంతయు నిజమై తదపనయమైనంతగ సంతోషించెను ఆమె యాతని యురము నానుకొని "స్వామీ ! ఈ పాటలి తమ పాదములపై తనకుఁదానై సమర్పించుకొనిన పూజాపుష్ప" మనెను.

పుండరీకుఁడు : పాటలీ ! నా ముగ్ధమధుర ప్రణయరాజ్ఞీ ! నేనెంత యదృష్టవంతుఁడను ! నేననుభవించు మనోవ్యథ లీనాఁడు

తొలఁగినవి.

పాటలి : ఈ వసంతోత్సవములు మన జీవితముల వసంతోదయమును సృష్టించినవి !

పుండరీకుఁడు : నిన్నా సందెవేళ చూచినక్షణముననే నా మనస్సున మన్మథుఁడు తలసూపినాఁడు. నాటినుంటి నేపడిన వేదన యేమని చెప్పను !

పాటలి : స్వామీ ! అది నాకుఁ దెలియనిదికాదు. మీ దర్శనమునకై తపించి పోవుచున్నాను. అది పొసగలేదు. మీ దర్శనము నపేక్షించియే నేనీ నాట్యప్రదర్శనమును యత్నపూర్వకముగ నేర్పాటు చేయించుకొన్నాను దేవి నాయందు ప్రసన్నురాలైనది ఇప్పటికి నేనదృష్టవంతురాలనని చెప్పవలెను.

పుండరీకుఁడు : ఆ మాట నీ వనవలసినదికాదు నా కర్తవ్యకఠినమై బాధ్యతాభారమైన అనురాగ శూన్యమై శిలాసదృశమైన గుండియలో రాగమల్లికల మొగ్గఁ దొడిగించిన నీ సందర్శనము వలన నేన యదృష్టవంతుఁడను. నాహృదయమున ననురాగమను వస్తువునకు స్థితికల్పనఁ జేసినది నీవ నిన్ను చూచిననాటనుండి నీప్రేమలోపడి గిలగిల కొట్టుకొనుచున్నాను నాయొడలు నాకేతెలియని యయోమయావస్థలో నున్నాను. ఎటులైన నిన్నొక్కమారు చూడవలెనని యటమటించి పోయితిననుకొనుము. వప్పస్వామి నీవివరముల సేకరించెను కాని నేనై వికుంతపురమునకు రాజాలక పోయితిని రాజకార్యములు నన్ను కదలనీయలేదు. ఈ వసంతోత్సవములలో నీవు నాకు దర్శన మొసగెదవని నామనస్సు చెప్పచుండెను ఈ యుత్సవములలో మీ గ్రామమునకువచ్చి నిన్ను చూడవలయు ననుకొంటిని నీవు రతివగుదువని స్వామి చెప్పెను. నిన్నట్లే చూచెదననుకొంటిని. కాని యిచ్చట రాజధానిలో గోపికవై కనిపించితివి !

పాటలి : ఎటులైననేమి ? అయిదునెలల దీర్ఘభావనావేదనల హాలాహలము ననుభవించిన తరువాత నమృతమూర్తి వయిన నీదర్శనము లభించినదిగద! అదియె చాలును నాబ్రదుకునకు పరమార్థము.

పుండరీకుఁడు : నీ ముఖసౌందర్య దిదృక్షా ముగ్ధుఁడనై నా పనిని మరచితిని.

పాటలి : ఏమిటది ?

పుండరీకుఁడు : మహారాజమాత గౌతమీబాలశ్రీదేవియు,

మహారాజు గౌతమీపుత్ర సాతకర్ణియు నిన్నేకాదశీ శుక్రవారమునాడు సాయంసమయమున జ్యోత్స్నామంటపమున తమ్ముఁ గలిసికొన వలసినదిగ నాజ్ఞవెట్టిరి. ఇదిగో పత్రము !

పుండరీకుఁడు రాజాజ్ఞాపత్రమును కన్నుల కద్దుకొని పాటలి కందిచ్చెను. ఆమెయు దానినట్లే కన్నులకద్దుకొని కంచులిక యందు పదిలపరచుకొనెను. రాత్రి ప్రొద్దుపోయినది. శుక్లాష్టమి నాటి వెన్నెలలు వెలుగు మాసిపోవుచున్నవి. యామికులు సమయసూచి ఘంటికారావము చేసిరి. అర్ధరాత్రి దాటవచ్చు చున్నది.

పుండరీకుఁడు : పాటలీ! మనమింక నిచ్చట తడయుట క్షేమముకాదు. అర్ధరాత్రివేళ మనల నిర్వుర నిచ్చట నెవరైనఁ జూచినచో నపార్ధ కల్పనకు హేతువగును. నిన్నెచ్చట దించ వలయును ?

పాటలి : కోటలో నాకొక విడిది నొసగిరి. అచ్చటికి పోయెదను.

పుండరీకుఁడు : నేను సహాయము వత్తునా ?

పాటలి : పాటలి యింతవరకసహాయ శూరురాలనిపించు కొనినది. ఇఁకముందు ససహాయశూరురాలగును.

పుండరీకుఁడు : అంతకంటే కాలవసినదేముండును !

పుండరీకుఁడు తోడురాగా పాటలి తన విడిదికి పోయెను. నాటి మిగిలిన రేయెల్ల కలవరింతలతో మధురోహలతో నిద్రగాని నిద్రఁజెందెను. పుండరీకుఁడు కృష్ణానదీ సైకతవేదికల నఱ మోడ్పుకన్నులతో పాటలీ నామ పునశ్చరణముగ రేయి వేగించెను.

తెల్లవారెను. నాఁడు కోటలో ఖడ్గ ధనుర్విద్యా ప్రదర్శనలు జరుగును. సైనికుడన్న వానికెల్ల నాడుత్సాహమురకలు వేయు చుండెను. నూత్నయోధుల నెన్నుకొనుటకూడ నాఁడే జరుగును. ఎవరి మొగమునఁ జూచినను ఆనందము వెల్లివిరియుచుండెను. అరుణోదయమునకు పూర్వమే జనులు సుస్నాతులై శుభ్రవసన ములఁదాల్చి కోటలోనికిఁ జనుచుండిరి. కోటలో పదివేలమంది ప్రేక్షకులు తిలకించుట కనువుగ నాసనములమర్పఁబడి యుండెను.

అది విశాలమయిన మైదానము. నాలుగు భాగములుగ విభ జింపఁబడి యున్నది. నలువైపులనుండి ప్రేక్షకులు దర్శించుటకు వీలున్నది. మధ్యభాగము వట్టి బయలు. అచ్చట నీ పరీక్షలు

జరుగును. తూర్పుదిక్కున మహారాజు, అధికారులు, పరీక్షాధికారులు కూర్చుండెదరు. తక్కిన మూఁడువైపుల జనానీకముండును. పరీక్షాధికారులకు ప్రక్కన ఖడ్గములు డాలులు విండ్లు బాణములు కుప్పలుగ పెట్టఁబడి యుండెను. పరీక్షలు జరుగు స్థలమున పలురకములైన లక్ష్యము లమర్పఁబడి యుండెను. నలువైపుల జనులు క్రిక్కిరిసి యుండిరి.

మహారాజరుదెంచు వేళయైనది. జనులెల్ల రెచ్చటివారచ్చట చిత్రించినట్లు నిశ్చలముగ నుండిరి. మహారాజాగమనమును సూచించు ఘంటారపము, కాహళ భేరీ నినాదములు వినవచ్చినవి. మహారాజ దర్శనమునకై ప్రజల కన్నులు వికసిత పారిజాతములైనవి. మహారాజు గౌతమీపుత్రసాతకర్ణియు మహారాజమాత గౌతమీ బాలశ్రీదేవియు నరుదెంచుచుండిరి. సాతకర్ణి పట్టపుటేనుగుపై నంబారి యెక్కి వచ్చెను. గౌతమీదేవి ముత్యముల పల్యంకికపై నరుదెంచెను. గౌతమీపుత్రసాతకర్ణి మహారాజు ధవళోష్ణీషమును ధరించెను. ధవళాంబరములు నవరత్నాంగుళీయకములు మకర కుండలములు ధరించెను. ఉష్ణీషము మధ్యభాగమున నింద్రనీల మణి యుండెను. దానిపై హంసతూలికతోడి తురాయి భాసిల్లుచుండెను. ఆయన సమ విభక్తాంగుఁడు. నాతిదీర్ఘ నాతిహ్రస్వ శరీరమువాఁడు. పండిన జామిపండుచాయ మేనివాఁడు. ఆకర్ణాంత నేత్రములవాఁడు, విశాల ఫాలము, సుదీర్ఘ నాసిక, విలువంపు కనుబొమలు, తళతళలాడు తీక్ష్ణములైన కనీనికలు, కొసల మెలి దిరిగి తుమ్మెదల బారు తీర్చినట్లున్న శ్మశ్రువు, కుడిబుగ్గపై తిల ప్రాయమైన పుట్టుమచ్చ, కంఠదేశమున రుద్రాక్షలు, సువర్ణ ఘటితములు నున్నవి. ఫాలమున త్రిపుండ్రములు, మధ్య కస్తూరీ తిలకముతో స్పృహణీయుఁడై వచ్చెను.

ఆయన నిర్ణీతస్థానమునకు కొంతదూరమున భద్రగజమున నవతరించి సువర్ణపాదుకల ధరించి వచ్చెను. చామరగ్రాహిణులు శృంగవాహికలు శ్వేతధ్వజవాహకులు, ఖడ్గధారులు ప్రతీహారులు, కంచుకి, కుబ్జులు, వామనులు, ఛత్రధారులు, ఆయనను చుట్టి వచ్చుచుండిరి. వివిధవాద్యము లొక్కపరి మిన్నుముట్ట మ్రోగినవి. ఆయన వెనువెంట రాజమాత గౌతమీదేవి వచ్చెను. ఆమెకును ప్రభువునకును రూపమున భేదమేలేదు, స్త్రీపురుషాకార భేదములను వదలి చూచినచో నిరువురు నొక్క రూపమనియే చెప్పవచ్చును మహారాజు తన తల్లి రూపమును ముమ్మూర్తుల పుణికిపుచ్చుకొనెను

ఆమె నిలువెల్ల శ్వేతమూర్తియై శారదాభ్రశకలమువలె నుండెను. ధవళవసనముల ధరించెను. మౌక్తికమాల, ముక్తాకంకణములు, ముక్తాంగుళీయకము, భస్మత్రిపుండ్రములు ఫాలమునఁ దాల్చినది. పలితకేశ అపాదమస్తకము ధవళమూర్తియై సరస్వతీదేవివలె భాసిల్లుచుండెను. ఆమె ననుసరించి యశ్వగజాందోళికలు వచ్చెను. ఆమెయు పల్యంకికము డిగ్గి హెగ్గడికత్తెలు దారిఁజూపగా ఛత్రధారిణులు పరివేష్టించి రాగా పరిచారికలు ముందు నడవగా నిర్ణీతస్థానమునకు వచ్చెను. ఆమె నడచివచ్చినమేరకు పచ్చికస్తూరి జవ్వాది వట్టివేరులు కురువింద పచ్చకర్పూరము కలియఁబోసిన పరిమళములు నాసాపుటముల సోడు ముట్టించుచుండెను. వారిని జూచుచునే ప్రజలు హర్షధ్వానములతో జయజయ ముఖరిత వదనులైనారు. మరల నిశ్శబ్దత తాండవించినది.

విద్యాప్రదర్శ నారంభ సూచి ఘంటారావము ముమ్మారైనది. మొదట ధనుర్విద్యా ప్రదర్శనము నేర్పాటు చేసిరి. పలు దేశములందలి వీరులందు పాల్గొనిరి. ధీరులైన సామాన్య సైనికులు రాజకుమారులుకూడ నందు పాల్గొనిరి. అచ్చట నెట్టి భేదములును పరిగణింపఁబడవు. సాతవాహన సామ్రాజ్యమున నంతర్లీనమై యున్న రాష్ట్రము లన్నిటినుండి యనేకమంది యువకులు వచ్చి పోటీలలో పాల్గొనిరి. వీరితో సఖ్యము నెఱపు రాష్ట్రములవారు వచ్చిరి. మొదట విలువిద్యలో పరీక్ష జరిగెను. దూరమున నున్న లక్ష్యమును ప్రతిబింబమును జూచి భేదించుట, నిరంతర చలనశీలమైన చక్రములో నుంచబడిన లక్ష్యము నొకే బాణముతో కొట్టుట, ఒకే బాణమున నాలుగైదు వరుసలుగ నున్న లక్ష్యములను భేదించుటలు జరిగెను. ఇవి యన్నియు వైయక్తికములు. పదిమంది యువకులు వైచు బాణముల నొక్కఁ డొడ్డుకొనఁగల్గుట పదిమంది నొక్కఁడే బాణములతో గప్పివేయుట మొదలగు సామూహిక ప్రక్రియలు జరిగెను. బహుదూరమునకు బాణములను విసరుటొక పరీక్ష!

వరుసగ యోధులు వచ్చుచున్నారు పోవుచున్నారు.

తుద కొక బాలవీరుఁడు వచ్చెను. చూచుట కాతఁడు కుమారమన్మథునివలె నుండెను. పోటీలలో పాల్గొనుటకై వచ్చినాఁడు. నూనూగుమీసములు సైత మంకురింపలేదు. పదియునైదేండ్లయిన నున్నవో లేవో! పరమ సుకుమారమూర్తి. అతనిఁ జూడగనే ప్రేక్షకులందఱకు ముద్దు వచ్చినది. అతని పేరు ముగ్ధదీపుఁడు. అతఁడెఱ్ఱని వస్త్రమును మడఁచికట్టి పసుపుపచ్చని యంగీ ధరించి తెల్లని

యుపవస్త్రమును నడుమునకు బిగించెను. శిరస్త్రాణము ధరించెను. రంగస్థలమునఁ బ్రవేశించి తనకుఁ బూర్వమైనవారు నిర్వహించిన తీరులన్నియుఁ జేసి చూపించెను. మహారాజు, రాజమాత, యధికార వర్గము నాతని విద్యా పాటవమున కచ్చెరు వొందిరి. ఈతఁ డభిమన్యుఁడా యనుకొనిరి! యువరాజైన వాసిష్ఠీపుత్రపులమావి కూడ నదే వయసువాఁడు. ఆయనకీ యువకుని జూడగనే యాతనితో స్నేహించవలె ననిపించెను. రాజమాత గౌతమీదేవి యాతనిఁ దన యొద్దకు పిలిపించుకొనవలయు ననుకొనెను.

మరల కత్తియుద్ధమున పరీక్షలు సాగినవి. వానియందు సైత మీ బాలవీరుఁడు చమత్కారముగ చంక్రమణములు చేయుచు నీడునకు మించిన వైదుష్యమును ప్రదర్శించెను. చూపరుల హృదయములఁ జూరగొనెను. పోటీలు పూర్తియగునంతకు మహా రాజా బాలవీరుని విస్మయముగఁ దిలకించుచుండెను. నిన్నటి నట్టువరాలి కీతఁడు తమ్ముఁడా! ఆమెయం దెంత లాఘవమున్నదో యాతనియందంత చాకచక్య మున్నది. ఆమె నృత్యమున నెన్ని మెలికలు తిరుగునో, యీతఁడు ఖడ్గమును ధరించి దూకుటలో బరిమీఁద గిరికీలు కొట్టుటలో నెదుటి వీరుని కత్తి నొడ్డికొనుటలో, నంత లాఘవముగఁ బ్రవర్తించును. ఆ నాట్యవేత్రి మొగమున నెన్ని శృంగారభావములు దీపించునో యీతని వదనమున నన్ని వీర రౌద్ర రేఖలు పర్వులెత్తును. పదునారేండ్లు పయిఁబడని బాలుఁడు! వాని యాయుధప్రయోగ నైపుణికి మహారాజు మిగుల నానందించెను. ప్రభువు వారి నిర్వర గౌరవింపఁ దలఁచెను. నిర్ణీత సమయమునకు సభ ముగిసినది. నాఁడు సైన్యమున నాల్గువందలమంది సైనికులు క్రొత్తగఁ జేర్చుకొనఁబడిరి.

ముగ్ధదీపునికి రాజమాత తమ్ము దశమినాటి సాయంతనమున కోటలోని చంద్రశాలలో కలసికొనవలసినదిగా నాజ్ఞ వెట్టెను. ముగ్ధదీపునిఁ గాంచిన మరుక్షణమునుండి పుండరీకునికి మతి పోవుచున్నట్లుండెను. ఇదియేమి! ఈతఁ డెచ్చటివాఁడు? ఇతనికిని పాటలికికినంత పోలిక లున్నవేమి? పాటలి యన్నయైన లలితుని తాను చూచెను. అతఁ డొక్కఁడే యామె కన్నగారు. ఆమె పిన తండ్రి మందారకుఁడు. తనకు పరిచయము లేదుగాని తానాయనను చూచియుండెను. వా రిరువురితో నామె పోలిక లంతగా కలియవు. ఈ బాలవీరుఁ డచ్చముగ నామెను బోలియున్నాఁడు. ఈతని నితః పూర్వము తానెచ్చటను చూడలేదు. పదునైదేండ్లుండునేమో!

అదియేమి వైశారద్యము! ఈతని విషయము మిగుల చమత్కార ముగ నున్నది. ఈతని గురించి యానుపూర్వముగా తెలిసికొనవలె ననుకొనెను.

సభ సమాప్తమగునంతకు మధ్యాహ్నమైనది. జనము పలుచబడినది. రాజమాతయు మహారాజును తమ తమ సౌధములకుఁ జనిరి. ముగ్ధదీపుఁ డొక్కఁడు విల్లునమ్ములు చేబూని ఖడ్గము నడుమున వ్రేలాడుచుండగా బాలరామునివలె నడచిపోవుచుండెను. ఆతనికి తెలియనంత దూరమునుండి పుండరీకుఁ డాతఁడెచ్చటికి పోవునో యని చూచుచుండెను. ముగ్ధదీపుఁడు పోయిపోయి తన వసతికిఁ జేరుకొనెను. పుండరీకునికి కన్నులు తిరిగిపోయెను. పాటలికిచ్చిన విడిదిలో నీతఁడు ప్రవేశించునేమి? ఈతఁడామెకు దగ్గరవాఁడై యుండవలయును. లేక మరియొక విధముగ జరిగెనా? అట్లు జరుగునా? ఏమో! పుండరీకుని మనస్సునందు పలురకముల యూహలు చెలరేగుచుండెను.

నాటిరేయి చీఁకట్లు బాగుగ ముదిరిన వేళ పుండరీకుఁడు పాటలి విడిది కేగెను. అచ్చట ముగ్ధదీపుఁడు లేడు. పాటలి యొంటరిగ నెదో చదువుకొనుచుండెను. పుండరీకునిఁ జూచి యామె నిలబడెను. పాటలిని చూడగనే పుండరీకుని కా బాలవీరుఁడు కన్నులముందు నిలిచినట్లుండెను.

పుండరీకుఁడు: పాటలీ! మీ గ్రామమున నెవరైన బాలవీరులున్నారా?

పాటలి: బాలవీరులా? అంత చిన్నవాండ్రు వీరులున్నారనుకొనను.

పుండరీకుఁడు: ముగ్ధదీపుఁడఁట! బాలవీరుఁ డొకఁడచ్చముగ నిన్నుఁ బోలియున్నాఁడు.

పాటలి: ముగ్ధదీపుఁడా! పేరు చాల మధురముగ నున్నదే! పిల్లవాడుసైతము మల్లేయున్నాఁడా? ఆతనితో మీ కేమిపని? మీ యొద్దకు వచ్చెనా? ఏమనినాఁడు?

పుండరీకుఁడు: నే ననిన దేమి? నీవు మాటాడున దేమి?

పాటలి: మీ రాతనిఁ జూచినారు. కనుకనే యాతనిఁగూర్చి నాతో ప్రసంగించుచున్నారు. మీ మాటలనుబట్టి యతఁడు బాలుఁడు మహా వీరుఁడును గావలయును. అంతేకద!

పుండరీకుఁడు: ఎటులైన నీవు గడుసుదానవు. నీతో వేగుట చాల కష్టమువలె నున్నది.

పాటలి : ఎంతమాట స్వామీ ! తమతో వేగుటనున దుండునా యని !

పుండరీకుఁడు : అనినసేమో నా కర్థమగుట లేదు.

పాటలి నవ్వి—"మీరు సర్వ గూఢచారిదళములపై మీఁదు మిక్కిలి కొంత సైన్యముపై నధికారులుగద ! మీరు పగలనక రే యనక రాజకార్యములపై తిరుగుచుందురు. మీతోఁడి రేలువేగునా యని నా యనుమానము" అనెను.

పుండరీకుఁడు : పాటలీ ! నీవు పండితురాలవు. నీ వర్థ గర్భముగ మాట్లాడుదువు, నా కంత త్వరితముగ నర్థము కాదు.

పాటలి : అట్టిదేమియుఁ గాదు. మీరు పండితులు కానిచో 'నర్థగర్భముగ' ననుమాట వాడనేలేరు. మీరు సాహిత్యమునఁ బరిశ్రమ చేయలే దంతియ. మీకు తెలియకుండ మీలో సాహిత్యాభి ముఖమైన లక్షణము సన్నిహితమై యున్నది. ఏ గుణమైన రాణించ వలెనన్న దానికిఁ దగిన ప్రేరణయు నుద్దీపక సామగ్రియు సమ కూరుచో నది దీపించును. లేనిచో మరుగున నుండిపోవును. నివురు గప్పిన నిప్పు కదలించినచో మండును. కదలించెడువారు లేనిచో నేమగును ? అణగారిపోవును. మీ యందంతర్నిహితమై యున్న సాహిత్యాభిరుచి ఆ నివురుగప్పిన నిప్పువంటిది.

పుండరీకుఁడు : అయిన నీ వా నిప్పును జ్వలింపఁ జేయు దువా ? నీ చూపులు పర్వినంతమేర కచేతనములైన పదార్థములు సైతము ప్రాణవంతములగు ననిపించుచున్నది. నిన్నటి నీ యభినయ మదియేమి! సభ్యులెల్లరు సమ్మోహితులైనారనుకొనుము.

పాటలి : అదిగో చూచితిరా ! మీరు కవిత్వము మాటాడు చున్నారు నిన్న నే నభినయించలేదు. అది నా వాస్తవిక స్థితి ఒక స్వామికై నా హృదయము తపించుచున్నది. ఆ భావమును నేను శరీరావయవ చాలనముల ద్వారమున వెలువరించితిని. అది యభినయమువోలె భాసించినదేమో ! ఇఁక నా యభినయముతో పని తీరిపోయినది. నా స్వామి నన్ననుగ్రహించెను.

పుండరీకుఁడు : అట్లని నీ స్వామి చెప్పెనా ?

పాటలి : చెప్పె ననుకొంటిని.

పుండరీకుఁడు : నీ స్వామిపై నీ కా మాత్రము ప్రత్యయ మున్నఁ జాలును.

పాటలి : మరి మీరు ముగ్ధదీపుని చూచెదరా ?

పుండరీకుఁడు : చూడవలెననియే యున్నది కాని యెచ్చట

నున్నాడో ! ఎచ్చటికేగినాఁడో ? ఆతనివెంట వేరెవరున్నట్లు కనిపించ లేదు.

పాటలి : అంత చిన్నవా డంత మహావీరుఁడైనప్పుడు వానికి వేరొకరి యవసర మేముండును ?

పుండరీకుఁడు : అవును. అవసరమే లేదు. కాని పసివాఁడు గద ! ఒక్కొక్కప్పుడు జన్మాంతర సుకృత విశేషమున వీరుఁడు గావచ్చును. మహాగాయకుఁడు గావచ్చును. గొప్ప పండితుఁడు గావచ్చును. మరేమయినఁ గావచ్చును. అదియు వాని జన్మపరిపాక మున చిన్న వయస్సుననే సిద్ధింపవచ్చును. అంత మాత్రమున వానియందలి చిన్నతనపు లక్షణములకు కొదువ యుండదు వారల విద్యలన్నియు ప్రయోగవేళల నప్రమేయముగ భాసించును. ఇతర సమయములందు వారికి వయోనిసర్గములైన లక్షణములే దీపించును.

పాటలి : అబ్బో ! మీరు మనోలక్షణములను సునిశితముగ సూక్ష్మసూక్ష్మముగఁ బరిశీలింతురే ! ఆ పైన చెప్పినవారి లక్షణములు మీయందుగూడ నున్నవి. లేకున్న మీ రింత చిన్నవయసున నింత బాధ్యతాయుతమైన పదవియందు నియుక్తులై సాతవాహన సామ్రాజ్యమునకు చారచక్షువు లైనారన్నచో నది పూర్వజన్మ సుకృతమేగాని వేరుగాదు.

పుండరీకుఁడు : అయినచో నీవనునది నేను సైతము వయో ధర్మమున కతీతుఁడనుగానని యేకదా !

పాటలి కలకల నగి—"కాదు కాదు ! చిలిపితనమును నెఱపకుడు. మీరు ప్రత్యేకమైన వైశిష్ట్యము కలవారు" అనినది.

పుండరీకుఁడు : ఇంతకు ముగ్ధదీపుఁడు నీకుఁ దెలియునా ?

పాటలి : మీ కాతని జూడవలయునని కోరిక యంత బలీ యముగ నున్నచో చూపింతును.

పుండరీకుఁడు : ఆఁ ! నిజముగ చూపింతువా ? నీకు తెలియునా ? తెలియదంటివే !

పాటలి : అడిగిన వెంటనే చూపినచో మీ రింత తడవు నా యొద్దనుండి సంభాషింతురా ?

పుండరీకుఁడు : ఏదీ ! ముందు వానిని జూపించుము.

పాటలి : ఉండుఁ డిప్పుడే వచ్చెదను.

పాటలి లోనికిఁ బోయెను. పుండరీకుని కంతయు నాశ్చర్య ముగ నుండెను. లోపల నతఁడున్నాఁడా ? అతఁ డీమె కేమగును ?

ఇంతసేపు తా మిరువురు నిచట మాటాడుచుండగా నాతఁడు లోన నేమి చేయుచుండెను ? ఈ పాటలి చాల విచిత్రమైన పిల్లవలె నున్నది. అయిదారు నిముసములు గడచినవి. లోపలనుండి ముగ్ధ దీపుఁడు వచ్చెను. పుండరీకుఁ డాతని ఖడ్గవిద్యా ప్రదర్శనమునఁ జూచెను. ముగ్ధదీపుఁ డదే దుస్తులలో ప్రత్యక్షమాయెను.

పుండరీకుఁ డా యువకుని పాటలి యేదని ప్రశ్నించెను.

ముగ్ధదీపుఁడు : ఆమెయే నన్ను బంపినది. మీరు నన్ను చూడవలెనంటిరఁటగద !

పుండరీకుఁడు : అవును. ఆమెయేదీ? నీవామెకేమగుదువు? మీదికూడ వికుంఠపురమేనా ?

ముగ్ధదీపుఁడు : నాకును పాటలికిని ప్రాణమొక్కఁడే !

పుండరీకుఁడు : అనినచో ?

ముగ్ధదీపుఁడు : అనినచో నేమున్నది ! స్త్రీపురుష భేదమును పాటించనిచో మేమిర్వుర మొక్కటేయని చెప్పుచున్నాను.

పుండరీకుఁడు : పాటలి రాదేమి ? ఆమె యెచటికి పోయినది ?

ముగ్ధదీపుఁడు : నేను చెప్పిన దర్థమగుటలేదా ?

పుండరీకుఁడు : నీప్రసంగము చిత్రముగ నున్నది. స్త్రీపురుష భేదము పాటించక పోవుటెట్లు ?

ముగ్ధదీపుఁడు నవ్వసాగెను. పుండరీకుని కంతయు నయోమయముగ నుండెను. ఆతఁడు ముగ్ధదీపు నాపాదమస్తకము పరిశీలింపసాగెను. ముగ్ధదీపుని పాదములకు నూపురము లుండెను. అవి పాటలిని పట్టియిచ్చినవి ! పుండరీకుఁ 'డోహో !' యనుకొనెను. పాటలి ధైర్యసాహసములను, సకల విద్యాపారీణతను మెచ్చుకొనెను. కాని పైకిట్లనెను— "మీ గ్రామమునందలి వీరులు పాదముల నూపురములుంచుకొందురా ?"

పాటలి మనస్సు కళవళపడెను.

పుండరీకుఁడు : ఈ మంజీరములు పాటలివివోలె నున్నవి. ఇంటిలోగూడ శిరోవేష్టనమెందుకు ? పట్టాకత్తి యెందుకు ? అనుచునే పుండరీకుఁడు ముగ్ధదీపుని శిరస్త్రాణము నపసరించెను. తొలగించుటయే తడవుగ యెత్తయి దీర్ఘమైన కేశరాశి జలజల రాలినది. మగవారికి నూపురములు శోభించవని పుండరీకుఁడు వంగి యామె పాదమంజీరములపై చేయివైవఁబోయెను. పాటలి వంగి యాతని చేయిని తన చేతిలోనికిఁ దీసికొని "క్షమించుఁడు స్వామీ !

అపచారము. నేను మీకు దాసీభూతను. మీరు నాపాదములనంట రాదు" అనెను.

పుండరీకుఁడు : ఓసి నాహృదంతర ముగ్ధదీపికా! నీవు నా దాసివికావు. నాదేవివి. దేవినిపూజించవచ్చునుకద!

పుండరీకుఁడామెను కౌగలించుకొనెను. ఆమె పులకించి పోయెను.

పుండరీకుఁడు : పాటలీ! ఈ విద్యలన్నియు నీవెందులకు నేర్చినట్లు? రాజసమ్ముఖమున నంతమంది మహాయోధాగ్రేసరుల మధ్య మృగేంద్రశాబకమువలె నటు లెట్లు విజృంభించితివి? నీ కంతటి సాహస మెట్లు వచ్చినది! రాజమాత నిన్ను రమ్మనినది గదా! యువరాజు నీస్నేహము నభిలషించుచున్నాఁడు. నీవేమి చేసెదవు? నిన్నటి నీ విద్యాప్రదర్శనముఁ జూచిన నాకు సత్యభామాదేవి జ్ఞప్తికి వచ్చినదనుకొనుము.

పాటలి : ఆమె నాకారాధ్యదేవత!

పుండరీకుఁడు : అటులచెప్పుము. ఆమెను ధ్యానించి ధ్యానించి నీవే యామెమైనట్లున్నావు.

పాటలి : అంతటి యదృష్టమా!

పుండరీకుఁడు : ఓసి ముగ్ధదీపమా! నీకేమి తక్కువైనది? ఇంత చిన్నవయసున నిన్ని స్త్రీపురుష విద్యల నేర్చితివి. మహారాజ రాజమాతల మెప్పుల నందికొంటివి. వారలచే నాహ్వానింపఁబడు స్థితిలో నున్నావు. నీకంటె నదృష్టవతు లెవ్వరందువు?

పాటలి : అదిసరిగాని స్వామీ! ఇప్పుడొక చిక్కువచ్చి పడినదే!

పుండరీకుఁడు : ఏమది?

పాటలి : రాజమాత గౌతమీదేవియు మహారాజును నన్నుఁ బిల్వనంపిరిగదా! వారిరువురిలో నొకరు పాటలిని వేరొకరు ముగ్ధ దీపుని చూడవలసి యున్నది.

పుండరీకుఁడు : నేను చూడలేదా?

పాటలి : వారధికారులు. వారేమందురో! ఛలముఁదెలిసి శిక్షింతురేమో?

పుండరీకుఁడు : మన మహారాజు దూరదృష్టి యధికముగఁ గల్గినవాఁడు. ఆయన నిన్ను పిలిచెనన్నచో నీవలన రాజ్యమునకుఁ గావలసినదెదోయొక మహాకార్యము సాధింపఁదలచి యుండును. నీచే కార్యసాధన నపేక్షించు నా మహారాజు నిన్ను శిక్షింపడుగద!

పాటలి : మరి రాజమాత !

పుండరీకుఁడు : ఆమెయు కొడుకును నొక్కటియే. ఆమె సైతము నిన్నందులకే పిల్వనంపియుండును.

పాటలి : మీకు వారల మనోవృత్తులు బాగుగఁదెలియునే !

పుండరీకుఁడు : నేననుక్షణము వారి సన్నిధానమున మసలు చుందునుగద ! అదియుఁగాక వృత్తిచేతఁగూడ నేను మానవుల మనోరహస్యములను వెలికిఁదీయు వాఁడనుకద !

పాటలి : బ్రదికితిని. ఈనాఁడు నేను మహారాజును దర్శింప వలసియున్నది ఏమిచేయను ?

పుండరీకుఁడు : నేను నిన్ను వారిరువు రొక్కమారుగ చూచు నట్లు చేసెదను. వారట్లు కబురువెట్టినను వారిర్వురు కలిసియే చూచెదరు.

పాటలి : అయిన మరి నేనెట్లు కనిపించవలయును ?

పుండరీకుఁడు : రెండువిధముల కనిపించుటకు సిద్ధపడి యుండవలయును.

పాటలి : అటులే.

పుండరీకుఁడు : నీవు ప్రభుదర్శనమునకు వచ్చునప్పుడు మహారాజ్ఞి వాసిష్ఠీదేవి బహూకరించిన రత్నహారము నేమరక ధరించి రమ్ము. అట్లొనర్చుట వారిని గౌరవించుటన్నమాట.

పాటలి : తప్పక ధరింతును.

పుండరీకుఁడు : నేను సాయంకాలము సూర్యాస్తమయము నకు పూర్వ మిచ్చటికి వచ్చెదను. నీవు సిద్ధముగనుండుము.

పాటలి తలయూచెను. పుండరీకుఁడామె చెక్కిలిపై చిటిక వైచి పోయివచ్చెదనని వెడలిపోయెను.

పాటలి పుండరీకుని గూర్చి భావించుచుండెను. ఇతఁడే మాత్రము తక్కువ పండితుఁడుకాఁడు. వప్పస్వామి యచ్చముగ కవిత్వమును మాటాడును. ఈతఁడు సమయసమయముల నవసర మునుబట్టి హృదయమును వెలార్చును. ఈయన పరిశీలన మాతని కన్న తీక్ష్ణము సహేతుకముగ నుండును. ఈయన కాతనికి పోలిక యెక్కడ? సాయంతనము దనుక గడపుటెట్లు ? ఆ వాసిష్ఠీదేవి యెంత సౌమ్యగంభీరమూర్తి ! వినయమన్న శబ్దమున కర్థభూతు రాలుగ నున్నదామె !

పాటలి రత్నహారమును చేతిలోనికిఁదీసికొని దానివంక కొన్ని క్షణములుఁచూచి దానియందలి పనితనమునకు ముగ్ధురాలై దానిని

కన్నులకద్దుకొని మెడలోవైచికొనెను. ఈ హారమును చూచి అమ్మ యెంతగ సంతసించునోగద యనుకొనెను. తన వీరత్వమునుగూర్చి విని తన పినతండ్రి తనయన్న లలితుఁడు నెంత మురిసి పోవుదురో! పాపము పిన్ని యీ కార్యక్రమములలో పాల్గొనలేదు. అన్న మధురా ప్రణయములో చిక్కుకొన్నాఁడు. చతుర్థీమంగళము కూడ కానిదే రాలేదు. తనతండ్రి యేమనునో! ఆయనతో తానివి యన్నియుఁ జెప్పలేదు. ఊరక యుత్సవములకు వచ్చుచున్నట్లు మాత్రమే చెప్పెనుగాని యీ పోటీలలో పాల్గొనుట మొదలైన విష యముల నాయనకుఁ జెప్పలేదు. తనతండ్రి తన్నేమియు ననడు. మీదుమిక్కలి సంతసించును.

పాటలి యా సాయంతనమువరకాలోచించుచునే యుండెను. పుండరీకుఁడు వచ్చువరకల్లే కూర్చుండి యుండెను. అతఁడువచ్చి పాటలినిజూచి నివ్వెరపోయెను. పాటలి భోజనమే చేసినటులలేదు. మొగము వాడియున్నది.

పుండరీకుఁడు: పాటలీ! ప్రొద్దుటినుండి యిల్లేయుంటివా?

పాటలి: స్వామీ! మీరెప్పుడు వచ్చితిరి? ఇప్పుడు సమయ మెంతయైనది?

పుండరీకుఁడు: బాగున్నది. రాజదర్శనమున కేగవలెగద! నీవేమిచేయుచున్నావు?

పాటలి: ఇదిగో క్షణములో వచ్చెదను.

పాటలి లోనికేగెను. తిరిగివచ్చునప్పుడామె ముగ్ధదీపుఁడు! పుండరీకుని కామెనట్లు చూడగనే ముద్దువచ్చినది. తనకు చిన్న తమ్మునివలె నున్నది! ఇరువురు చెరియొక యశ్వముపై వసంత మన్మథులవలె జ్యోత్స్నామంటపమునకుఁ బోయిరి. దశమినాటి వెన్నెలలు వారిని వెన్నంటి వచ్చినవి. వాసంతీ సుమసౌరభములు గుములుగుములుగ తెరలుతెరలుగ శీతలపవనచోదితములై సాగు చున్నవి. వచ్చిన యిరువురఁజూచి ద్వారపాలకుఁడు లోనికిఁబోయి వారిరాకను మహారాజునకు నివేదించివచ్చెను. వారిని వెంటనిడుకొని రాజసమక్షమునకు గొంపోయెను. లోపల మహారాజు గౌతమీపుత్ర సాతకర్ణియు రాజమాత గౌతమీబాలశ్రీదేవియు నున్నతాసనముల నాసీనులై యుండిరి. పుండరీక ముగ్ధదీపు లిరువురు ఖడ్గములఁ దూసి వారలిర్వురకు సైనికవందన మొనర్చిరి.

మహారాజు: పుండరీకా! ఈ యువకుఁడు నీకుఁదెలియునా?

పుండరీకుఁడు: మహారాజా! నేనిదివర కీతనిఁ జూడలేదు.

నిన్న విద్యాప్రదర్శనములలో చూచితిని. మహారాజమాత గౌతమీ బాలశ్రీదేవివారి యాజ్ఞపై నీతని నిచ్చటికిఁ దీసికొనివచ్చితిని.

మహారాజు : ఓయీ! నీపేరేమి ?

ముగ్ధదీపుఁడు : మహాప్రభూ! నన్ను ముగ్ధదీపుఁడందురు.

మహారాజు : నీదేగ్రామము ?

ముగ్ధదీపుఁడు : వికుంఠపురము.

మహారాజు : నీ తండ్రిపేరేమి ?

ముగ్ధదీపుఁడు : ధనంజయుఁడు.

మహారాజు : ఆతఁడా యూరి గ్రామణికద !

ముగ్ధదీపుఁడు : అవును ప్రభూ.

మహారాజు : నీవీ విద్యల నెవరియొద్ద నభ్యసించితివి ?

ముగ్ధదీపుఁడు : మా పినతండ్రి మందారకుఁడు మా యన్న లలితుఁడు ప్రభువువారి కొల్వులో నున్నారు. నేనీ విద్యల వారి యొద్ద నభ్యసించితిని.

మహారాజు : నీవు రాజధానికి వచ్చుటకిది మొదటి పర్యాయమా ?

ముగ్ధదీపుఁడు : అవును ప్రభూ !

ముగ్ధదీపుఁడు మాటాడుచున్నంతసేపు గౌతమీదేవి ప్రీతిస్నిగ్ధ నేత్రముల నాతని వీక్షించుచుండెను. ఆమెకాబాలుని వినయము మౌగ్ధ్యము, తీయని పలుకులు మర్యాదాతిక్రమణములేని సంభాషణానైపుణి ముచ్చటగొల్పుచుండెను. మహారాజు తమతల్లి కాతని యందుగల మక్కువను గమనించెను. పుండరీకుఁడు పాటలి యదృష్టమునకు సంతసించుచుండెను.

మహారాజు : ముగ్ధదీపా ! నీకు మా కొల్వులో నుద్యోగమొసగినఁ జేయగల్గుదువా ?

ముగ్ధదీపుఁడు : మహాప్రసాదము ప్రభూ !

మహారాజు : నీవేమిచేయవలెనో నీయవసరము వచ్చినప్పుడు కబురువెట్టెదము. నీవు సిద్ధముగ నుండవలెను.

ముగ్ధదీపుఁడు : ధన్యుఁడను ! తమయానతిని శిరసా వహింతును.

మహారాజు : ఇఁక నీవు వెళ్ళవచ్చును.

పుండరీక ముగ్ధదీపు లిరువురు తల్లికుమారు లిరువురకుఁ బ్రణామముచేసిరి.

ముగ్ధదీపుఁడు : మహాప్రభూ ! నాదొక మనవి.

మహారాజు : ఏమిది ?

ముగదీపుఁడు : మహాప్రభువులు నన్నేకాదశి శుక్రవారము నాఁడు సాయంసమయమున చంద్రశాలలో కలసికొనవలసినదిగా యాజ్ఞనొసంగినారు.

మహారాజాశ్చర్యపడెను— "ఏమి ! నిన్నాజ్ఞాపించినామా ? నిన్నుగాదే ! ఆ నర్తకిపరాలికిఁ గబురు వెట్టితిమి. నీకామె తెలియునా ? ఆమె చెప్పినదా ?" అనెను.

ముగ్ధదీపుఁడు : మహారాజా ! ఆ నర్తకిని నేనే. నా పేరు పాటలి !

ఇట్లనుచు ముగ్ధదీపుఁడు తన శిరస్త్రాణమును తొలగించివైచెను. ఆమె సుదీర్ఘ వినీలకుంతలములు చీకటిపూలవలె జలజల రాలినట్లయినవి. మహారాజమాత గౌతమీబాలశ్రీదేవి యాశ్చర్యచకితయై యామెనట్లే చూడసాగెను. ఆమె మనస్సున లక్షయూహలు పొడసూపుచుండెను. మహారాజు తమ జనని మనస్సును చదువుచుండెను.

మహారాజు : మంచిది. పుండరీకుఁడు నిన్ను మీ గ్రామమున దిగవిడుచును.

ముగ్ధదీపుఁడు : మహాప్రసాదము !

పుండరీకుఁడును పాటలియు సెలవుతీసికొని వెడలిపోయిరి.

గౌతమీదేవి : నాయనా ! శ్రీ !

మహారాజు : ఏమమ్మా !

గౌతమీదేవి : ఈ యువతి చాల విచిత్రమైనది.

మహారాజు : అవునమ్మా ! నాట్యమొనర్చిన నూర్వశి. కత్తి పట్టిన కుమారస్వామి. సౌందర్యమున నప్సరలను తిరస్కరించునటు లున్నది.

గౌతమీదేవి : అవునోయీ ! ఆమె జన్మాంతర సుకృత విశేషము ! ఆ పాటలిని చూడగనే నాకొక యూహ జనించినది.

మహారాజు : ఏమి యూహ ?

గౌతమీదేవి : పాటలి నృత్య నాట్యములయం దందె వేసిన చేయి. ఆయుధ ప్రయోగ విద్యలలో నారితేరిన పోటుబంట్లకుఁ దీసిపోని జాణ. ఈమెను పుండరీకుని యాధిపత్యమున క్షహరాట రాజ్యములోనికి గూఢచారిణిగఁ బ్రయోగించుచో బాగుగ నుండు ననిపించుచున్నది. నీ వేమందువు ?

మహారాజు : అమ్మా ! మీ యూహకు ప్రత్యూహ యనున దుండునా ? మీ రేమి భావించిన నది సిద్ధ్యభిముఖమై యుండును. మీ సంకల్ప మట్టిది.

గౌతమీదేవి : బాబూ ! మీ నాయనగారుసైత మిట్లే యనెడి వారు. ఈనాఁడు నీవనిన మాటలు సరిగ మీ నాయనగారన్న మాటలు !

మహారాజు : అమ్మా ! నాయనగారు మీతో సంప్రదించక యెట్టి కార్య మొనర్చెడివారు కారుగద ! నాకుగూడ తెలియునమ్మా ! మీ రాజనీతి యనితర సాధ్యమైనది. నాయనగారైన శివస్వాతి మహారాజు లిరువది యెనిమిదేండ్లు రాజ్యపాలన మొనర్చిరనిన నది యంతయు మీ మేధాసంపత్తిపై నాధారపడినదనియే చెప్పవచ్చును కదమ్మా ! అంతదనుక నెందులకు ? నేను రాజ్యమునకు వచ్చి పదునేనేండ్లయినదిగద ! మీ నీతి సూత్రముల నవలంబించి గద నా ప్రభుత సాగుచున్నది.

గౌతమీదేవి : అదికాదు బాబూ ! ఈ క్షహరాటు లింతకు ముందు మూఁడు పర్యాయములు మన పూర్వులతో యుద్ధము లొనర్చిరి. మూఁడు మారులు పరాభూతులైనారు. తిరిగి తలయెత్తు చున్నారు. వారు వట్టి మొండివారు. రాక్షసజాతి. వారిని మాయ చేతనే మట్టుపెట్టవలయును.

మహారాజు : అమ్మా ! మీ యాశీర్బలమున నీమారు క్షహరాట వంశమును నిరవశేషముగ నంతమొందింతును. వారి యాగడములు సహింపరాకున్నవి.

గౌతమీదేవి : అవశ్యమట్లే జరుగవలెను నాయనా ! నీ వీమారు నిస్సంశయముగ క్షహరాటవంశ నిరవశేషకరుఁడ వయ్యెదవు. మన పాటలిని వారిపైఁ బ్రయోగింతము.

మహారాజు : మీరు చెప్పినది యుక్తముగ నున్నది. ఆమె తన హావభావములచే నెంతటివారినైన తన వైపాకృష్టులనుగ చేసికొనగలదు. కాలము తప్పివచ్చిన నాత్మరక్షణ మొనర్చుకొన గల ధీరురాలు ! ఈ పని యామెకే తగినది.

గౌతమీదేవి : ఆమె క్షహరాట విజయమునకు ముఖ్యసాధన మగు ననిపించుచున్నది. పుండరీకుని పర్యవేక్షణలో నామెను త్వరలో క్షహరాటుల కీలకస్థానమున నాట్యకత్తియనుగఁ బ్రవేశ పెట్టవలెను. అవసరమునుబట్టి వీరునివలె వారి సైన్యమందుగూడ పరిచయము కలిగించుకొనవచ్చును. ఎటులైన రహస్యగోపనము

చేయుచు వైరిరాజుల వర్తమానములు వారల రహస్యములు వారల దండయాత్రామార్గములు మనకు తెలియఁజేయుచుండవలయును. ఆ యువతి కట్టి రహస్యగోపన సామర్థ్యము సమృద్ధిగనున్నది. వేషము మార్చిన బ్రహ్మభేద్యముగ నుండును. మన ఘనవిజయము నకు సాధనము దొరకినదయ్యా! దేవి సాతవాహని మనయందు ప్రసన్నురాలు.

మహారాజు : అమ్మా! మీరు చెప్పినట్లే ఆచరింతును.

కోటలోని శంకరాలయమున ఘంటారావములు వినిపించు చున్నవి. మహారాజు మహాదేవ పూజావ్యగ్రుఁడై లేచెను. గౌతమీ దేవియు తన సౌధమునకు విచ్చేసెను.

వారిరువు రశ్వారూఢులై బయలుదేరిరి. శుక్లైకాదశి నాటి వెన్నెలలు బాట కిరువైపులనున్న చిక్కని చెట్లయాకులలో చివురు జొంపములపైఁ బ్రసరించి వెన్నెల పూలు పూచినట్లుండెను. కృష్ణ వేణీ జలతరంగములపై ప్రతిఫలించి నాట్యకత్తియల యవయవ చాలనముల ననుకరించుచు చకచ్చకితము లగుచుండెను. ప్రకృతి సర్వము జ్యోత్స్నాధవళితమై యరిదళము నలఁదికొనిన నటీముఖ సౌందర్యమును వెలార్చెను.

అట్టి జ్యోత్స్నాపులకితమైన వసంతరాత్రివేళ వారిర్వురు కౌముదీజాగరణము చేయుటకై బయలువెడలిరి. దర్శకులకు వా రిరువురు పురుషులు. తమలో తమకు వా రిరువురు ప్రేయసీ ప్రియులు! రాజమాత గౌతమీబాలశ్రీదేవి, శ్రీసాతకర్ణి మహారాజుల ప్రశంసల నందుకొని వారిచే రాజ్యమునకు సేవ చేయవలసి వచ్చుచో కబురుపెట్టెదమని చెప్పించుకోదగిన స్థానమున నుంపఁ బడిన యతిశయగర్వమున పొంగిపోవుచున్నదా ప్రేయసి!

మహారాజు పాటలి నామె గ్రామమున సమర్యాదగ దిగవిడచి రమ్మని తన్నెందులకు నియమించెనో! ఆయన ఫలానుమేయమైన ప్రారంభములు గలిగిన దూరదృష్టిగలవాడు. ఆయన యాలోచన లెవో తన కనుకూలముగ నుండియుండును. పాటలి మహారాజు హృదయమున నొక ప్రత్యేకస్థాన మేర్పరచుకొన్నది. తన కంతకంటె కావలసినదేమున్నది! తామిర్వురుఁ గలసి సాతవాహన సామ్రాజ్య మును మూఁడు పూవు లారు కాయలుగ వెలయింతురు. ఇట్టి భావములతో పుండరీకుఁ డానంద తరంగిత హృదయుఁడైపోవు చుండెను. తన ప్రేయసి కేవలము గృహిణి మాత్రమేగాదు. అన్ని విధములఁ దన కనురూపవతి. అన్నియెడలఁ దన యంతటి

సమర్థురాలు. ఈ భావ మొక్కఁడు చాలును తా నాజన్మాంత మానందించుటకు !

వారిరువురు తమ యశ్వములను చిత్ర విచిత్రములుగ దూకించుచుండిరి. ఒకరి యశ్వముపైనుండి వేరొకరి యశ్వముపై లంఘించుచు చమత్కారములగు గతులలో స్వారి చేయుచుండిరి. పుండరీకుని యశ్వచాలనరీతి పరమాద్భుతమనిపించెను. పాటలిని చూచినకొలఁది యాతని కానందము తలమున్క లగుచున్నది. వారట్లు పోయి పోయి నదీపులినమున ప్రవాహమున కిసుమంత దూరముగ నశ్వముల నవతరించి యం దాసీనులైరి.

పుండరీకుఁడు : పాటలీ !

పాటలి : ఊఁ.

పుండరీకుఁడు : రేపు నీవు వికుంఠపురమునకు పోపలెగద !

పాటలి : అపశ్యముగ. అది మహారాజు సాతకర్ణుల వారి యాదేశము !

పుండరీకుఁడు : అవును. నేనుకూడ నాంధ్రదేశమును వీడి పోవలసి యున్నది.

పాటలి : ఎప్పుడు ?

పుండరీకుఁడు : నాల్గయిదు దినములలోనే గాపచ్చును.

పాటలి : తిరిగిపచ్చు టెన్నటికో !

పుండరీకుఁడు : చెప్పుట కష్టము. నెలలు పట్టవచ్చును. సంవత్సరములు పట్టవచ్చును. ఎంతకాలము పట్టిన నాశ్చర్య పడవలసినదిలేదు.

పాటలి తలదించుకొనెను.

పుండరీకుఁడు : పాటలీ ! మాటాడ వేమి ? తల వంచు కొన్నావు. సిగ్గుపడుచున్నావు, ఇచ్చట నీవును నేనేగద ! అయినను నీవంటి వీరయువతికి సిగ్గేమిటి ?

పుండరీకుఁడు పాటలి మొగమును తన దోసిలిలోనికిఁ దీసి కొనెను. పాటలి కన్నులవిరళముగ వర్షించుచుండెను. ఆమె చెక్కిళ్లు బాష్పబిందువులతో తడిసి యా తడిసినచోట వెన్నెల మెఱసి వింతయందమును వెలార్చుచుండెను. పుండరీకుఁ డామెను జూచి నిగ్రహించుకొనలేక—"నీవు వట్టి ముద్దరాల వైతివేమి ? మొన్నటి యా సాహస మేమైనది ? ఆ ధైర్యస్థైర్యము లేమయి పోయినవి. ఏదీ ! ఇటు చూడుము. ఇంత సుందరమైన నీ వసంత

రాత్రివేళ చంద్రికాతపమున నీకీ పాడు శిరస్త్రాణ మెందులకు ?" అనుచు నామె శిరస్త్రాణమును తొలగించి—"ఇప్పుడు చూడుము, నీ మోము చందమామను తిరస్కరించుచున్నది. నీ కురులు నవ మల్లికా సౌరభమును వెదజల్లుచున్నవి. నీ మెడలో ముత్తెపు సరములు, నీ జడయందలి విరజాజులు, నీ ధవళాంశుకములు, నీ వళక్ష శరీరచ్ఛాయ ; ఓహో ! నీవొక దివ్యమైన జ్యోత్స్నాభిసారిక వలె నున్నావు !" అనినాడు.

పాటలి మాట్లాడలేదు. ఆమె కన్నులనుండి యశ్రువులు వర్ష బిందువులవలె జారుచుండెను. పుండరీకుఁడు తన యుత్తరీయపు చెంగుతో నామె కన్నుల నొత్తి మరల నిట్లనెను—"ప్రియా ! నీవిట్లు ఖేదపడుచు కూర్చుండినచో సుదూరప్రాంతముల కేగనున్న నా మనస్సెట్లుండును ! నీ యీ కన్నీరు నన్ను వెన్నాడి నాకు నీ బాధా స్మృతులను మిగుల్చునుగద. కులపాలికలు కంట నీరిడిన భర్తలకు కీడుగద. ఏదీ ఒకసారి నవ్వుము. నీవు నవ్విన నా బ్రదుకున నవరత్నములు పండినట్లుండును. నీవు సాతవాహన సామ్రాజ్య పరిరక్షకులలో నొక మహావ్యక్తివి కాబోవుచున్నావు. అప్పుడిట్టి వియోగముల నెన్నింటి నెదుర్కొనవలెనో ! మన మొక్కచో కలసి యుండకపోవచ్చునుగూడ. అయిననేమి ! మన యంతఃకరణము లెల్లప్పుడు నన్యోన్యాశ్రయములై తదేకలగ్నములై యెడబాటను మాటనే దరిజేరనీయవు."

పాటలి : అది గాదు. ఇన్నినాళ్ల దీర్ఘవేదనానంతరము మీ సాన్నిధ్యము కల్గినదని మురిసిపోవుచుండగా మరల నింతలో నీ విఘాతము !

పుండరీకుఁడు : అవును పాటలీ ! రాజసేవామార్గము లిట్లే యుండును ! మనకు స్వీయవ్యవహారములకన్న మాతృభూమియు, మహారాజు నాజ్ఞయు ముఖ్యములు. దేశరక్షణము రాజసేవయు మనకు ప్రధానకర్తవ్యములు.

పాటలి : నేనుమాత్రము కాదంటినా ? ఆ సంగతి నాకుఁగూడ తెలియును. నేను సర్వథా మీ లక్ష్యముల ననుసరించి నడచెదను. కాకున్న తొలిపలపులో సాహచర్యపు తొలివియోగము నా మనస్సును కలవరపెట్టినది. అంతియకాని వేరుకాదు.

పాటలి నవ్వెను. వర్షోన్ముఖమైన నీలాంబుదము గాలిచే నెగురగొట్టఁబడి తెల్లమెగము వైచినట్లుండెను. పుండరీకుఁడు పైతము తన మనస్సులో బాధఁజెందుచుండెను. బీడువారి యెడారి

వలెనున్న తన జీవనకేదారమున వర్షేందిరయై పాటలి ప్రవేశించినది. అంధకారనిబిడమై శూన్యతను భజించు తన మనోంగణ దేశమున నామె స్నేహదీపికయై వెలుగుల నింపినది. ఆమెను వీడి తాను మనఁగలఁడా! ఆమె తనకు తెలియనంతవరకు తన కేమియుఁ దెలియదు. వట్టి యంత్రమువలె బ్రదికినాఁడు. ఆమె దర్శనము దేవీ దర్శన ప్రాయమై తనకుఁ దెలియని వన్నియుఁ దెలిసిన ట్లుండెను! పాటలి తన బహుజన్మ తపఃఫలము! ఆమెకు దూరమై సంచరించుటనిన తనకు ప్రాణసంకటముగ నున్నది. కాని కర్తవ్య కఠోరమైన తన జీవితమున నిట్టివి లెక్క సేయరానివి. భగవతి సాతవాహనీదేవి యనుగ్రహమున్న నీ క్షహరాటయుద్ధము విజయ వంతముగ ముగిసిన వెనుక తా మిరువురుఁ గలసి సుఖముగ జీవించవచ్చును.

పాటలి వేరొకవిధముగ భావించుచున్నది. అవును. నిజమే. తమ జీవితములకు ప్రధాన లక్ష్యము సామ్రాజ్య సంరక్షణము, మహారాజ సేవ! తాను చిన్నతనమునుండి కనిన కలలుగూడ నవియేగద. ఇఁక జీవితమున నట్టి సమయ మాసన్నమైనప్పుడు స్వార్థము నర్థించి రాజ కార్యములకు విఘ్న మొదవించుటకన్న మహాపరాధము వేరేముండును! లోకములో తమవంటి యువతీ యువకుల జంట లెన్ని లేవు? ఈ పత్కాల పర్యవసాయులైన సౌఖ్యముల నాసించి రాజకార్యముల నేమఱుట విజ్ఞతాలక్షణము గాదు. తన యదృష్టముచే తన యభిరుచులలో నన్నిట నేకత్వ మును భజించు భర్త తనకు లభించినాఁడు. స్త్రీజన్మమున కింతకు మిగిలిన సార్థక్య మేమున్నది! తాను భర్తృ విరహమును, పరమ శివుఁడు గరళమును భరించినటుల సహించుకొనగలదు. తన భర్త యభ్యుదయ మార్గముల కవరోధములు కల్గించు నంతటి యవివేకురాలు తాను కాజాలదు.

ఆ రాజమాత యెంతటి గంభీరహృదయ! వాసిష్ఠీదేవి యుద్ధ వేళల నేండ్లతరబడి పతి యెడబాటును సహించుకొనుచు నాయన యోగక్షేమములకై దేవి నారాధించెడిదఁట! తానెంత, తన బ్రదు కెంత! తన పతి లక్ష్యసాధనకై తాను జీవితాంతము సహకరించును. జీవితమంతయు వియోగమును సహించియైన తన భర్త యౌన్నత్య మును దర్శించును.

పాటలి నిశ్చింతముగ నూపిరి దీసికొనెను.

పాటలి: స్వామీ! ఇదేమింతదనుక నాకుపదేశ మొనర్చి

మీ రిప్పుడేమి చేయుచున్నారు ! ఈ మీ పాటలి తాత్కాలికోద్రేకము నకు లోనై యెదో బాధపడిన దంతేగాని యామె స్థైర్యహీనురాలు కాదు. మీరు నా కేడుగడయైనారన్న మాటయే చాలు ! పదివేల జన్మముల కా భావమును పోషించుకొనుచు గడపగలను. నాకొఱకుఁ జింతింపవలసిన పనిలేదు. కాని మీ వదనమున దైన్యభావమును నేను సహించుకొనలేను. ధైర్యగుణమున కాస్థానపీఠియైన మీ హృదయము స్త్రీగత వ్యామోహమునకు గుఱియై బడలిపోవుట నాకు భరించరానిది. మీ రుత్సాహవంతులై మీ కర్తవ్యమును నెరవేర్పుడు.

పాటలి పుండరీకుని చిబుకమును స్పృశించుచు నాతని కన్నులలో కన్నులుంచి బతిమాలినది. పుండరీకుఁడు తేరుకొని యిట్లనెను—"పాటలీ ! మన జీవితములు మన కలయిక చిత్రముగ నున్నవి, మన యీ కలయిక దేశమునకు మహాపద రానున్న యీ సమయములో నగుట మన భుజస్కంధములపై సామ్రాజ్య సంరక్షణ భారము మోపఁబడుట, దానితో మన మిరువురము భిన్నదేశము లకుఁ ద్రోయబడుట యంతయు నెదో యదృశ్యశక్తిప్రేరణవలె నున్నది. చమత్కారముగ నున్నది. ప్రభుదృష్టి నీపై నిలుచుట నీ మూలమున రాజ్యమునకుఁ గాదగిన కార్యము లుండుట యన్నియు నాశ్చర్యములే ! మన యీ యపూర్వమైన ప్రణయకథ ప్రళయ మార్గమును గడచి సుఖాంతమగునా ?"

పాటలి పుండరీకుని నోటిపై తన చేతినుంచి, "స్వామీ ! అమంగళమును పలుకవలదు, పాటలీపుండరీకులు నిత్యులు. వారల ప్రణయ మంతకన్న నిత్యము. భార్యాభర్తృ సంబంధము నే ప్రళయము లడ్డలేవు. నా మాటలు విశ్వసింపుడు. ఎన్నిజన్మముల కైన పాటలి మీ సహచారిణి !" యనెను.

పుండరీకుఁడు : నిజము పాటలీ ! నిజము. లేనిచో నెన్నియో దేశముల నెందరో పరమ సుందరీమణులైన స్త్రీలు నా కన్నుల కడ్డుతగిలినారు ! వారెవ్వరు నాకంటి కాగలేదు. చిత్రము ! నిన్ను చూడగనే నీయందు నా హృదయము తగుల్వడినది. ఇది జన్మాంత రానుబంధము. నీవు నా సహధర్మచారిణివి. ఈ కృష్ణవేణీ తరంగిణి చంద్రజ్యోత్స్న, శీతల పవమానము భూమ్యాకాశములు సాక్షులుగ నేను నిన్ను ధర్మపత్నిగ స్వీకరించుచున్నాను. మన మిది మొదలు సంవత్సరములుగ కలసికొనకపోయినను నీ భావమునకు చ్యుతి లేదు. లౌకికముగ మన వివాహము సంపన్నము కాకపోవచ్చును.

మనసుచేత హృదయముచేత మన మిర్వుర మొక్కటైనాము.

పాటలి : ధన్యురాలను నేను వాంఛించున దిదియే. ఇఁక నేను నిశ్చింతముగ నుండిపోగలను.

పుండరీకుఁడు : పాటలీ! మన వివాహము జరుగుటకు సమయము పట్టును. ఈ యుద్ధప్రళయానంతరముగాని మన పెండ్లి జరుగదు.

పాటలి : ఇప్పుడేగద పంచభూతముల సాక్షిగ మన వివాహము జరిగినది! వివాహ మనిన మనోవాక్కాయముల నొకరికొకరంకితమై పోవుటయేగద! అది మన పరస్పర ప్రథమ వీక్షణముననే సిద్ధించినది. ఇంక నీకాండ యెవరికొఱకు? లోకము కొఱకా? నా యంతఃకరణముకన్న నాకు లోక మెక్కువది కాదు. మన కీ జీవితమున వివాహము జరుగదనుకొనుఁడు. నే నందులకు చింతింపను. మీతో కలసి గడపిన యీ రెండు మూఁడు రోజుల మధుర స్మృతు లాలంబముగ జీవితమును గడిపివేయఁగలను. భావము నాశ్రయించికద బ్రదుకు సాగునది. భావ రహితమైన విషయ మేమైన నున్నదా? మన మే భావమును పోషించుకొనిన నదియే వృద్ధిఁ బొందును. మనస్స్థైర్యమున కసాధ్యమైన దేమియు నుండదు. అమృతముఁ గ్రోలిన జిహ్వ లిక్షురసము నపేక్షించునా? మీ పాటలి స్థిర సంకల్ప. స్థిరబుద్ధి. మీరు నిశ్చింతముగ మీ కర్తవ్యములను నెరవేర్చుకొనవచ్చును. పాటలి మీకొఱకు మీ కార్యానుకూల్యమునకై తపస్సు చేయును.

పుండరీకుఁడు : నా పాటలి యట్టిదని నాకుఁ దెలియును. నీవంటి బుద్ధిమతిని సహచారిణిగ పొందగల్గిన యదృష్టము నాకే కలిగినది. నే నొకటి చెప్పుదునా? నిజమునకు సూక్ష్మముగ విచారణ సేయుచో నీ యల్పిష్ఠమైన శరీర సంబంధ మన్నిఁటికంటె నధమమైనది. భౌతికదేహముతో జీవి వాంఛ నెంతవర కనుభవించ గలదందువు? కన్ను లున్నవి అవి కొంత పరిమితిలో మాత్రమే వెలుఁగును దర్శింపగలవు. శ్రవణేంద్రియ మున్నది అదియు నంతియ. కొంత వ్యవధిలోననే వినఁజాలును. ధ్వని యధికమగుచో బాధిర్య మేర్పడును. అటులే స్పర్శ. ఈ శరీరము దేనినైన కొన్ని పరిధుల నతిక్రమించి యనుభవించ లేదు. మనస్సున్నది. మనస్సుతో నేమైనఁ జేయగలము. మనస్సున నందనముల సృష్టి యగును. నరకము లుద్భవించును. మన మా మనస్సు నాశ్ర

యించుదము. మన భావనామయ దాంపత్య మక్షయ మధురమై విలసిల్లును. శరీరావధికమైన కామము మనకు వలదు. అంతకు భిన్నమై నిత్యనూత్నము నాహ్లాదకరమునైన మార్గము మన కుపాదేయమగుగాక !

పాటలి : దేవతలు తేజోరూపులు. వారవధి రహితులు. తపస్సుచే దేవతాత్వము సిద్ధించును.

పుండరీకుఁడు : అవును పాటలీ ! తపస్సనిన నేక విషయ గత బుద్ధియై తదేక లగ్నమానసుఁడై త్రికరణములచేత దానినే భావించుట. ఆ భావనాస్రవంతి సాగిసాగి మహాసముద్రముగ విస్తరించి యంతకంతెను విస్తృతమై సర్వ ప్రపంచమును గప్పివేయును. మన మా మార్గము ననుసరింతము. అప్పుడిక మనకు వియోగము లేదు, దుఃఖము లేదు. ఎదో మనకే తెలియని తృప్తి యొక్కఁడే మనల నంటిపెట్టుకొని యుండును.

పాటలి : మీరు చెప్పినది యదార్థము. గడచిన యయిదు నెలలు నే ననుభవించిన పరిస్థితిని సమ్యగాలోచన చేసినచో మీరు నిర్వచించిన సత్యము సువ్యక్త మగుచున్నది.

పుండరీకుఁడు : అవును. నేను సైత మనుభవమునుండి గ్రహించినదానినే నీకుఁ జెప్పితిని. నే నంతగా చదువుకొన్నవాఁడను గాను.

పాటలి : సహజబోద్ధలయినవారికి గ్రంథపఠనముతో పని యేమి ? అనుభవమును మించి యేమున్నది ? అనుభవమును కాదని గ్రంథములు నేర్పునదేమి ? బహు గ్రంథములు పఠించి సకల శాస్త్రముల నభ్యసించిన మహావిద్వాంసులకు సైతము మీకుఁ దెలిసినదానిలో శతాంశము తెలియదనుట యతిశయోక్తి కానేరదు.

పుండరీకుఁడు : చాలుచాలు నీ పొగడ్తలు. మనకెదో తెలిసిన దనుకొని విద్వాంసులను చులకనచేయుట యవివేక మనిపించు కొనును. పోనిమ్ము. ఇప్పుడర్ధరాత్రము గావచ్చుచున్నది. కృష్ణవేణీమ తల్లి నిద్రించుచున్నట్లున్నది. తరంగముల సంచలనము లేదు. గాలిలో చల్లదనము హెచ్చినది. ఈ వెన్నెలలు స్వచ్ఛమైన నీ హృదయమువలె అత్యంత నైర్మల్యమును వెలిగ్రక్కుచున్నవి. పాటలీ ! మన మీ శేషరాత్రి నిచ్చటనే వేగింతమా ?

పాటలి : అంతకు మించిన మహాభాగ్య మేమున్నది ? మరల నిట్టి యవకాశ మెన్నటికి కలుగునో !

వా రిరువురు నిసుకప్రోవులు తలగడలుగ నుత్తరీయము

పరచుకొని పండుకొనిరి.

పుండరీకుఁడు : మనకీ రాత్రి పెండ్లిరాత్రి. మన జీవితముల నీ రేయి మధురస్మృతియై నిలిచిపోవును.

పుండరీకుఁడు పాటలి చేతిని తన చేతిలోనికిఁ దీసికొని తన రవలు పొదిగిన యంగుళీయకము నామె మధ్యవ్రేలునం దుంచి యిట్లనెను-"పాటలీ! ఈ యంగుళీయకము నాకు మహారాజమాత గౌతమీబాలశ్రీదేవి శకులతోడి సమరసమయమందలి నా యద్భుత చర్యల కానందించి బహుమతిగా నిచ్చినది. ఇది నాకు ప్రాణసమ మైనది. దానిని నిప్పు డంతకధికప్రియమైన నా యీ ప్రియపత్ని కిచ్చుచున్నాను. రేపటినుండి యది నా విరహము నపనయించు సాధనము కాగలదు.

పుండరీకుఁ డామెవ్రేలిని ముద్దాడెను.

పాటలి యా యుంగరమును కన్నుల కద్దుకొని—స్వామీ! నేను దీనిని మహాప్రసాదముగ గ్రహించుచున్నాను. ఈ యంగుళీయక మన్నివిధముల మీ హృదయమును వెలార్చుచున్నది. ఈ వజ్రము వలె మీ హృదయము స్వచ్ఛము తీక్ష్ణము. చివరకు ప్రాణహారిణి కూడ కాగల సామర్థ్యము కలది.

పుండరీకుఁడు : పాటలీ! నీ వన్నిఁటికి విపరీతార్థములు సృష్టింతువు. ఈ శుభసమయమున ప్రాణాపహరణ చర్చ యేమిటి?

పాటలి : నిజముగ నట్లు జరిగిన నంతకంటె పుణ్యస్త్రీకి కావలయున దీలోకమున నేముండును?

పుండరీకుఁడు : అట్లెన్నడును మాటాడకుము. నేను ని న్నిచ్చటి కెందులకు తీసికొని వచ్చితినో తెలియునా?

పాటలి : ఎందులకో?

పుండరీకుఁడు : మహారాజు నిన్నీవేళనే వికుంఠపురమున దింపుమనినారు. కాని యీ రేయి నిట్లు మధురముగ హృదయముల విప్పుకొని యొక్కసారి తనివిదీర మాట్లాడుకొనవచ్చునని, మనసు నిండునట్లు నీ సమ్మోహనకరమైన సౌందర్య లావణ్యముల ననుభ వించి హృదయమున భద్రపరచుకొనవచ్చునని! కోటలో నీతో నిట్లు గడపుటకు వీలుండదు. మీ యింటియొద్ద కుదురనే కుదురదు. మన జీవితముల నిట్టి యవకాశము లెన్నిమారులు లభించునో తెలియదు. అందువలన సాహసించి యీ రోజు ప్రయాణ మాపి వేసితిని.

పాటలి : అందులకు సర్వథా కృతజ్ఞురాలను. నా హృదయ

మున నీ రాత్రి మధుమయమై నిత్యనూత్నమై నిలచిపోగలదు. ఈ యూహ మీకుఁ గలిగించిన పరమేశ్వరునికి నా శతసహస్ర నమోవాకములు.

పాటలి చేతులు జోడించి ఫాలమున నంజలి ఘటించి నమస్కరించినది. ఆమె తన మౌక్తికాంగుళీయకము నాతని చిటికెనవ్రేలఁ దొడిగి—"స్వామీ! ఈ చిరవిరహిణీ స్మృతిచిహ్నముగ దీనిని మీయొద్ద నుండనిండు" అని యాతని చేతులను తన మొగమున నద్దుకొనెను. పుండరీకుఁడామె స్పర్శచే పులకిత సర్వశరీరుఁడైనాడు.

పుండరీకుఁడు: ప్రియే! నే నొక విషయముఁ జెప్పెదను. మనము లోకమునందలి సామాన్యులయిన నూత్నదంపతుల వంటివారము కాము. మన ముందర కర్తవ్యము మహామేరు సమానమై నిలిచియున్నది. మహారాజు మనపై ప్రత్యేకముగ విశ్వాస ముంచి మనల మన్నించుచున్నారు. ఆ విశ్వాసమునకు మనము కృతజ్ఞులమై ప్రతిఫలమును సమర్పింపవలయును. మనము మనస్సంసారులము. మన భావనామయ దాంపత్య మవిచ్ఛిన్నముగ సాగును. యుద్ధావసానము వరకు మన మప్రమత్తులమై సర్వకామనల విసర్జించవలెను. నా యూహ సరియగుచో రెండు మూఁడు నెలలలో రాజధానినుండి నీకు పిలుపు రావచ్చును. నీ వెచ్చటికో రాజకార్యములపై పంపబడవచ్చును. నీ యునికి బహురాజపురుష సంకులమైనచోట కావచ్చును. అచ్చట నిన్నీయోగము రక్షించును.

పాటలి: మీ యాజ్ఞకు సర్వదా బద్ధురాలను. ఈ రాత్రియే మన వ్రతనిష్ఠకు తొలిరాత్రి యగుగాక!

పుండరీకుఁడు పాటలి చిత్తస్థైర్యమునకు నివ్వెరపోయెను, ఆమెను ప్రేమనిర్భరములైన చూపులతో తిలకించుచు—"పాటలీ! నీవు నిజముగ దేవతవుగాని మానవవనితవు గావు. కర్తవ్యకఠినమైన నీ యాత్మసంయమమునకు నా కాశ్చర్యము కలుగుచున్నది. నీవంటి వారున్న దేశమున కపజయమను మాట యుండదు. నీపేరితిహాసములో సువర్ణాక్షర నిబద్ధము కాఁగలదు" అనెను.

పాటలి: స్వామీ! మీ సంకల్పము ఆశీర్బలము నాయందు నిలిచి నన్ను ధర్మమార్గమున సంచరింపఁజేయును. ధర్మేతరమైన దానిని నే నెన్నఁడు బుద్ధి పొరబడిగూడ చేయను.

పుండరీకుఁడు: సామాన్యధర్మమునకును రాజనీతికిని చాల

భేదమున్నది. పాటలీ! ఆ సంగతిని గమనించుచు మసలుకొన వలయును.

పాటలి: అదేమో నా కర్థమగుటలేదు.

పుండరీకుఁడు: ఒక్క సంగతి చూడుము. హత్య యొనర్చుట మహాపాపముగద! శత్రుసైనికు డొకఁడు మన దేశమునకో మన మహారాజునకో కీడు తలపెట్టిన ట్లనుమానము వేసిన దనుకొనుము. వాఁడు మనచేతఁ జిక్కె ననుకొనుము. వెనుక ముందులు చూడక వానిని సత్వరము వధింపవలయును. వాఁడును తన మహారాజును రక్షించుటకై అట్లుచేసె ననుకొనరాదు. రాజనీతిలో ధర్మమున కరమే వేరు. నీతిఖడ్గమును చేబూని సదా సంచరించుచుండ వలయును. ఇందలి పాపపుణ్యములు పాలకునికిఁ జెందును. మన మాయన యాజ్ఞాబద్ధులము మాత్రమే. మనల నీ పాపపుణ్యము లంటవు. యజమాని యాజ్ఞాపాలనమే యిచ్చుట మనకు ప్రధాన ధర్మము.

పాటలి: మీ కార్యక్రమము లప్పుడప్పుడు వీలువెంట నా కెరుకపరచెద రనుకొందును.

పుండరీకుఁడు: అవశ్య మట్లే చేసెదను. నా కంతకుమించి యానంద మేముండును? మా వేగులవాండ్రు నిన్ననిశము వేయి కన్నులఁ గనిపెట్టుకొనియే యుందురు. నీపై నీగనుసైతము వ్రాల నీయరు.

పాటలి: నా మీఁద వ్రాలుటకు ముందా యీఁగ రెండు తుండెములు గావలె!

పుండరీకుఁడు: సంతోషము. నీకంత శ్రమ యనవసరము.

వారిరువురు హేలలు చమత్కారములు నవ్వులుగ రేయెల్ల గడిపిరి. నాలవజాము వేకువ మరల నూరిలోనికి బయలుదేరిరి. పాటలి ముగ్ధదీపుడైనది. రాత్రి వచ్చునప్పటి వారికిని యిప్పు డింటికి తిరిగిపోవు వారికిని భేద మెంతేని యున్నది. వచ్చునప్పటి పాటలి నునుసిగ్గుదొంతరలలో దోబూచులాడుచు కనులెత్తి చూచుటకేని ధైర్యము చాలని ముగ్ధప్రణయినీమూర్తి. తిరిగిపోవు నామె దీర్ఘ చర్చానంతరము స్థిరసంకల్పయై స్థిరదృష్టియై తన జీవితధ్యేయ మును గుర్తెరింగి తదనుగుణముగ వర్తించుటకు దృఢసంకల్ప యయిన ప్రౌఢస్త్రీ.

పుండరీకుఁడు నట్లే యున్నాఁడు. వచ్చునప్పటికి పాటలి యుననేమో, ఆమె మనోభావము లెట్టివో యేమియుఁ దెలియని

స్థితిలోనుండిన వట్టి యంథ ప్రేమికుండు. తిరిగిపోవునప్పు డామె హృదయాంతరాళమునందలి భావనాపరంపరలను, ఆమె జీవిత ధ్యేయమును సాకల్యముగ నెరుగుటచే పరమప్రీతి స్నిగ్ధుండై గృహపతివోలె మందగమనుండై వెడలుచున్న స్థిర మనస్కుండు. వారిరువురు యుగయుగములుగ యుగపత్సంభూతులా యనునట్లున్నారు. వచ్చునప్పు డెంత మౌనముగ నుండిరో వెళ్ళునప్పు డంత సంభాషణాచతురులైనారు. ఒక లిప్త జారిపోయిన మరల నదిరా దనునంత యనుక్షణ వ్యగ్రులై యొకరినొకరు వదలలేని మధుర వేదనతో నుక్కిరిబిక్కిరి యగుచున్నారు.

పుండరీకుండు : ఎట్లును వచ్చితిమి. నీవు మన గృహమును కొకమారు రాగూడదా ?

పాటలి : స్వామీ ! పాటలి గృహిణియైననాండే తమయింట నడుగుపెట్టును. అంతవరకింతే.

పుండరీకుండు : అదియు బాగుగనే యున్నది. నీ యిచ్చ వచ్చినట్లే గానిమ్ము.

పాటలి : కోపము వచ్చినదా ?

పుండరీకుండు నవ్వి—"పిచ్చిపిల్లా ! కోపమా ? ఎవరిమీంద? నాపై నేను కోపగింతునా ? నీకును నాకును భేద మేమున్నది" ?

పాటలి : ఈ విశాల సాతవాహన సామ్రాజ్య మంతయు మనకు గృహాంగణమే యగును.

పుండరీకుండు : అవును పాటలీ ! నీ యూహ చాల సమంజసముగ నున్నది. ఈ సామ్రాజ్యము నందలి ప్రత్యంగుళము మేరయు మన నివాస భూమియే. మన కర్తవ్యము తీరిన వెనుక మనమొక చిన్న గృహమును నిర్మించుకొందము.

పాటలి : మహారాజు మనస్సునందు మన ముండునంతవరకు మనము రాజప్రాసాదమున నున్నట్లే.

పుండరీకుండు : బాగుగం జెప్పినావు. మనకు కావలసిన వన్నియు ప్రభువులే చూచెదరు. మనము మాత్రము ప్రభుకార్య వ్యగ్రులము కావలె.

పాటలి : మనకదియేకదా ధ్యేయము.

పుండరీకుండు : నేను నీకు కొన్ని గ్రంథముల నిచ్చెదను. వానిని నీవు సాకల్యముగ పఠించి జీర్ణించుకొనవలెను. నీ భవిష్యద్రాజసేవా విధానములో నక్కఱకు వచ్చునవవి.

పాటలి : తప్పక యట్లేపఠింతును. గూఢచారిణీవృత్తాంతములు

కూడ నున్న గ్రంథములున్నచో తెండు.

పుండరీకుఁడు : నీవు గూఢచారిణివై సంచరించెదవా ?

పాటలి : గూఢచార వృత్తిలో మీ కనుగ్రతను గావచ్చునుగద.

పుండరీకుఁడు : సాహసముఁ జేయకుము.

పాటలి : మంచివారు ! రాజమాత గౌతమీదేవి గూఢచారిణిగ నన్నెచ్చఁటికి బంపునో నేను పోకుండుటెట్లు ?

పుండరీకుని కానాడు మహారాజు తనతో ననిన మాటలు జ్ఞప్తికి వచ్చెను. నిపుణలయిన స్త్రీలను గూఢచారిణులనుగ బంపి శత్రుదేశ రాజకీయ రహస్యముల సేకరించుటయు గలదు. మహారాజమాత పాటలి నట్లు పంప నుద్దేశించెనేమో ! అది యెంత కష్టసాధ్యమైన వృత్తి ! ప్రాణములపై కత్తివాదర వంటిది. పాటలి యంతటి బాధ్యతాయుతమైన వృత్తిని దాని ముక్కుమొగ మెఱుఁగకయే నిర్వహించగలదా ? చివరకు తన పాటలి తనకు దక్కునా ! భగవతి యనుగ్రహ మెట్లున్నదో !

పుండరీకుఁడు స్వస్థుఁడై యిట్లనెను—"నిజముగ నా దేవి య ట్లాదేశించినచో నది యవశ్యము మనకు శిరోధార్యమయినది. నేను నీ కింకను అనేక రహస్య విషయములను తెలిసికొనుటకుఁ దగిన గ్రంథముల నిచ్చెదను. వాని నన్నిఁటిని జాగ్రతగ పరిశీలింపుము. అవి యన్నియు నాకళింపునకు వచ్చినచో నెట్టి విషమ పరిస్థితుల యందును నీకు వచ్చు ఆపద లుండవు. నీ ప్రాణములకు నా ప్రాణముల నెదురొడ్డెదను.

పాటలి : అదేమిమాట స్వామీ ! పాటలి ప్రాణము కంఠ గతమై యుండునంతవరకు నామె యాత్మరక్షణ మొనర్చుకొనగల సమర్థురాలు. అవసర మేర్పడుచో యుద్ధ మొనర్చుటకు సైతము వెనుదీయదు. పది పదునేనుమందికి తానొక్కతియే సమాధాన మీగలదు.

పుండరీకుఁడు : నా కది వేరుగ చెప్పవలెనా ? నేను ప్రత్యక్ష ముగ దర్శించితిని గద ! నీపట్ల నా కా ధైర్యమున్నది. కాని పాడు మనస్సు, తన ప్రాణపదమైనదానిపట్ల కీడును శంకించును. అంత మాత్రమేగాని వేరుగాదు. నేను నిన్నుగూర్చి కథలు విన్నానులెమ్ము. మీ యూరి యెల్లరి కోడెగాండ్ర పాట్లు నాకు తెలిసినవి లెమ్ము.

పాటలి సిగ్గుపడెను. ఆమె కపోలముల కాశ్మీరములు పూచెను. ఆమె నేత్రముల నిరమ్మదములు నృత్యముచేసెను. ఆమె దేహమున కడిమిమొగ్గ దొడిగెను. అది చూచి పుండరీకుని చక్షువులు ప్రీతి

స్నిగ్ధములయ్యెను.

పుండరీకుఁడు : నాట్యరాజ్ఞీ! యుద్ధవిశారదా ! నీ ద్వివిధ రూపచిత్రములు నా హృదయ ఫలకమునందు ముద్రితములైనవి.

పాటలి : నా నాట్యము నా యుద్ధవిద్య నా సర్వస్వము మీ పాదదేశమున నైవేద్యము లయినవి.

వారిరువురు నాటి సందెవేళకు వికుంఠపురమునుఁ జేరుకొనిరి.

.... .... .... ....

ధనంజయుని గృహమంతయు సందడిగ నుండెను. మిహిర, వాసిష్ఠీదేవి పాటలి కిచ్చిన రత్నహారమును జూచి మురిసిపోయినది. రోహయు బప్పికయు నామె చీనిచీనాంబరముల కాశ్చర్యపడిరి. ఇవి పాటలికి లభించిన కానుకలు. ముగ్ధదీపునకు వచ్చిన కానుకలు వేరొక రకమైనవి. అశ్వము ! అది రూపము సంతరించుకొన్న హిమగిరి శకలము వంటిది. చవితిచంద్రునివోని చంద్రహాసము మణిఖచితము. వానిని జూచి మందారకుఁడు రోహితుఁడు లలితుఁడు సంతసించిరి. ధనంజయుఁడు కుమార్తెయొక్క మహారాజుల ప్రాపకమునకు మనస్సులో నానందించెను. పుండరీకుని జూచి పాటలి యెన్నిక యోగ్యమైనదని భావించెను. మధుర పాటలి మనస్సు నెఱిఁగిన స్త్రీ. ఆమె కోర్కెలు ఫలించుకాల మాసన్నమైన దని మిగుల సంతసించెను. మందారకుఁడు తన కూతురును శిష్యురాలునైన పాటలి రాజధానిలో పేరుకెక్కినదని మురిసిపోవు చుండెను.

వికుంఠపురమున నెచ్చట వినినను పాటలినిగూర్చిన చర్చయే. మహారాజ్ఞి యామెకు రత్నహారమును బహూకరించెనట ! ఆ పిల్ల వాస్తవముగ నదృష్టవంతురాలు. ధాన్యకటకమున నీయేడు వసంతోత్సవములలో విజయధ్వజ మెత్తి పాటలి మన వికుంఠపురము నాకాశమున కెత్తివైచినది ! అట్టి యువతి కుటుంబమున కొక్కతె యున్న నెంత బాగుండును ! ఆమెవెంట నొక మహాయోధుడు వచ్చెను. అతఁడు సాక్షాత్తు మహారాజునట్లున్నాఁడు. పాటలి యాతనిఁ బెండ్లియాడునఁట ! అది జరిగినచో ననురూపమైన సంబంధము ! అతఁడు గూఢచారి దళాధిపతియఁట. అతని యునికి యాతనికే తెలియదు. అతని పెండ్లియాడి పాటలి పాప మేమి సుఖపడును ! పాటలినిగూడ మహారాజు కొల్వులో చేర్చుకొనునఁట.

ఇట్టివే మాటలజస్రము వికుంఠపురమున మార్మోగి పోవు చుండెను. నిత్యము ధనంజయుని యింటికి పలువురు స్త్రీలు వచ్చి

యా రత్నహారముఁ జూతురు. ఆ వస్త్రము లాయశ్వము నా చంద్ర హాసములను జూచి ప్రశంసింతురు.

రోజు లిట్లు గడచుచున్నవి.

# 5

కుడ్యలిఖితాని దూషితమనసో నను దేవరస్య కులయోషిత్
దివసం కథయతి రామలగ్నసౌమిత్రిచరితాని.

కలుషితమనస్కుఁడగు మఱఁదికి కులవధువు ప్రతిదినము నింటి గోడమీఁద చిత్రింపబడిన రామానురక్తుఁడగు సౌమిత్రి పుణ్య చరిత్రమును చెప్పుచున్నది.

పాటలి రాజధానినుండి వచ్చి నెలదినములైనది. పాటలి నింట దించివెళ్ళిననాడే పుండరీకుఁడు మహారాష్ట్రములకుఁ బోయెను. రాజధానినుండి వచ్చినతరువాత పాటలి దినచర్యయే మారిపోయినది. ఉభయసంధ్యల కృష్ణుయొద్దున గడుపును. చీకఁటి వేళల వ్యాయామము గుఱ్ఱపుస్వారి తన పినతండ్రి అన్నగార్లతో కలిసిచేయును. ఖడ్గయుద్ధ సాధన తప్పనిసరిగ చేయును. మధ్యాహ్న సమయముల, రాత్రులందు ప్రొద్దుపోవువరకు పుండరీకుఁడొసగిన గ్రంథముల పఠించును. ఉదయమున దేవీపూజ చేయును. ఎవరితోడ నెక్కుడు మాటాడదు. మాటాడిన మధురతో రోహితునితో కొంతతడవు మాటాడును.

ఆమెలో గాంభీర్యము వచ్చినది. ఇంటిలో నందఱ కామె యెదో మంత్రరుద్ధయైనట్లుండెను. ఆమె పనులన్నియు నియమిత వేళలందు నియమానుసారముగ చేయుచుండెను. ఆమె క్రొత్తగ మహాభారతము చదువ నారంభించినది. ఈ కార్యక్రమములో తీరిక యనునది లేకుండెను. ఇది యిట్లుండగా నీ వప్పస్వామియొకఁడు, తఱచుగ వికుంఠపురమునకు వచ్చుచున్నాఁడు. ఆ వచ్చినవాఁడు సర్వదా పాటలితో సంభాషింప వాంఛించును. ఆమెతో వాగ్వాదములు సేయును. అతఁడు వచ్చినప్పుడెల్ల నామె నిత్య నియమములకు కొంత విఘాతము కలుగుచున్నదనియే చెప్పవలెను. పుండరీకుఁడు మహారాష్ట్రమునకు పోయిన తరువాత వప్పస్వామి రాకపోక లెక్కువ యగుచు వచ్చెను. అతని ప్రవర్తనలో నెదో వెగటుతనము కనిపించుచున్నది. అతని సంభాషణలు ద్వంద్వార్థ భూయిష్టములై పాటలి కోర్చుకొనుటకుఁ గూడ కష్టముగ నుండెను. ఆమెకు వప్పస్వామి మఱఁదిస్థానీయుఁడు. అంతకుమించి పరిచయాధిక్య

మీవఱకేయున్నది. ఈ రెండు హేతువుల చేతను పాటలి యాతని బరిహరించలేక పోవుచున్నది.

వప్పస్వామి పుండరీకునిఁ దక్కువచేసి మాట్లాడును. అతని వృత్తిని విమర్శించును. అతఁడపండితుఁడనును. పాటలి కివి యన్నియు కర్ణకఠోరములుగనుండును. కాని సహించుచువచ్చినది. ఒక్కొక్క సమయమున నాతని విమర్శ మరియు దుర్భరముగ నుండును. అట్టివేళల పాటలి యతనిని తీవ్రముగ విమర్శించుటయు గలదు. కాని వప్పస్వామి యవియేమియుఁ బట్టించుకొనఁడు. తనధోరణి తనదిగ ప్రవర్తించును.

నాడు వప్పస్వామి వచ్చెను. పాటలి తనగదిలో గ్రంథపఠన మొనర్చుచుండెను. వప్పస్వామి సూటిగ నామెగదిలోనికేగెను.

పాటలి యాతనిఁ గూర్చుండ నియమించి యిట్లనెను— "ఏమోయీ! మీ యమ్మగారు కుశలమా? అన్నగారి వార్తలేమైనఁ దెలిసినవా? రాజధాని యందలి విశేషము లేమైన నున్నచో చెప్పుము".

వప్పస్వామి: నీకు మా యన్నవార్తలు రాజధాని విశేషములు కావలెఁగాని నా విషయ మాలోచించవుగద!

పాటలి: నీవు సమక్షమున నుండగా నీగుఱించిన యారాట మెందులకు?

వప్పస్వామి: పాటలీ! నీవెప్పుడు నింతియే. నన్నులక్ష్యము చేసి మాటాడెదవు. ప్రత్యక్షముననున్నదానిని వదలుకొని యప్రత్యక్షమైనదానికై ప్రాకులాడుటలోగల విశేషమేమియో నాకర్థమగుట లేదు.

పాటలి: బుద్ధిమంతులైనవారల ప్రత్యక్షమైనను నది తమ జీవితలక్ష్యమైనచో దానికొఱ కెంతేని శ్రమించి దానినే సాధింతురు. అంతియేగాని యెదుటనున్నదే నాదన్నట్లు ప్రవర్తింపరు. అది కులవధూలక్షణముకాదు.

వప్పస్వామి: అబ్బో! నీవొక కులవధువువైనట్లు మాటాడెదవు మి?

పాటలి: వప్పస్వామీ! నోటికి వచ్చినదెల్ల మాటాడకుము. క గొప్ప కవివటనే! ధ్వనులు వ్యంగ్యములు తెలిసినవాఁడవు. ితుఁడవుకూడనఁట. మాటాడుపద్ధతి యిదియేనా? ఎవరితో ్రసంగించ వలయునో తెలియనివాఁడవు నీవేమి కవిత్వము యుదువు?

వప్పస్వామి : నేనేమి యసంబద్ధముగ మాటాడితినని నీ వట్లందువు ? నీవు కులవధువ వెప్పుడైనావు ? నీకింకను పెండ్లి కాలేదుగనుక నట్లనినాను.

పాటలి : నాకు పెండ్లియైనదో కాలేదో నీకుఁదెలియదా ? మీ యన్నగారు నీతో చెప్పలేదా ? అయినచో వినుము. పాటలి పుండరీకుని భార్య. ఆ వరుసలో నీకు వదినను. తెలిసినదా ? ఇఁకనుండి యా వరుసను పాటించుచు మాటాడుము.

వప్పస్వామి మాటాడలేదు. ఊరక చూచుచుండెను. పాటలి గదిలో కుడ్యములనిండ రామాయణ మహాభారతగాథల వర్ణచిత్రము లున్నవి. వప్పస్వామి వానిని దిలకించుచుండెను. పాటలి యదిగమనించి—"ఓయీ ! ఇటుచూడుము. ఈ లక్ష్మణస్వామి తన యన్నగారి నెట్లనుసరించుచున్నాఁడో ! భార్యావిరహియైన యగ్రజునికెట్టు సపర్యలొనర్చుచున్నాడో ! అతని సౌశీల్యమును భావింపుము. ఆ వదినగారి నూపురాలంకృతములైన పాదపద్మముల యందెట్లు ప్రణమిల్లుచున్నాఁడో ! ఆమె వదన మెట్లుండునో కూడ నా సుచరిత్రునకుఁ దెలియదఁట ! ఆమె తన మఱఁదిని కన్నబిడ్డ వలె నాదరించును. అది భారతీయుల ప్రధాన నాగరక లక్షణము. మానవుల పరస్పర సంబంధముల, దూరముల ఘనిష్ఠతలఁ బురస్కరించుకొని యెవరికే ప్రమాణమున మర్యాద నీయవలయునో, గౌరవించవలయునో, ప్రేమించవలయునో, వాత్సల్యమును నెఱపవలెనో యంతియే చేయుటనునది, భారతీయ జాతులలో నున్నంతక్రమమున తదితర జాతులలో లేనేలేదు. మ్లేచ్ఛజాతులీ వావివరసల నంత సునిశితముగఁ బాటించరు. మనజాతి పరమనాగరకమైన జాతి. సర్వప్రపంచమున నెచ్చటను నార్యసంస్కృతిని మించిన సంస్కృతి కానరాదు. మహర్షులైన వ్యాస వాల్మీకులు మన సంస్కృతిని తీర్చిదిద్దినారు. ఏదీ యితరదేశము లందెందైన నింతటి మహోత్కృష్టములయిన లక్షణములు దీపించు జాతు లున్నవా ? మ్లేచ్ఛబుద్ధివి కాకుము. ఇంకేమి చెప్పగలను ? నీ పేరిలో నా లక్ష్మణస్వామి నామము నందలి చివరియక్షరము లున్నవి. అట్టి నామసామ్య మర్యాదనైన నిలబెట్టుము.

వప్పస్వామి : చాల యుపన్యాస మిచ్చితివి. నీకు పెండ్లి యెప్పుడైనదందువు ? మా కెవరికిని మీ తలిదండ్రులకుఁ గూడ తెలియకుండగనే నీ పెండ్లిజరిగినదా! ఇది విశ్వసనీయమైన విషయమందువా ?

చుండెను !

చీఁకటి పడినది. పాటలి యూహాలోకముల పుండరీకునితోఁ కౌముదీజాగరణము సేయుచున్నది. ఉదకక్ష్వేటిక నెఱపినది. అలోలచతుర్థుల గడపినది. ఇక్షుభంజికల రచించుకొనినది. కదంబయుద్ధము చేసినది. ఒకటని యేమి ! పల్లెపట్టులందు గ్రామ్య యువతీ యువకులు నెఱపెడి పండుగలు నుత్సవము లన్నియుఁ దన భావనలో పుండరీకునితో కలిసి యనుభవించినది. ఆమె మానసికానందమున కవధి లేకుండెను. ఆమె గదిలో దీపము లేదు. దీప ముంచుటకై మధుర వచ్చినది. గదిలో దీప ముంచినది.

పాటలి యంతదనుక కన్నులు మూసికొనియే యున్నది. ఆమె మొగమున నెదో యానందరేఖ కొట్టవచ్చుచున్నట్లున్నది. మధుర కామెను జూడగనే యాశ్చర్యము జాలి కలిగినవి. పాటలి ప్రేమగాథ యంతయు సాకల్యముగ నెఱిఁగిన దొక్క మధురయే. ఆమెకు తన స్నేహితురాలు నాడుబిడ్డయునైన పాటలి మనస్సునందలి బాధ తెలియును. పాటలీ పుండరీకుల వృత్తాంత మంతయుఁ దెలియును. తాను లలితుఁడు ప్రతిక్షణ మధురముగ దాంపత్య జీవితమును సాగించుచుండగా తన నెచ్చెలి తన వయస్సుదే చిర విరహిణియై యోగినివలె జీవితము వెళ్లదీయుటను తాను సహించుకొన లేకుండెను. కాని తానేమి చేయఁగలదు ? పాటలి నెల్లప్పుడుత్సాహముగ నుండునట్లు చేయుటకు సర్వధా తన శక్తివంచన లేకుండ ప్రయత్నించును. పాటలి నొక్కపని చేయనీయదు.

లలితుఁడుగూడ తన చెల్లెలి స్థితికి చింతించును. మిహిరా ధనంజయులు పాటలి నిశ్చయమునకు మొదట కష్టపడిరి. కాని తరువాత సర్దుకొనిరి. మందారకుఁడు మాత్ర మందరికంటె నెక్కుడుగ దిగులు పడుచున్నాఁడు. పాటలి తన చేతులలో పెరిగిన బిడ్డ. తనయొద్ద నాయుధవిద్యల నన్నిఁటి నభ్యసించిన ప్రియ శిష్యురాలు. అతి తీవ్రప్రకృతిగల పిల్ల. ఆమె యీ జీవిత మాతని హృదయమును కలచివైచినది. పాటలి నతిశయముగఁ బ్రేమించిన యాతని గుండె యామె మనోవేదనను తట్టుకొనలేక పోవుచున్నది. తనకు ప్రాణాధిక ప్రియమైన శ్రీపాలి వ్యాధిగ్రస్తురాలైన నాటినుండి తాను పడుచున్న మానసిక వేదన కవధి లేకుండెను.

పుండరీకుఁ డెంతటి యందగాడో కన్యకాజనముల కెంత లోభనీయుఁడో మందారకునికి తెలియును. అతఁడుగూడ పాటలి వలెనే తీవ్రస్వభావము గలవాడు. భగవంతుఁడు చిత్రముగ వారికి

సమాగమ మేర్పరచినాఁడు. అంత యొకఁడైన మనస్సుగల వారి వియోగబాధ యూహకందని పరిమాణమై హృదయవిదారకముగ నున్నది. ప్రేమాధిక్యముయొక్క యనుభవము తనకుఁ దెలిసి నంతగ నింకెరికిఁ దెలియదు. తన బిడ్డమనస్సులో నెంత గుడుసుళ్లు పడుచున్నదో! భగవంతుఁడు పాటలినిగూడ సామాన్య గ్రామీణ బాలికగ సృష్టించి యుండినచో నిట్టి బాధలుండెడివి కావుగద! అదేమో యామె యసామాన్య యువతియై యువకుఁడై రాజధాని యందంతటను తన కీర్తిని పండించుకొన్నది. మహారాజుచే మన్ననల నందినది. అట్టి యీమెకీ మనోవ్యథ యేమి? పాటలీపుండరీకులు తిరిగి యెప్పటికి కలసికొందురో! యుద్ధము ముంచుకొని వచ్చు చున్నది. పర్యవసాన మెట్లుండునో! అంతయు నగమ్యముగ నున్నది.

శాలికుని కివి యేవియుఁ బట్టవు. కాని పాటలిని చూచి యుస్సురనును. అతనిది తావన్మాత్రమైన భావనయే. రోహ కివి యేమియుఁ బట్టనేపట్టవు. ఆమె పాటలి యదృష్టవతి యనుకొనును. మహారాజ్ఞి యొసగిన రత్నహారమును తాను ధరించి మురిసిపోవు చుండును. చీనిచీనాంబరముల ధరించును. అంతే. రోహితుఁడు పూర్వమువలె అక్కయొద్దకు పోఁజాలకున్నాఁడు. ఆమె యెప్పుడెదో గ్రంథమును చదువుచుండును. లేకున్న కన్నులు మూసికొని కూర్చుండును. అతని కామె సమీపింపరానిదిగ నున్నది. అతని కక్క యట్లెందుకు మారెనో తెలియలేదు.

ఇందరిన్ని విధములుగ తన్నుగుణించి భావించుచున్నారని పాటలికి తెలియదు. ఆమెకు పుండరీకుఁడు, రాజ్యవ్యవహారము, రెండే లక్ష్యస్థానములు. మధురగదిలో ప్రవేశించునప్పటికి పాటలి కండ్లు మూసికొనియే యుండెను. ఆమె పాటలిని కదిపి—"పాటలీ! ఏమమ్మా! అటులనే కూర్చుండిపోయితివి! దీపము లేదు. చీఁకటిలో నిట్లు కూర్చుండరాదు. పైకి పోవుదము రమ్మా" అనెను.

పాటలి దీపనమస్కారముచేసి పుండరీకుఁ డొసగిన యంగుళీయ కమును కన్నుల కద్దుకొని "పద పోవుద" మనెను. పాటలి యట్టి చర్యను చూడగనే మధుర మనస్సున పూర్వము కత్తికి బాసికము కట్టి దానినే పతికి ప్రతీకముగ వివాహ మాడెడి రాచకన్నియలు దర్శన మొసఁగిరి. "భావము మానవుల నెంతచేయును!" అనుకొనెను.

వా రిరువురు మేడపైకి పోయిరి. ఆకసమున అర్ధచంద్రుని

బింబము సగమైన వెన్నెలలఁ బ్రకాశించుచున్నది.

పాటలి : వదినా ! ఈ చంద్రుఁడు తన ప్రకాశమును సమ విభాగ మొనర్చి నా స్వామికడ ప్రకాశించుచున్నాడు.

మధుర : అవునమ్మా ! చందమామ చల్లనివాఁడుగద !

పాటలి : వదినా !

మధుర : ఏమి పాటలీ !

పాటలి : నా స్వామిని నేను మరల కలసికొనఁ జాలుదునా ?

మధుర : తప్పక కలసికొందువమ్మా ! అతడెవో రాజకార్యము లందు వ్యగ్రుఁడై యుండును. లేనిచో నీకు కనీసము కబురైన పంపియుండెడివాఁడు, ఆతని కూపిరాడని పనులుండియుండును. కానియెడల నీ ప్రేమతపస్విని యిచ్చట నున్నదని యాయనకుఁ దెలియదా ?

పాటలి : ఏమో వదినా ! నా స్వామి వార్తలు తెలిసి మూఁడు నెలలైనది. నాకు భయమగుచున్నదమ్మా !

మధుర : ఛీ ! ఏమిమాటాడుచున్నావు ! అతఁ డేకవీరుఁడు. ఆతనికి భద్రత లేదన్నచో సాతవాహన సామ్రాజ్యమునకే భద్రత లే దనవలయును. ప్రేమాధిక్య మున్నచోట నన్నియు శంకాస్థాన ములుగనే యుండును. పుండరీకుఁడు సామాన్యుఁడు కాఁడు. నీకు తెలియనిదా ! నీ తపస్సాతని రక్షించును.

పాటలి : దేశముకాని దేశములందాయన తినినచోటఁ దినక పండినచోట పండుకొనక యెంత నలిగిపోవుచున్నారో ! నన్నుగూడ వెంటనిడికొనిపోయిన నెంతసేవచేసెడిదానను.

మధుర నవ్వి—"అతని యుద్యోగలక్షణ మట్టిదికదమ్మా !"

పాటలి : అవునముకొనుము. నేనిచ్చట భోగము లనుభవించు చుండ నాయన యెంతటి కష్టములనుభవించుచుండెనో !

మధుర : నీవు మాత్ర మిచ్చట సౌఖ్యము ననుభవించు చున్నావా ! నీ వెట్లున్నావో నీకుఁ దెలియదు. చిక్కి సగమైనావు. నీ కన్ను లొక్కడే నిన్ను పట్టి యిచ్చుచున్నవి. దివారాత్రము లేకాంతముగ నీ గదిలో కూర్చుండి యుందువు. దేహ పరిశ్రమ వలన నగు బాధకంటె మానసికమైన బాధ వేయిరెట్లధికము. నీ వట్టి బాధ ననుభవించుచున్నావు. మే మందఱ మేమియుఁ జేయఁజాలక జూచుచు నూరకొనుచున్నాము.

పాటలి : అదేమియుఁ గాదు. నేనేమి బాధ పడుచున్నాను ? ఆ మహారాజమాతనుండి కబురైన రాలేదు. వచ్చుచో నేను నా

స్వామిని కలసికొనవచ్చునని యాసయున్నది.

మధుర : ఆ కబురునకై తొందరెందులకమ్మా ! నీవుకూడ మా కన్నులయెదుట మసలకున్నచో అత్తగారెంత బాధపడుదురు ! మే మెల్లరము నిన్ను విడచి యుండగలమా ?

పాటలి : అటులైన రాజకార్యములు సాగునా ?

మధుర నవ్వి—"ఈ ధర్మము పుండరీకునియెడల వర్తించదా?" యనెను.

పాటలి : వదినా ! గడుసుదానవమ్మా ! నా మాటలు నాకే యొప్పగించినావు.

ఇరువురు కిలకిల నవ్వుకొనిరి.

మధుర : పాటలీ ! ఎన్నాళ్ళకు నీ మొగమున నవ్వును చూచితినమ్మా ! నీ నవ్వును చూడని మా మనస్సునం దుల్లాసమే నశించుననుకొనుము. మీ యన్నగారును పినతండ్రిగారు నెల్లప్పుడు నిన్నుగూర్చియే బాధఁ జెందుచున్నారు.

పాటలి : అయ్యో ! అటులనా ! నాకు తెలియదే !

మధుర : నీ కెట్లు తెలియునమ్మా ? నీ వెవరితోనైన మాటాడు చుండినగద ! నీ వెదో యోగమునఁ బడిపోవుచున్నావు ! ఇంటిలోని విషయ మేమియు నీకుఁ బట్టుటలేదు. పాపము మీ శ్రీపాలి పిన్ని గారి యారోగ్యము మరీక్షీణించినది. పినమామగారి మొగము చూడ లేకుండ నున్నాము. పసివాఁడు రోహితుని చూచిన గుండె బ్రద్దలగు చున్నది. ఇంక నామె యెక్కువ దినములు జీవించు ననిపించదు పాటలీ !

పాటలి తత్క్షణమే పిన్నిని చూచివచ్చెదనని మేడదిగి సూటిగ శ్రీపాలి గదిలోని కేగెను. శ్రీపాలి బల్లివలె మంచమున నతుకుకొని పోయి యుండెను. సువిశాలములై మెఱపుల వెలిగ్రక్కు నామె నేత్ర ద్వితయముచే నామెయామెయని తెలియుచుండెను. ఆమె నొరసికొని మిహిర కూర్చుండి యుండెను. పాటలిని జూచి మిహిర — "తల్లీ ! పిన్నియొద్ద కూర్చుండుము. నే నింటిలోని పని ముగించు కొని వత్తున"ని వెడలిపోయెను.

శ్రీపాలిని చూడగనే పాటలి కన్నుల నీరు తిరిగినది. ఆమె ప్రక్కలో కూర్చుండి పిన్నీ ! యని పిలిచెను. శ్రీపాలి పుల్లలవలె శుష్కించిన తన చేతులఁ గదలించి పాటలి తొడపై నునిచి యిట్లనెను—"తల్లీ ! నీవు గొప్పదాన వైనావు. రాజధానియందంతట నీ పేరు మార్మ్రోగిపోవుచున్నదఁట ! మహారాజమాత మహారాజ్ఞి

మహారాజు నిన్ను స్వయముగ గౌరవించిరఁట! ఇవన్నియు నిజమేనా? నా చిట్టితల్లి యెంతటి దైనది!"

పాటలి: ఇవన్నియు నీ కెవరు చెప్పిరి పిన్నీ! చిన్నాన్న చెప్పినాడా? ఆయన గోరంతలు కొండంతలు చేసి చెప్పును.

శ్రీపాలి: అటులెందుకు చెప్పును! నిజమే చెప్పెను. నీ మధురగాథనుగూడ చెప్పెనులెమ్మా.

పాటలి సిగ్గుపడి "యేమనెనేమి?" యని యడిగెను.

శ్రీపాలి: నీ వచ్చుముగ తన పోలికయఁట. సౌందర్యవంతుఁడఁటగదా! లేకున్న నా పాటలీ మానసచోరుఁ డెట్లగును?

ఇంతగ మాటాడుటఁజేసి శ్రీపాలి కాయాసము వచ్చెను. పాటలి యామెను చూచి చలించిపోయెను.

మందారకుఁడు వచ్చెను.

మందారకుఁడు: అమ్మా! పిన్నిని చూడ వచ్చితివా?

పాటలి: అవును చిననాన్నా! పిన్ని మరీ కృశించిపోయినది.

మందారకుఁడు నిస్తేజుఁడై నిలిచిపోయెను.

ఆతని కన్నులలో కాంతి లేదు. ఆతని మొగము రక్తహీనమై వ్యాధిగ్రస్తుని వదనమువలె నుండెను. పాటలిని చూడగనే యాతని లోని శ్రీపాలిపైగల ప్రేమ యంతయు నుబికివచ్చి నిలువరించుకొన లేని యాతని కనులవెంట నశ్రుధారలై ప్రవహించెను. ఉత్తరీయపు చెంగుతో కనుల నొత్తుకొనుచు మందారకుఁడు—"తల్లీ! పాటలీ! చూచితివిగదా! మీ పిన్ని దేవలోకమునందలి యచ్చర! నాకై దిగివచ్చినదమ్మా! కాపురమునకు వచ్చిన నాటనుండి నే నీమె నట్లే చూచికొనినాను. మా యన్యోన్యానురాగము జూచి యిరుగు పొరుగువారీర్ష్యజెందున ట్లుండెడివారము. శ్రీపాలి సుగుణముల రాశి. వదినకామె తలలోని నాల్కవలె నుండెడిది. రోహితుఁడు జన్మించినాఁడు. ఆమె నెదో వ్యాధి పట్టుకొన్నది. అయిదేం డ్లయినది. తిరుగు మొగము పట్టలేదు. నీ పినతండ్రి యదృష్ట మిట్లున్నది!" అనుచునే నిశ్శబ్దముగ నేడ్వ దొడఁగెను.

పాటలికి దుఃఖ మాగలేదు. ఆమెయు కన్నుల నీరు పెట్టు కొనినది. వా రిర్వురఁ జూచి శ్రీపాలి—"అహా! ఏమి తండ్రిబిడ్డలు! నాకు ధైర్యము చెప్పవలసినదిపోయి మీరు క్రుంగిపోవుచున్నారా? పాటలీ! నీవైన చిన్నాన్నకు చెప్పరాదా? తనువులు శాశ్వతములు గావు. లోకమున నేను పొందగలిగినంత భర్తృప్రేమను వేరెవరును పొందలేదేమో! ఆయన సన్నిధిలో నే నానందవార్ధివీచికలలో దొప్ప

డోగినాను. చిన్నపిల్లవు నీతో ననరాదుగాని నే నీ యింటికి వచ్చిన తొలిదినములలో నీ యూరియందలి శాలిక్షేత్రములు, ఇక్షువనములు కొబ్బరితోపులు ఒకటని యేమి! సర్వము మా విహారభూములే. మాకు సమయవివక్ష యుండెడిది కాదనుకొనుము. బావగారిరువురు మమ్ము పసివారిక్రింద గట్టెడివారు. మీ యమ్మ నన్ను కన్నబిడ్డను వలె చూచికొనెడిది. చిననాన్న అమృతహృదయుఁడమ్మా! ఆయన కిల్లాలి నైనందులకు నేనెంతయు గర్వించుచున్నాను. నాకు మరణ మనిన భయము లేదు. మధుమయ హృదయుఁడైన నా స్వామిని విడిచి పోవలయుననియే బెంగగ నున్నదమ్మా! తల్లీ! పాటలీ! ఇఁక నేనెట్లును జీవింపను. చిన్ననాటనుండి రోహితుఁడు నీకు మాలిమి యయినాఁడు. వానిని చక్కదిద్దు భారము నీదేనమ్మా! మీ చిననాయనగారిని కూడ కనిపెట్టి యుండవలెను తల్లీ!" యని యేమేమో చెప్పెను.

శ్రీపాలికి మరల నాయాసము వచ్చినది. మందారకుఁ డామె గుండెపై రాయుచు—"పాలీ! నీ వెందు కింత మాటాడెదవు? చూడుము. నీ కాయాస మెక్కు డగుచున్నది. నీవు విశ్రాంతి తీసుకొనవలెనని యాచార్యులవా రనలేదా ?"

శ్రీపాలి : నా కింకను విశ్రాంతియా ? అట్టి దీజన్మమున కిక లేదు. నాకు భయముగ నున్నది. నేనిఁక బ్రదుకను. మీరీ రాత్రి యంతయు నాయొద్దనే యుండిపోవలయును.

పాటలి : పిన్నీ యివేమి మాటలు! నీకు త్వరలోనే జబ్బు నెమ్మదించును.

శ్రీపాలి : నా వ్యాధి నెమ్మదించునది కాదు తల్లీ! నాకు భర్తతో గడపు నదృష్టము లేదు. అమ్మా! నా కెందువలననో నేడు పరమానందముగ నున్నది. మీ తండ్రి కుమార్తె లిరువురు నా దగ్గఱ నున్నారు. మీ రిరువు రీ రాత్రి నన్ను కనిపెట్టుకొని యుండ వలయును. నాకీ రేయి తుది రేయి యైనను విచారము లేదు. పాటలీ! నేనొక విషయముఁ జెప్పుచున్నాను. నీవు మహోజ్జ్వల వ్యక్తి వగుదువు. సాతవాహన సామ్రాజ్యమున నీ నామ మెల్లెడల ముఖరిత మగుచుండును. తల్లీ! పసితనమునుండి నీ భావము లకుఁ బ్రోదిచేసి నీవన్న మాట యన్నట్లుగ చెల్లించుచు నీకు విద్య గఱపిన నీ యీ భార్యా విరహితుఁడు గాబోవుచున్న పినతండ్రిని మరవకుము. నేడో రేపో మృత్యుదంష్ట్రల కెరగానున్న నీ పినతల్లి కడసారి యభ్యర్థనను సమాదరింపుము.

పాటలి వెక్కి వెక్కి యేడ్చుచు—"పిన్నీ! పిన్నీ! నీకేమైన దని! చిన్నాయనయు రోహితుఁడును నాకుఁ గానివారా? నీవు వీరి విషయమున నిశ్చింతముగ నుండుము" అనెను.

శ్రీపాలి: పాటలీ! ఏడ్చెద వేలనే! మృత్యు వెల్లరకు సహజమేగద!

శ్రీపాలి మందారకుని దిక్కై—"ఏమండీ! బిడ్డ యేడ్చుచున్నది. దానిని పట్టుకొను"డనెను.

మందారకుఁడు నోటికి గుడ్డ నడ్డిడుకొని పాటలిని దగ్గరకుఁ దీసికొనెను.

శ్రీపాలికి ధోరణి యెక్కు వగుచున్నది. ధనంజయుఁడు, శాలికుఁడు, మిహిర, రోహ, బప్పిక అందఱు నామె గదిలోనికి వచ్చిరి. ఆమె యందఱను గుర్తు పట్టినది. పెద్దలందఱకు వరుసగ నమస్కరించినది. ఆమె కా రాత్రి నిద్ర పట్టలేదు. విపరీతములు నసంబద్ధములునైన మాటలు మాటాడుచుండెను.

వైద్యుఁడు వచ్చెను. సంధి లక్షణమని నిర్ణయించెను. రాత్రి గడచినఁగాని తానేమియుఁ జెప్పజాల ననెను. మందారకుఁడు కంటికి మంటికి నేకధారగ నేడ్చుచుండెను. ధనంజయుని కాయ నను పట్టుకొనుట కష్టమైపోయెను. తెల్లవారుజామున కోడికూత వేళకు శ్రీపాలికి మాటలు స్తంభించెను. ఆమె కనులు మూతవడ లేదు. ప్రాణము లనంతాకాశమున లీనమయినవి.

తెల్లవారువరకు గ్రామమంతయు గ్రామణి యింటిముందు సమాహార మయినది. ఎవరిని జూచినను శ్రీపాలి మందారకుల యన్యోన్యానురాగకథా సంలాపములు చేసెడివారే. పాటలి కాశ్చర్య మొదవెను. 'భగవంతుఁ డట్టి యనురాగమయ జీవుల నేరి వారియం దొకరి నేల గొనిపోవునో!' యనుకొనెను.

ధనంజయుని యింట నానాడెవ్వరు నీరు త్రావలేదు. సూర్యాస్తమయమునకు పూర్వమే శ్రీపాలి భౌతికదేహమునకు విమల కృష్ణానదీతీర భూమియందు దహనసంస్కారము గావింపఁబడినది. శ్రీపాలి గదిలో నుంచబడిన ప్రమిదదీపములో నామె కన్నుల తళతళలు కన్పించగా మందారకుఁ డుస్సురని కూలిపోయెను.

రాత్రి ప్రొద్దువోయినది. ఇంటిలో నందఱు క్రమక్రమముగ నిద్రావశులైనారు. పాటలీ మందారకు లిర్వురే మెలకువతో నున్న వ్యక్తులు. ఇరువురు వియోగబాధా పరితప్తహృదయులు. ఇరువురు శూన్యమనస్కులు, క్షోభితాంతఃకరణులు!

వారిరువు రొకరి మనస్సుల కొకరర్ధభూతులుగ నుండిరి.

కడచినరాత్రిదైన శ్రీపాలి ముఖనిర్గతభాషణ మా గదియందలి వాయుతరంగములలో లీనమై నినదించుచున్న ట్లుండెను— "శ్రీపాలీ! ఓసినాయచ్చరా! నాపాలిటి కల్పలతికా! నీవులేని యీ శూన్యాగారము నాకువలదు. నేను నీతోడివాఁడను. నన్నువీడిచనుట నీకు తగనిపని. నన్నుగూడ నీవెంటఁగొనిపొమ్ము." మందారకుఁ డున్మత్తునివలె నఱచుచు గుండెలవియునట్లు విలపించుచుండెను. పాటలి పినతండ్రి చిబుకమును స్పృశించుచు— "చిన్నాన్నా! నావైపునకు చూడుము. పిన్ని నిన్ను నాకప్పగించి చనినది. ఆమె యాత్మకు శాంతికలుగవలెననిన నీవామెచెప్పినట్లు నడచుకొన వలెను. నీవు మహావీరుఁడవు. యుద్ధములొనర్చినవాఁడవు. మృత్యు దర్శనము నీకు క్రొత్తదికాకూడదు. నీవిట్లు బెంబేలుపడిన రోహితుఁ డేమికావలె? హృదయము నొలకబోసికొనకుము. బాధను సహించు కొనవలయును." అని యనునయించెను.

మందారకుఁడు కన్నులు తుడిచికొని పాటలివైపు చూచెను. ఆమె శోషితకపోలాధర! శీర్ణకుంతల! పరిదీనవదన! ఆమెను చూచి మందారకుఁడు సిగ్గుపడెను. ఆమెకును తనకును భేదమే మున్నది! ఆమెకొక యాసయున్నది. తనకదికూడ లుప్తమైపోయి నది. ఆమెకన్నులయందలి నైశ్చల్యమునుజూచి మందారకుఁడుపశ మిల్లెను. ఇరువు రాదీపమును జూచుచు మౌనముగ కూర్చుండి పోయిరి. ఎవరి హృదయమున నగ్నిపర్వతములు బ్రద్దలగు చున్నవో! ఎవరిమనస్సులందు జలపాతము లుద్భవించుచున్నవో! ఎవరిబ్రదుకుల ఝంఝూప్రకంపనములు విజృంభించుచున్నవో! ఎవరియాత్మలు శూన్యమును నింపుకొన్నవో!

వారిరువురు స్థాణువులై స్థిరదృష్టులై యొకరికొకరెదురెదురుగ కూర్చుండి రేయి వేగించిరి.

# 6

ఉత్పథధావికమనుజః ప్రవిజృంభితకలకలప్రహతతూర్యః
హంహోక్షణం నయే వహితేన వినా గ్రామదాహమేవ.

గంతులువేయుచు పరుగెత్తుచున్న జనులతో, నెక్కువ యగుచున్న కలకలముతో, ఘోషింపఁబడుచున్న తూర్యములతో, నీ యుత్సవము ప్రియుఁడు లేకుంటవలన గ్రామదహనము వలె నున్నది.

నాడు శ్రావణశుద్ధ తదియ. ఆలోలచతుర్థియుత్సవ దివసము. గ్రామమునందలి స్త్రీ బాల వృద్ధులందఱుఁ గలసి తూర్యనాదములు మ్రోగుచుండగా రంగురంగుల వస్త్రములు ధరించి గుంపులు గుంపులుగ యూరిలోని తోటలలోనికి కాలువయొడ్డునకుఁ బోయి మహోత్సాహముతో పందెములు వైచుకొని యూయల లూగుదురు. ఈయుత్సవమును వారు గొప్పగ పాటింతురు. తోటలయందలి మహావృక్షములకు జంటమోకులు కలిపికట్టి యూయెలలువైచి యొక్కొక్క యూయలపై రెండురెండు జంటలుగ నుత్సాహముగ నూగుదురు. కాలవ యొడ్డునగూడ నట్లే యూయెలవైచి యీ యొడ్డునుండి యా యొడ్డువర కూగుచుందురు.

ఎవరెక్కువ యెత్తునకు దూరమున కూగగలరో వారలకు గొప్ప గౌరవము చేయుదురు. ఈ యుత్సవములలో నప్పుడప్పుడు జనులూయలనుండి జారి కాలువలోఁబడి చనిపోవుట క్రిందఁబడి గాయపడుటయు జరుగుచుండును. కాని ప్రజల యుత్సాహము నివి యడ్డుకొనవు. అవి యట్లు సాగుచునేయుండును. ఏఁటేట నీ యుత్సవములు ధనంజయునివంటివారు మిగుల తమకముతో సాగించెడివారు. శ్రీపాలి రోగగ్రస్తురాలు కాని దినములలో మందారకుఁ డీయుత్సవములను పెద్దయెత్తున నిర్వహించెడివాఁడు. పాటలీ లలితులు తమ సమవయస్కులైన యువతీయువకులతో కలసి యూరంతను నొక కొలికికిఁ దెచ్చెడివారు.

ఈయేడు ధనంజయుని యిల్లుత్సవ శూన్యమయినది. శ్రీపాలి మరణ సంబంధి దుఃఖచ్ఛాయ లింకను పూర్తిగ తొలగిపోలేదు. పుండరీకుని యెడల విరహముచే దపించు పాటలికి యుత్సవము

గ్రామదాహమువలె నుండెను. తమ వాకిలిముందునుండి జనులు సంరంభముగ నేగుచుండ పాటలికి వారివైపు చూడవలెననిపించ లేదు. ఆమెకు దినములు నీరసముగ జరుగుచున్నవి.

శ్రీపాలి చనిపోయినపిమ్మట మందారకుని కొకవిధముగ మనస్సు చలించిపోయిన దనవచ్చును. అందువలన కృష్ణాసదు తీర వ్యాయామములు విసర్జింపఁబడినవి. గ్రంథపఠన మొక్కటే పాటలి కిప్పుడు కాలక్షేపముగ నుండెను. ఆమె నిరంతరము రామాయణ మహాభారతములను తనకు పుండరీకుఁ డొసగిన రాజ నీతి గ్రంథములను చదువుచు గడపును.

వప్పస్వామి రాకలు మరల నెక్కువగుచున్నవి. అతఁడు వచ్చినవాఁడు వచ్చినట్లుండక సాభిప్రాయముగ మాటాడును. పాటలి యాతని విదలించికొట్టుదమనుకొనును. పుండరీకుని తలఁచి తమాయించుకొనును. నాడు వప్పస్వామి వచ్చుచునే వాదముఁబెంచినాఁడు.

వప్పస్వామి : ఏమి పాటలీ! ఏమాలోచించితివి ?

పాటలి : వప్పస్వామీ! నీ ధోరణి మానవన్నమాట. ఆ యన్నగారికి నీవు తమ్ముఁడగుట నిజమున కాశ్చర్యముగ నున్నది సుమా !

వప్పస్వామి : ముందు స్వార్థము. తక్కినవన్నియు తరువాత.

పాటలి : నీవింత నీచమైన స్వార్థపరుఁడవని యాయనకుఁ దెలిసియుండదు.

వప్పస్వామి : నీకుఁదెలిసినదికద. నాకదిచాలును. ఎల్లరు స్వార్థాభిలాషులే. స్వార్థములేని జీవి యుండదు.

పాటలి : అట్లనకుము. మీయన్నగారు నీవలెనున్నాడా ?

వప్పస్వామి : ఒకరినిబోలి యొకరెందుకుండవలె ? అతని స్వార్థమతనికున్నది. అతనికి కీర్తిపై రాజానుగ్రహముపై వ్యామోహము. నాకట్లుగాదు. నాస్వార్థము వ్యక్తిసంబంధి. నినుఁజూచిన నాటినుండి నా మనస్సు నీయందు లగ్నమైనది. నిన్ను వీడి యుండుట దుర్భరముగ నున్నది. నే నేమి చేయగలను ? నా కింటి వద్ద నిద్దుర పట్టుటలేదు. ఆహారము రుచింపదు. నీ వనుగ్రహించ వలెను.

పాటలి: వప్పస్వామీ ! జ్ఞానహీనునివలె మాటాడకుము. నీ యన్నగారు నన్నన్వేషించు మనియేగద నిన్ను నియమించినది !

అప్పటికి నీకు నీయన్నగారి యభిప్రాయము తెలిసియుండునుగద. ఇంత చదివినవాఁడవు తెలిసినవాఁడవు అన్నగారి భార్యపై మరులు గొనుట తగని కార్యమని తెలియదా ?

వప్పస్వామి : నీ వనినట్లన్నభార్యవేయైన నెట్లుండెడిదో ! నీ వవివాహితవని నాకుఁ దెలియును. తొలుత పుండరీకుఁడు నిన్నుఁ జూచెను. మోహపడెను. తరువాత నేను జూచితిని. నేను నష్టే యయితిని. పురుషుల మోహింపఁజేయు లక్షణము నీలోనున్నది. అతఁడు నీ కొరిగించిన దేమి ? నే నొరగించని దేమి ? అతనితోడి సాంగత్యము నిరంతర వియోగ హేతువు. నేనైనచో నీ కనుసన్నల మెలఁగెదను. నీ సౌందర్యమును ప్రశంసించుచు కావ్యము లల్లెదను. నీ కడగంటి చూపులలో కఱగిపోయెదను. నీ పాదముల నేల మోప నీయకుండ నఱచేత నుంచుకొని రక్షించుకొందును.

పాటలి : నీ మాటలు వినిన నవ్వు వచ్చుచున్నదోయీ ! నీవు వర్ణించిన లక్షణములుగల పురుషులను స్త్రీలు వరింపరు. తన్ను ప్రేమించెడివారికన్న తాను ప్రేమించినవానినే స్త్రీ వాంఛించును. ఆయనకును నీకును సామ్యమేమున్నది ! ఆయన నీవంటి యల్ప బుద్ధి కాఁడు. కేవల కాంతా సమాలింగన బుద్ధులవలన నగున దేమున్నది ? మోహోపహతులైనవారు, ఆ మోహపుఁ దెర జారి పోగానే మరల యథాస్థితికి వత్తురు. వారికి నిలుకడలేదు. పురుషునిలో సహజమైన మార్దవమును స్త్రీ సహింపదు.

వప్పస్వామి : నీవు నన్నింత చులకనచేసి మాట్లాడుచున్నావు. నేను వందల వేల సార్లు చెప్పుచున్నను నీవు వివాహితవే యని భ్రమపడుచున్నావు. అది వివాహ మనిపించుకొనదు.

పాటలి : నీ యంగీకారానంగీకారములతోఁ బనియేమి ? నా యంతఃకరణమే నాకుఁ బ్రమాణమని చెప్పితినిగద.

వప్పస్వామి : నీవు లక్ష చెప్పుము. అది వివాహము కాదు. నీవు మహాశ్రద్ధతో భారతమును పఠించుచుంటివిగద ! వ్యాస వాల్మీకులు మన సంస్కృతిని తీర్చిదిద్దిరని నీవానాడు నా కుపన్య సించితివికద ! ఆ వేదవ్యాస ప్రోక్తమయిన మహాభారత సంహిత యందున్న పులోమ కథ చూడుము. వివాహ శబ్దమున కర్థము నీకు సువ్యక్తమగును.

వప్పస్వామి పాటలి చేతిలోని భారతగ్రంథమును తన చేతి లోనికిఁ దీసికొని పులోమకథను చూపి యిట్లనెను—"పాటలీ ! చూడు మీ కథను చదివెదను. దీనిని వినినచో నీ వివాహమునందలి

యసంబద్ధత నీకే యవగతమగును. పులోమ భృగువు భార్య. ఆ సంగతి నెఱిఁగి మహర్షి తన భార్యను రక్షించుట కగ్నులను నియోగించి యభిషేకార్థము వెడలిపోయెను. ఆ సమయమున పులోముఁడను రాక్షసుఁ డచ్చటికి వచ్చెను. వచ్చిన యాతనికిఁ బులోమ వన్యఫలములు కందమూలము లొసగి యాతిథ్యము నెఱపెను.

ఆ పులోమను పులోముఁడు పెండ్లికాక పూర్వము తనకు భార్యగా వరించెను. ఆ భావ మాత డిప్పటికిని పోషించుకొను చుండెను. తదుపరి పులోమతండ్రి యామెను భృగునకిచ్చి వివాహ మొనర్చెను. పులోముఁ డచ్చట జ్వలించుచున్న నిరింధనాగ్నిని జూచి, 'ఓయీ! యగ్నిదేవా! ఈమె యెవని భార్యయో నాకు నిజముగఁ దెల్పుము. పావకా! నీవు దేవతలకు ముఖస్థానీయుఁడవు. పూర్వ మీమె నాచే వరింపఁబడినది. తరువాత నీమె తండ్రి యామెను భృగునకిచ్చి వివాహ మొనర్చెను. ఈమె యెవని భార్య యగునో నాకు స్పష్టముగఁ దెల్పు' మని యడిగెను. ఈమె భృగువుచేత రహస్యముగ పొందబడినదైనచో నీమె నాశ్రమమున నిప్పుడే తీసికొనిపోయెదను. అనాటి కోపమింకను నా హృదయమును మండించుచున్నది. నాకు పూర్వమే భార్యయైన యామెను భృగువు పొందినాఁడు.

పులోముని మాటలు విని యగ్నిభట్టారకుఁడు మిగుల దుఃఖించెను. అనృతమునకు భృగుమహర్షి శాపమునకు వెఱచెను. నెమ్మదిగ నిట్లు వచించెను—"ఓయీ! రాక్షసుఁడా! పూర్వ మీమె నీచే వరింపఁబడినమాట వాస్తవమే. ఈమె తన తండ్రిచేత నీ భృగువున కీయబడినది. నీ కొసఁగఁ బడలేదు. అందుచే శ్రుతి ప్రమాణముగ నీమె విధిపూర్వకముగ భృగువుభార్య యైనది. నా యెదుట నేను సాక్షిగ నీమెను భృగువు వివాహమాడినాడు. అబద్ధ మెట్లు చెప్పగలను. అబద్ధము లోకసమ్మతము గాదు" అనెను.

అది విని పులోమనారాక్షసుఁడు బలాత్కారముగ నెత్తికొని పోవుట యామె గర్భము చ్యుతమై చ్యవనుఁ డుదయించి పులోముని భస్మీభూత మొనర్చుట మొదలయిన వన్నియు జరిగెను. ఇప్పుడు చెప్పుము. మీ వివాహము వివాహమేయైనచో నీ వా పుండరీకుని భార్య వగుటలోని యసంబద్ధత నీకే తెలియుచున్నదిగదా!"

పాటలి: ఓయీ! ఇందులో నొక ధర్మసూక్ష్మ మున్నది. ఆ పులోమ తా నా రాక్షసు నంగీకరింపలేదు. నే నింకొకటి చెప్పెదను చూడుము. సావిత్రీదేవి యున్నది. ఆమె వివాహమునుగూర్చి

యేమన్నది ! ఆమె సత్యవంతుని మనసా వరించినది. ఆతనిఁదప్ప నన్యుని పెండ్లియాడనని ఖండితముగఁ జెప్పినది. దేవర్షియైన నారదుఁ డాతని కొక సంవత్సరము మాత్రమే యాయుర్దాయ మున్న దనెను. మద్రరాజు కూతును వేరొకని వరింపు మనెను. అప్పుడా దేవి యేమన్నది !

"సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే
సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సకృత్ సకృత్."
"దీర్ఘాయువ దల్పాయుః సగుణో నిర్గుణోపివా
సకృద్వృతో మయా భర్తా నద్వితీయం వృణోమ్యహమ్"

అని యున్నది.

"ఆస్తిలోవంతు (అంశ) యొకసారియే పొందబడుచున్నది. కన్యక యొకసారియే యీయఁబడుచున్నది. ఒక్కసారియే యిచ్చితి నని చెప్పఁబడుచున్నది. ఈ మూఁడు నొక్కసారియే జరుగు చున్నవి. దీర్ఘాయువు కలవాడైనను, అల్పాయువు కలవాడైనను, గుణవంతుఁడైనను, గుణహీనుఁడయినను, ఒకసారి నాచే భర్తగా వరింపఁబడినాఁడు. రెండవవానిని నేను వరించను."

మనస్సునందు నిశ్చయము చేసికొనిన పిమ్మటనే వాక్కు బహిర్గతమగుచున్నది. తరువాత కర్మరూపు కట్టుచున్నది. అందు వలన నా యంతఃకరణమే నాకుఁ బ్రమాణము. ఆ మహాపతివ్రతా శిరోభూషణమైన సావిత్రీదేవి మాటలు నా కుపాదేయములు. తెలిసి నదా ? పుండరీకుఁ డెట్టివాడైనను, ఎట్టి వృత్తి నాచరించుచున్నను నాకు దూరగుడై యుండవలసి వచ్చినను, ఏదియేమైనను అతఁడే నాకు భర్త. నీ వింతకు పూర్వము పులోమకథ చెప్పితివి. అచ్చట పులోమను పులోముఁడు వరించెను గాని పులోమ పులోముని గాదు. ఇచ్చట సావిత్రీదేవి తానై సత్యవంతుని వరించినది. కావున నేమగు చున్నది ! స్త్రీ మనస్సును అనుసరించియే సర్వమును జరుగు చున్నది. రాక్షసుని భావించని పులోమకు తండ్రి నిర్ణయించిన మహర్షి భర్త. తాను వరించిన సత్యవంతుఁడు సావిత్రికి భర్త. పాటలీపుండరీకులు పరస్పరము వరించుకొనిరి. వారిర్వురు భార్యాభర్తలు. తెలిసినదా ? ఇఁక నెప్పుడు నిట్టి యసంబద్ధపు మాటలాడకుము.

వప్పస్వామి : నీ వెప్పటికైన నా దానవే. పుండరీకునికి నిన్ను దక్కనీయను. నీవు నాదానవై తీరవలయును.

పాటలి కన్ను లగ్నికణముల నుమియుచుండెను. వప్పస్వామి

బెదరిపోయెను. అతఁడు వేదనాపరిదీనవదనుఁడై—"పాటలీ! నిన్నంజలి ఘటించి యర్థించుచున్నాను. నా కోర్కె నెరవేర్పుము. నే నెవ్వరితోడ ననను. నీవు నన్ననుగ్రహించనిచో నా ప్రాణములు నిలుచునట్లు లేవు. పాటలీ! పాటలీ! నాపై దయఁ జూపుము. ఇవి చేతులు గావు కాళ్లనుకొనుము" అని బతిమాలెను.

వప్పస్వామి పాటలి యెడమచేతిని తన చేతులలోనికిఁ దీసికొనెను. పాటలి క్రోధోన్మత్తయైన సాతవాహనీదేవివలె మహాభయంకరముగ నుండెను. ఆమె వప్పస్వామి చేతి నట్లే బిగించి మెలిద్రిప్పెను. అతఁడు విలవిల లాడిపోయెను. పాటలి విరుగబడి నవ్వుచు— "ఏమోయీ! ఇంత విలవిల లాడెదవేమి? ఒక యబల, ఆడపిల్ల చేయి తగిలినంత మాత్రమున నిట్లు బింకము చెడితివి. నీ వింత దుర్బలుఁడవు పిరికివాఁడవు ననుకొనలేదు. ఇట్టివాఁడవు నీకు నాపై మనసు పోయినదా? ఛీ! కలలోనైన నట్టి యూహ నయుటకుఁ దగని మగధీరుఁడవు! దుర్భావనలకు స్వస్తిఁజెప్పి యిచటినుండి వెడలిపొమ్ము. తిరిగి నే వెప్పుడు నా సమక్షమునకు రావలదు" అని గట్టిగా బుద్ధి చెప్పెను.

వప్పస్వామికి కోపము దుఃఖము పొంగిరాగా యామె చేతిలో నలిగి కమలి యుబ్బిన తన యడచేతిని జూచుకొని సిగ్గుపడెను.

వప్పస్వామి: ఇల్లలుకగనే పండుగయైన దనుకొనుచున్నావు కాబోలును. ఈ వప్పస్వామి సంగతి నీ కింకను పూర్తిగ తెలియదు. పగబట్టిన త్రాఁచుపాము ననుకొనుము. నీవే చూడఁ గలవు. పుండరీకునికి నీ వెన్నటికి నిల్లాలవు కాజాలవు. ఎన్నటికైన నేను నిన్ను నాదానినిగఁ జేసికొని తీరెదను.

పాటలి: ఛీ! వదరుబోతా!...నాతో మాటాడవలదని చెప్ప లేదా! నిన్నేస్త్రీయు వాంఛింపదు. నీవు వట్టి వెఱపరివి. ఈ జన్మములో నేను పుండరీకుని కలసికొనలేకనే పోవచ్చును. పై లోకములలో మరుజన్మములో నయిన నే నాయనకు భార్యనే యగుదును. నేను నీదాన నగుట వట్టి కల్ల. కలలోగూడ నట్లూహ సేయకుము.

ఇట్లనుచు పాటలి దిగ్గనలేచి ఆ గదినుండి యాక్షణమ విసవిస వెడలిపోయెను.

వప్పస్వామి ఖిన్నుఁడై మొగ మింత చేసికొని నెమ్మదిగ గది వీడిపోయెను.

దినములు గడచుచున్నవి. ఆశ్వయుజము వచ్చినది.

రాజధానిలో మరల నుత్సవములు జరుగుచుండెను. వికుంఠ పురమునఁగూడ ముమ్మరముగ నుత్సవములు సాగుచుండెను. పాటలికీ యుత్సవములపై నాసక్తి లేకున్నను పుండరీకుని యోగ క్షేమముల నర్థించి తమ యింట నమ్మవారిని కలశమునఁ బ్రతిష్ఠించి పూజలు సలుపుచుండెను. మూఁడవనాటికి అనగా అశ్వయుజ శుద్ధ తదియనా డామె ప్రతీక్షించుచున్న యాహ్వానము రానే వచ్చెను.

అదియొక యాజ్ఞాపత్రము. అం దిట్లున్నది—"సర్వమండలాభివాదిత చరణుఁడు సర్వరాజలోక మండల ప్రతిగృహీత శాసనుఁడు శ్రీశ్రీశ్రీ మహారాజ క్షత్రియదర్పమాన మర్దనుఁడు శక యవన పల్లవనిషూదనుఁడు అనేక సమరపరాజిత శత్రుసంఘుఁడు, అపరాజిత విజయపతాకుఁడు, ఏక శూరుఁడు, ఏక ధనుర్ధరుఁడు నగు శ్రీ శ్రీ శ్రీ గౌతమీపుత్ర శ్రీ సాతకర్ణి మహారాజు వ్రాయించు నాజ్ఞాపత్రము—వికుంఠపురవాసినియు, ధనంజయ గ్రామణి పుత్రికయు నగు పాటలి రాజధానికి వచ్చుగాక! ఇది మహారాజు నాజ్ఞ."

ఈ పత్ర మొక చీనాంబర ఖండముపై వన్నెని మషీరసముతో ప్రాకృతములో వ్రాయఁబడి యుండెను. అశ్వారూఢుఁడైన యొక రాజభటుఁడా పత్రమును దెచ్చెను. అతని వెంట నొక యాందోళిక వచ్చెను. ఆ మహారాజు నాజ్ఞాపత్రమును కన్నుల కద్దుకొని ధనంజయుఁడు వచ్చిన రాజభటుల కుచితమర్యాదలు సలిపి వారలఁ గూర్చుండ నియమించి గృహాభ్యంతరమున కేగెను. ఈ వార్త నాతఁ డింటిలోనివా రందఱ కెఱిగించెను. విన్నవారంద ఱానందించిరి కాని యంతలో నెల్లర మనస్సుల నానందము విరిగిపోయి దుఃఖము ముంచుకవచ్చెను. పాటలి యానందమునకు మేర లేకుండెను. ఆమె తన పూజలు ఫలించినవని మురిసిపోవుచుండెను. వసంత నవరాత్రములలో రాజధానియందు తనకు పుండరీకుఁడు కనిపించెను. మరల నీ శరన్నవరాత్రములలో గూడ కన్పించునేమో!

బప్పిక నుమరాలిని దగ్గఱ కూర్చుండబెట్టుకొని—"తల్లీ! నీవు కీర్తిమంతురాల వగుదువమ్మా! నీవు తిరిగి వచ్చునంతవరకు నీ ముదుసలియవ్వ బ్రదికి యుండకపోవచ్చును. నీకు వేలాది యాశీస్సులు" అని యామె శిరమును ముద్దిడుకొనెను.

మిహిరా ధనంజయు లిర్వురు తమ గారాబు కూతురు మహారాజుల ప్రాపకము సంపాదించుకొనగలిగినదను నానందముతో పాటామె తమనుండి వేరుగావింపఁబడుటచేనైన వ్యథను సైత మనుభవించుచుండిరి.

మధుర మనోవేదన కంతు లేకుండెను. తాను ధనంజయు నింట కోడలుగ నడుగిడినదాది పాటలిని వదలి యుండలేదు. అంతకుముం దామె తన నెచ్చెలి. ఆమె వియోగము తనకు దుస్సహముగ నున్నది.

రోహకు పాటలి రాజధానికి పోవునను మాట కర్ణపేయముగ నున్నది.

మందారకుఁడు మనస్సున రగిలిపోవుచుండెను. శ్రీపాలి మరణముచే నొదవిన దుఃఖ మొకవంక, పాటలీ గృహ నిష్క్రమణ మొకవంక నాతని గుండియను కలఁచివైచుచుండెను. రాజ కార్యముల యొత్తిడులు తనకుఁ గ్రొత్తవి కావు. పాటలి తిరిగి వచ్చుటనునది యుండునో యుండదో! తన యన్న వదినల కేమియుఁ దెలియదు. వారు పాటలి యదృష్టవంతురా లనుకొను చున్నారు. తన కట్లనిపించుట లేదు. ఏది యేమైనను రాజాజ్ఞ యనుల్లంఘనీయము. లలితుఁడు చెల్లెలిని వదలి యుండవలసి వచ్చుటకు పరితపించిపోవుచుండెను. రాజధానిలో నున్నచో తనకు ప్రతిదిన మామెను చూచుటకు వీలగునా? ఏమో! ఈ స్థితిని తన చెల్లెలు కోరి తానై కల్పించుకొనినది. ఆమె కందులోనే యానంద మున్నదేమో మరి!

ఊరిలో నెల్లరును పాటలి నభినందించువారే! పెద్దముత్తైదువు లందఱా మె నాశీర్వదించిరి. ఇంటిలో నాడు పండుగ చేసిరి. పాటలికి నభ్యంజనాదికముల జరిపిరి. పిండివంటలు చేసిరి. ఆమెకు క్రొత్తచీర కట్టఁబెట్టిరి. పాటలి యింటిలోని పెద్దలందఱకు పాదాభివందన మాచరించినది. మందారకుఁ డామె నక్కునఁ జేర్చికొని—"తల్లీ! నీవుకూడ నన్ను వదలిపెట్టి పోయిన నేనేమి కావలెనమ్మా!" అని కంట నీ రిడుకొనెను. పాటలి రోహితుని తన తల్లికి మధురకు నొప్పగించెను.

ప్రయాణ సమయ మైనది. పాటలి తండ్రియొద్ద కేగి పాద ప్రణామ మాచరించి—"నాన్నా! పాటలి మీకుఁ గీర్తిఁ దెచ్చునట్లు ప్రవర్తించును. ఇది మీ పాటలి మీకు చేయు వాగ్దానము" అనెను.

ధనంజయుఁడు కుమార్తె మూర్ధము నాఘ్రాణించి—"నాకుఁ దెలియునమ్మా చిట్టితల్లీ! నీవు జన్మించినది కారణముగ మన వంశము తరించినది. శుభముగ నేగి లాభముగ తిరిగి రమ్ము" అని యాశీర్వదించెను.

పాటలి మధురను కౌగలించుకొని—"వదినా! ఇఁక నీయింటి

భారమంతయు నీదే. ఎట్లు నిర్వహించుకొందువో!" యనెను.

మధుర: పాటలీ! నాపై నింత భారముమోపి నీ వరుగుచున్నావు. నా శక్తివంచనలేకుండ నా నెచ్చెలి యాజ్ఞను పాలింతును. నీవుమాత్ర మీగ్రామములో నీ మధుర యున్నదని మరువకుము.

మధుర కన్నుల నొత్తికొనెను.

నాడే పాటలి రాజధానికిఁబోయెను.

ఆమెకు కోటలోనే విడిది యీయఁబడెను. అది పూర్వము వలెగాక విశాలమైనది. సుసజ్జితము సుందరమునైనది. ఆమెకు సపర్యలకై యిరువురు పరిచారిక లుండిరి. ఆమె యేదికోరిన నది తత్క్షణమే సమకూర్పఁబడుచున్నది. రాజోద్యోగములింత సుఖకరములుగ నుండునా యనునంత సౌఖ్యముగనుండెను. పాటలి మనస్సునందు రెండువిధములైన విచారములుండెను—తనవారిని వీడి చనుదెంచుట, పుండరీకునిజాడ తెలియకుండుట యనునవి.

తాను కోటలోనికి వచ్చిన యేడుదినములకు తనకు రాజమాతయొద్దనుండి యాజ్ఞ వచ్చినది. విజయదశమినాఁడు గౌతమీ మందిరమున పాటలి తన్నుకలసికొనవలసినట్లు నిర్ణయింపబడినది. రాజసంబంధములైన కార్యక్రమములలో నెంతజాప్యము జరుగునో పాటలికిప్పుడిప్పుడే యవగతమగుచుండెను. రాజధానినగరమున నెలలకొలది నిలిచిపోయి పనులుగాక తిరిగివచ్చిన వారి నెందరినో తానెరుగును. తనకు జరిగిన మర్యాదలలో తాను వానినన్నిటిని మఱచిపోయెను. తుదకు తనకును తెలిసివచ్చినది. తాను కోటలోనికెందులకు రప్పించబడెనో తాను నిర్వహించవలసిన కార్యమేమో యేమియు తెలియుటలేదు. కోటలో ప్రవేశించి వారము గడచినది. తనకు రాజభోగములన్నియు జరిగిపోవుచున్నవి. తాను రప్పింపఁబడిన విషయము మాత్రము పట్టనట్లు ప్రవర్తింతురు. ఈ రాచరికపు మర్యాదలు చాలచమత్కారముగ నున్నవి. మర్యాదకు మర్యాదయే. పట్టించుకొనకపోవుట దానికదే!

పాటలి కిచ్చటి విషయములన్నియు నాశ్చర్యజనకములుగనే యున్నవి. ఒకవంక నవరాత్ర్యుత్సవములు మహావైభవముగ సాగిపోవుచున్నవి. ఇచ్చట ప్రతికార్యమును శ్రద్ధగ నిర్వహింపఁబడుచుండును.

ప్రతి దినము విదేశములనుండి రాయబారులు వచ్చుచుందురు. సముద్రాంతరముల వ్యాపారము చేయు వర్తకులు

వచ్చెదరు. మహారాజు దినచర్యయే యెంతోకాలము తీసికొనును. మరి వీరినందఱను కలసికొనునదెప్పుడో! ఉత్సవముల నిర్వహించుట రాజకార్యములు చక్కబెట్టుకొనుట, కోటలో పూజలు జరుపుట. అమ్మో! అన్నిపను లొక్కమారుగ చక్కబెట్టుకొను టెంత కష్టము!

కోటలో ప్రవేశించినదాది పాటలి కచ్చటి విషయములన్నియు వింతగ గనిపించుచుండెను. తానిదివరకెన్నడట్టి తావుల మసలినది కాదాయెను. కోటలో నెల్లరు సభయనేత్రులు చకితదృష్టులు మౌన మూర్తులు! విచ్చలవిడిగ మాటలాడుటచటి వారెఱుఁగనిది. తమ గ్రామమునందలి స్వేచ్ఛాజీవితముల నిచటి యాజ్ఞాబద్ధమైన బ్రదుకులను పోల్చిచూచుకొని తమ పల్లెలయందలి జీవిత విధానమును మెచ్చుకొనును. నోరువిప్పి హృదయములందలి భావములను వెలార్చుటకు వీలులేదు. ఏమిమాటాడిన నేమగునో! ఒక్కొక్క మాటకు తలలు మార్చబడవచ్చును. తరుగబడవచ్చును. ఇంకేమైనఁ గావచ్చును. రాచనగరి యందలి బ్రదుకులు బహు దుర్భరములు. కత్తివాదరపై నడకవంటివి. మాటాడుమాట చూచు చూపు సర్వము ప్రతిలిప్తైకదేశమును తూచితూచి యాలోచించి యాలోచించి చేయవలయును. పాటలికి తల తిరిగిపోవుచున్నది!

దశమినాటి రాత్రి పాటలి రెండవమారు రాజమాత గౌతమీ దేవిని సందర్శించెను. పాటలి రాజమాతకు పాదాభివందన మొనర్చెను. రాజమాత పాటలిని జూచి నివ్వెఱపోయెను. మును పటి పాటలికిని నేటి పాటలికిని చాల భేదము కనిపించుచున్నది. ఈమె చిక్కిసగమయ్యేనేమి? ఈమె నేమైన మధురస్మృతులు బాధించుచున్నవా యనుకొనెను.

గౌతమీదేవి: పాటలీ! నీకు కోటలో సుఖముగ నున్నదా? సదుపాయములన్నియు చక్కగ జరుగుచున్నవా?

పాటలి: ఎంతమాట రాజ్ఞీమతల్లీ! తమయనుగ్రహ విశేషమున నన్నియు సవ్యముగ నడచుచున్నవి.

గౌతమీదేవి: మేము నిన్నెచ్చటికైన పరరాజ్యములకు పంప దలఁచుచో పోవుటకు నీవు సిద్ధముగనున్నావా?

పాటలి: అవశ్యము. తమయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగనున్నాను.

గౌతమీదేవి: మేము నీపైనొక మహాభారమును మోపఁ దలచినాము. దానిని వహించుట మిగుల కష్టమైన విషయము.

కాని అందులకు నీవొక్కతెవే సమర్థురాలవని మాయభిప్రాయము.

పాటలి : మహారాజమాతల యాదరణవిశేషమది. నా నుండి కాదగిన యెట్టికార్యమునైన త్రికరణశుద్ధిగ నా శక్తి చాలినంతమేర కెంతశ్రమయయినను సహించి నిర్వహింప యత్నింతును.

గౌతమీదేవి : బాగున్నది. కార్యదీక్ష యనిన నిట్లుండవలయును. మేము నిన్నెచ్చటికైనఁ బంపుటకు ముందు నీకు కొంత శిక్షణ నిప్పించవలసియుండును. నీవు కొన్ని భాషలు నేర్చుకొనవలయును. అవసరమునుబట్టి వివిధవేషములను సంతరించుకొనవలయును. అది నీకెట్లును సులభమైన విషయమే. నీవు సహజముగ నటివిగద! నీకు మాకోటలో నిపుణలైన వేశ్యాంగనలచే శిక్షణ నిప్పింతుము. పలువిధములైన నాట్యరీతుల బోధింపజేసెదము. ఆరితేరిన గూఢచారులచే నీకు ప్రయోగవిజ్ఞానము కలుగజేసెదము. దీనికంతకు నెలలు పట్టును. నీకంగీకారమే యనుకొందును.

పాటలి : మహాప్రసాదము. తమరేయాజ్ఞయిడిన నదిచేయుదును. నాజీవితమును తమపాదపద్మములయందు కానుకవెట్టుచున్నాను.

గౌతమీదేవి : సంతసించితిమి. నీవెంత త్వరితముగ శిక్షణ పొందిన నంతమంచిది. నీవీయభ్యాసములు చేయుటకు నీకు పర్యవేక్షకులుందురు. రేపటినుండి యారంభింపవలసి యున్నది.

పాటలి : చిత్తము.

గౌతమీదేవి : మంచిది. నీవిఁకపోవచ్చును.

పాటలి మహారాజమాతకు ప్రణమిల్లి సెలవుగైకొనెను.

ఆమె పల్యంకికపై తనవిడిదికి పోయెను. ఆమె నాటిరాత్రి యంతయు తన భవిష్యమును గుఱించి యోజించుచు గడపెను. తనకు నాట్యము గానము నేర్పింతురా? గూఢచారుల ప్రయోగవిజ్ఞానమున శిక్షణ నిప్పింతురా! పలుభాషలు నేర్పించెదరా? వీని నన్నిఁటి నభ్యసించి తా నేమి చేయవలయునో! తన్ను పరరాజ్యములకు పంపెదరా! తనచే నిర్వహింపఁబడవలసిన కార్యములచ్చట నేమిుండునో! ఏమని యడుగరాదు. చెప్పినట్లాచరించుటయే తన కర్తవ్యము. ఆనాఁడు తనస్వామి పుండరీకుఁ డేమనెను? ఆ మహాదేవి యాజ్ఞాపించున దెంతటి దుర్ఘట కార్య మయినను అవశ్యమది శిరోధార్య మనికదా! అతని నుడువులు తనకు మంత్రాక్షరములు!

పాటలి ప్రతిదినము నాట్యరీతులను, గూఢచార శిక్షణలను

పొందుచుండెను. పలుమారులు రాజమాత గౌతమీబాల శ్రీదేవిని దర్శించుచుండెను. ఆమెవద్ద చాల సమయము గడపుచుండెను. పాటలి ముగ్ధదీపుఁడై ధాన్యకటకమునం దంతట నశ్వారోహియై వాహ్యాళు లేగుచుండును. రాజధానిలోనెల్ల ముగ్ధదీపుఁడే ప్రవీణుఁడైన యాశ్వికుఁడు. ఖడ్గ విద్యావేత్తగ నెల్లరకు విదితుఁడైనవాఁడు. ముగ్ధదీపుఁడు నడయాడని రహస్య ప్రదేశము లా నగరమున లేవనియే చెప్పవచ్చును. ఆతఁడు విహరింపని నదీసైకతస్థలులు లేవు. ధాన్యకటకమున ప్రత్యంగుళము మేర యాతనికి సువిదితము. ఆమె దినమున కొకచోటగ — నేడు మహారాజ్ఞి వాసిష్ఠీదేవి యంతఃపురమున, రేపు రాజమాత గౌతమీదేవి మందిరమున మరునాడు దేవాయతనమున నృత్యములు సేయుచుండెను. ప్రతి నృత్యము నందు నధికాధిక విశేషములు చూపించును. ఒకసారి చేసిన నృత్యము వేరొకసారి యుండదు. వివిధ దేశములందలి నృత్యములు, అహార్యములు, వాచికములు, భాషలు నన్నియు నేర్చుచుండెను. గౌతమీబాల శ్రీదేవి పర్యవేక్షణలో పాటలి విఖ్యాతియై బంగరు శలాకవలె సాగి చూపరులకు మన్మథాస్త్రమువలె నుండెను.

ఆమె ధరించు నుడుపులు నాభరణములు ఆమె యలంకారములు, అమె మాటాడు వైఖరులు, ఆమె పోవు యొయ్యారములు లీవి సర్వ మామె నొక భరతనాట్య వేత్రినిగ తీర్చిదిద్దెను. మహారాణి వాసిష్ఠీదేవి కామె యనిన మిక్కిలి వాత్సల్యము. ఆమె కాడపిల్లలు లేకపోవుటచే నామె ప్రేమ పాటలిపై ప్రసరించినది. పాటలిని రాజకార్యములయందు నియమించు టామె మనస్సునకు కష్టముగ నుండెను. ముక్కుపచ్చలారని పసిపిల్లను పరదేశములందలి రాచరహస్యములను వెలికిదీయు నుద్యోగమున నియోగించుటనిన నది యామె గుండెకు బరువైన విషయముగ నుండెను. ఆమెకార్యచాణక్యుని విషకన్య జ్ఞప్తికి వచ్చినది. పాటలికొఱకై మిగుల చింతించినది.

అత్తగారు కౌటిల్యనీతిని పాటించునని యామెకుఁ దెలియును. రాజ్యమునకు రాజమాత గౌతమీబాలశ్రీదేవి వెన్నెముక వంటిది. ఆమెనీతి పండి తమరాజ్యము విస్తరించుచున్నది. కాని యామె కర్తవ్య మార్గములు నిష్ఠురములు నిర్దయములు నిగూఢములు నీరాగములు నీరంధ్రములును ! అయ్యో ! పాటలి పాప మీవాగురలో చిక్కుకొన్నది. ఆమె కన్నులలో నెవో మధురోహలు గూడు కట్టుకొనుచున్నవి. వానికి స్థితికల్పన జరుగునో లేదో !

మహారాజ్ఞి యొకనాడు సాతకర్ణి మహారాజుతో — "ప్రభూ ! పాపమా పాటలి నట్లు పంపఁదలచుకొన్నారు. ఆమె కేవలము పసిపిల్ల. ఆమె మహారాజమాత నీతిని నెఱపగలదా ? రహస్యభంగము గాకుండ నిర్వహించుకొనగలదా ?" యనినది.

సాతకర్ణి : దేవీ ! నీ వామెను పసిపిల్ల యనుకొనుచున్నావుగాని యామె నీవనుకొనునంత వెఱపరికాదు. ఆమె సర్వసమర్థురాలు. మాతృశ్రీ తాము దీర్ఘాలోచన చేసిగాని యెట్టి నిర్ణయమును చేయరు. ఆ విషయమై సంశయింప నక్కఱలేదు. ఆమె పుండరీకుని గూఢచారి దళములచే రక్షింపఁబడుచుండును. ఆమెకువచ్చిన సేగిలేదు.

ఆ రాజదంపతులమధ్య పాటలినిగూర్చి పలుమారు లిట్టి చర్చలు జరుగుచుండెను.

పాటలికి తన కర్తవ్యదీక్ష క్రమబద్ధముగ సాగుచున్నందులకు సంతసముగ నున్నను తనభర్త జాడ తెలియలేదన్న చింత యన్లే బాధించుచున్నది. గౌతమీదేవి సాన్నిధ్యమున పాటలి తన్నుదాను మఱచిపోవును. ఆమె యేమైన మంత్రకత్తెయా ! ఆమెకు కత్తి యుద్ధములో నతి సూక్ష్మములైన మెలకువలు తెలియును. తనకు వాని నన్నింటిని బోధించినది. ఆమె తనకు జంటెపుదెబ్బ నేర్పినది. అశ్వారోహిని దెబ్బ కొట్టినచో నా రౌతు గుఱ్ఱము కూడ సగమునకు తునిగిపోవలసినదే. ఆ దెబ్బను తాను కొయ్యగుఱ్ఱములపై ప్రయోగించి యభ్యసించెను. రాజమాత పాటలికి ప్రాణాయామము నేర్పినది. ఊపిరి వదలి శరీరమును సన్నిగిలఁజేయుట, పూరించి యుబ్బించుట మొదలైన ప్రక్రియల నెన్నింటినో తెలిపినది. ఆమె యంత ధీమతి ! ఆమె యాదేశ మెంత కఠినమో యాదరణ మంత మృదువు. ఆమె సాన్నిధ్యము దేవతాసాన్నిధ్య మనిపించును. ఇది యంతయు పాటలి తన యదృష్టముననే సంభవించిన దనుకొనును. గౌతమీబాలశ్రీదేవి మహారాజనీతివేత్రియఁట ! ఆమెనీతి ఫలించి సాగినదీ సాతవాహనసామ్రాజ్యమని చెప్పికొందురు. శివస్వాతి మహారాజ కాలమునఁగూడ నీమెయే రాజతంత్రము నడపుచుండెడిదఁట !

శ్రీ గౌతమీపుత్ర సాతకర్ణి మహారాజు సింహాసన మధిష్ఠించు నాటికి రాజ్యపరిస్థితి మిగుల నల్లకల్లోలముగ నుండెనఁట. మత సంబంధమయిన యొత్తిడు లెక్కుడై వర్ణాశ్రమ ధర్మరక్షణ లేకుండ దేశమంతయు మ్లేచ్ఛ యవన దూషితమై యొసఁగినదఁట. చిన్న చిన్న రాజులు స్వతంత్రించి యవనులతో చేయికలుపుచు సరిహద్దుల

నల్లరులు లేవదీయుటకు యత్నించుచుండిరఁట. ఇట్టి యనేక పరిస్థితులను జాగరూకతతో నెదుర్కొని తన పుత్రునకు సర్వ విధముల సాయపడుచు రాజ్యతంత్రమును తీర్చిదిద్దిన వీరనారీమణి యామె ! ఆమె కనుసన్నలో మహాయుద్ధములు జరుగును. ఆగిపోవును. ఆమె యంతటి రాజనీతిచతుర. ఆమె యా పాంచాలీదేవి వంటిది కావలయును. ఆమె శుశ్రూషలో తానామెలో శతాంశమును పొందగల్గిన చాలును. తన జన్మము చరితార్థమగును !

పాటలి యూహ లిట్లు సాగుచుండెను.

నాఁడు రాజమాతయు మహారాజును పాటలిని రహస్యమందిరమునకు రప్పించి యర్ధరాత్రముదనుక మంతనములు సల్పిరి. చాలతడవు చర్చ జరిగిన యనంతరమున గౌతమీబాలశ్రీదేవి— "పాటలీ ! నీవు ముగ్ధదీపుఁడవై సిద్ధముగ నుండుము. మేము చెప్పిన వన్నియు స్మృతియం దుంచుకొనవలెను. రేపటినుండి నీ రాజకీయ జీవిత మారంభమగును" అనెను.

పాటలి : చిత్తము మహాదేవి !

ముప్వురు మూఁడు దారుల తమతమ యావాసములకు జనిరి.

# 7

"యద్యత్ కరోషి యద్యజ్జలపసి యద్యన్నిరీక్షసే ననంపద్యతే
దీర్ఘోదివసోపి భవతి తత్తదను శిక్షమాణాయాః"

నీవేమి చేయుదువో యేమి పల్కుదువో యేమి చూచెదవో అదంతయు నామె నేర్చుకొనినది. ఆమె నిన్ననుకరించును. లేదా నీ వామెకు నేర్పితివి. అందుచేత నామెకు దినము దీర్ఘమగుచున్నది.

మహాప్రభువులు నా మనవి చిత్తగించవలెను. ఆ బాలవీరుఁడు ముగ్ధదీపుఁ డున్నాఁడుగద. అతని ప్రవర్తన యనుమానాస్పదముగ నున్నది. అతఁడు శత్రుగూఢచారులతో మంతనము లాడుచున్నాఁడు. శత్రుస్థావరముల యొద్దకు పలుమారులు వెళ్లి వచ్చుచున్నాఁడు.

సాతకర్ణి: అని నీకెవరు చెప్పిరి? శత్రుస్థావరములు నీకెట్లు తెలియును?

వార్తావహుఁడు: అంతఃపుర రక్షక భటులలో నొకఁడైన శ్రీగుప్తుఁడు.

సాతకర్ణి: ఏమి వృద్ధశ్రీగుప్తుఁడా? అట్లయినచో నాలోచింపవలసినదే. ఈ రోజు రాత్రి ప్రథమయామము చివరిభాగమున మమ్ము మహారాజమాత శ్రీశ్రీశ్రీ గౌతమీబాలశ్రీదేవి వారి రహస్యాలోచనామందిరమునఁ గలసికొనుము. అచ్చట తల్లిగారుకూడ నుందురు. నీవీ విషయము నచ్చట నివేదింపుము.

వార్తావహుఁడు: చిత్తము మహాప్రభూ!

వార్తావహుఁడు వెళ్లిపోయెను. గౌతమీపుత్ర శ్రీసాతకర్ణి మహారాజునకు సర్వము నాశ్చర్యముగ నుండెను. తన తల్లిగారి మేధానైశిత్యమునకు తన మనసులోననే నివాళులెత్తెను. ఆమె నీతివల్లి పల్లవించి పుష్పించి పరిమళముల వెదజల్లుచున్నది. తెల్లవారులోపల నా సువార్తలు రాజధాని యందంతట నలముకొనునేమో! ఆహా! ఆమె సిద్ధసంకల్ప. ఆమె యూహకు ముందు ఫలితములు కనిపించును. ఈ సాయంకాలము లోపల ముగ్ధదీపునిపై నెన్ని యభియోగములు వచ్చునో! తన మాతృదేవి కేవలము పరమేశ్వరి యంశసంభూతురాలై యుండును. ఆమె నేత్రాంతములనుండి

జాలువారు ప్రేమార్ద్రములైన చూపులలో నెన్ని రాజ్యములు సృష్టింపఁబడునో! ఆమె కుపిత కుటిల భ్రూభంగములలో నెన్ని రాజ్యములు నేలమట్టము లైనవో! ఆమె విధురచాలనములలో నెన్ని ప్రాణములు సుడిపడిపోవుచున్నవో! ఆమె మధుర మందహాస రోచులలో నెన్ని క్రొత్తరాష్ట్రము లుద్భవించుచున్నవో! నిజముగ నామె జగన్మాత శ్రీసాతవాహనీదేవి యపరాకృతి యని చెప్పవలెను. ఆమె యెదేనొక వ్యూహము పన్నుచో దాని నెదురొడ్డుటనున దసంభవ మైన విషయము.



తన తండ్రి శ్రీ శివస్వాతి మహారాజు యిరువదెన్మిదేండ్లు రాజ్యముఁ జేసిరన్నచో నదియంతయు నా దేవి మతివిభవము, రాజనీతివేత్తృత్వము, ప్రజ్ఞాశాలిత అనువానిపై నాధారపడి సాగినది. ఆమె సాతకర్ణుల యింట నడుగుమోపిన మేధాదేవిని. ఆమె తనకు కన్నతల్లి యగుటచే తాను ధన్యజీవి. తన తల్లి పుత్రవాత్సల్యమున కవధిలేదు. తన్నింకను పసిబిడ్డనువలె చూచును. తన తండ్రి దివంగతుఁడగునాటి రాజ్యపరిస్థితులను తలచికొన్నచో నిప్పటికి నొడలు జలదరించును. రాజకీయములైన చిక్కులలో మత విషయకములైన యలజడులలో సార్థికములైన బాధలలో రాజ్యము రాజ్యమంతయు ముజ్జిడ్డుగ నుండెను. పరరాజులు తామున్నా మనుచు నిక్కి చూడసాగిరి. బౌద్ధకాపాలిక శైవవైష్ణవ మతములు విజృంభించి వ్యవస్థా విరహితముగ విచ్చలవిడి విహారములు సల్పినవి.





అట్టి క్లిష్టపరిస్థితులలో తాను మహారాజ పదవిని స్వీకరింపగా, నామె తన చతురుపాయనైపుణిచే పరరాజుల పీచ మడచి మత కలహముల రూపుమాపి సర్వమతములను తన చాతుర్యముచే కాపాడిన ధీశాలిని. బౌద్ధస్థూపములను గట్టించినది. అపరిమిత దానము లొసఁగినది. శివాలయముల నిర్మింపఁజేసి, యజ్ఞయాగ ముల నాదరించి వర్ణవ్యవస్థ చెడిపోకుండ కాపాడిన ధర్మసంరక్షకు రాలు. ఆమె సత్యదాన క్షమా హింసా నిరత. శమదమ నియమో పాసన తత్పర. ఆమె మహారాజ పత్ని, మహారాజ మాత, మహారాజ పితామహి! కుమార వాసిష్ఠీపుత్రపులమావికి తన పితామహియెడల నమితగౌరవము. ఆమె తన మనుమనికి నిత్యము శుక్రరాజనీతి, కామందకము, కౌటిల్యుని యర్థశాస్త్రము సంస్కృత ప్రాకృత సాహిత్యములు తానై బోధించును. ఆమె దేవమాతయైన యదితిదేవి వంటిది. ఒకవిధముగ నామె మనస్సన్యాసిని, యోగిని! కేవలము

రాజ్యము, ధర్మ రక్షణము, సంస్కృతీ సంప్రదాయము వేద నాగరకత మొదలగువానిని రక్షించుటకై రాజకార్యముల స్వీకరించిన దంతియకాని, యామె నిరంతర శ్రీదేవీ ధ్యానైకలగ్న మానస.

రాత్రులందు చాల తడవు జగన్మాత ధ్యానమునందు నిమీలితాక్షియై గడపును. మహారాణి వాసిష్ఠీదేవికి అత్తగారనిన సాక్షాత్తు శ్రీశారదాదేవి యపరావతార మనిపించునట! తన పుట్టినింట తలిదండ్రులు చేయని గారాబ మీమె చూపునఁట. ఆ యత్తగారు తమ యింట స్థిరపడిన సాతవాహనీదేవి యఁట! నిజముగ తల్లి యను మాట కామె యర్థభూతురాలు. రాజకీయములం దెట్టి క్లిష్టములైన చిక్కులనైన నామె యెంతో సులువుగ పరిష్కరించును. ఆ పరిష్కారము లవి రాజనీతి గ్రంథములయం దుదాహరణములకై నిక్షిప్తము చేయవలసినంతటి యుత్కృష్టము లైనట్టివి!

తమ పూర్వరాజైన సాతకర్ణి మహారాజు శూరుఁడు. ఆయన హయ గజ రథ గో సువర్ణాది దానము లనేకములు చేసిన మహానుభావుఁడు. ఆయన అగ్న్యాధేయ అనారంభణీయ బగళాదశరాత్రి గర్గత్రిరాత్రి గవామయన అప్తుర్యామ అంగిరసాయన శతాతిరాత్ర అంగిరసత్రి రాత్రాది క్రతువుల నొనర్చిన రాజర్షి. ఆయన భార్య నాగానీక లోకోత్తర గుణశీల సంపదల కాకరమైన చారిత్రము గలది. మాసోపవాసిని. గృహతాపసి. చరిత బ్రహ్మచర్య దీక్షావ్రత, యజ్ఞనిరత. ఆమె తన కుమారుఁడైన వేదశ్రీని సింహాసనమున నిల్పి రాజ్యమును సమర్థవంతముగ పరరాజ భయంకరముగ పరిపాలించిన మహానీతిమతి. తన తల్లి గౌతమీదేవి మరల నా నాగానీక యంతటిది!

ఈ సాతవాహనరాణులు యుద్ధవేళల భైరవీమూర్తులు. ఇతర సమయములందు శారదాస్వరూపిణులు. గౌతమీసాతకర్ణి మహారాజు తమ తల్లిని గూర్చి భావించినకొలది పులకిత సర్వమనశ్శరీరుఁడైపోవుచుండెను. ఆయన తన తల్లి సౌధముల కేగెను. ఆయన సూటిగ గౌతమీదేవి పూజామందిరమునకుఁ బోయెను. అట్టివేళల నా రాజమాత సాతవాహనీదేవి యారాధనలో మునిగియుండును. ఆ విషయము మహారాజునకు సువిదితమైనది.

గౌతమీబాల శ్రీదేవి నిత్యము తెల్లవారు జామున మూఁడు గంటలకే మేల్కొని స్నానాదులఁ బూర్తిగావించుకొని గ్రంథపఠన మొనర్చి దేవీపూజామగ్నమానసురా లగును. ఆ స్థితిలో నామె

యుదయ మెనిమిది గంటలవర కుండును. తదుపఱి నాటి కార్య క్రమ మారంభమగును. ఆమె యేరోజున కారోజు సర్వాంతఃపుర విషయములఁ బర్యవేక్షించికాని విడువదు. శ్రీగుప్తుఁ డామెకు నమ్మినబంటు. ఆతని నామె పుట్టినింటినుండి యరణముగఁ దెచ్చి కొనినది. ఆతఁడు మిక్కిలి వృద్ధుఁడు.

ఆయన గౌతమీదేవి నిప్పటికిని పసిపిల్లయయిన తన స్వామి కూతునువలె ప్రేమించును. నిత్య మామె తన్నాజ్ఞాపించవలె. తా నామె యాజ్ఞలఁ బాలించవలె. అది యతనికి సంతోషము. గౌతమీ బాలశ్రీదేవి ఆయనను తాతా! యని పిలుచును. వాసిష్ఠీదేవియు నట్లే సంబోధించును. రాజభక్తి కాయన ప్రతీకయని చెప్ప వచ్చును.

అట్టి శ్రీగుప్తునిచే రక్షింపఁబడుచున్న నా యంతఃపురము బ్రహ్మదులకైనఁ బ్రవేశించుట కసాధ్య మన్నట్లుండును. ఒక క్రొత్తమొగము కనిపించినఁ జాలును. శ్రీగుప్తుఁడు వానిని పట్టి వేయును. శ్రీగుప్తుని దాటి చను విషయ మచట నుండరాదు. ఆ శ్రీగుప్తుని సహాయముతో రాజమాత కోటలోని సర్వ విష యములఁ బరిశీలించును. శ్రీగుప్తుడు ఖడ్గవిద్యా విశారదుఁడు. మహారాజు చిన్నతనమున నాయనయొద్ద నావిద్యయందలి కొన్ని మెలకువలను నేర్చెను. ఆయన కత్తికెన్ని యంతఃపుర ద్రోహుల తలలుపహారములైనవో దేవిసాతవాహనికే యెఱుక. ఆయననోట నెదైన మాట వెలువడినదన్నచో నామాట కనంతమైన యర్థముండి యుండునన్నమాట!

మహారాజు సూటిగ పూజామందిరమున కేగెను. మందిర ద్వారదేశము నందుండు ద్వారపాలికలు తమ విచ్చుకత్తులను వంచి మహారాజున కభివందనము లాచరించిరి. మందిరములో నుండి యగురు జవ్వాది కర్పూరము గుగ్గిలము కస్తూరి పునుగుల సువాసనలు గుములు గుములుగ ప్రాతర్మందానిల సంచారములతో సయ్యాటలాడుచు తేలివచ్చుచుండెను. ఆ పరిమళములు ఘ్రాణ తర్పణముగ నుండెను. వాని వెన్నంటి సన్నని వీణానాదము తదనుసారికంఠస్వరము నిదమిత్థమని తేల్చరానంతనేర్పుగ గానము వినవచ్చుచుండెను.

సాతవాహనీ రాగమాలపింపఁబడుచుండెను. ఆ రాగము తమ కులదేవతయైన సాతవాహనీదేవిపై తమ పూర్వరాజైన కుంతల సాతకర్ణి కులపాలిక మలయవతీదేవి మనఃప్రీతికై సృష్టించినది.

ఆ రాగము తమ యంతిపురమునందలి కులవధువు లందఱకు నభ్యస్తమై తీరవలయును. నిత్యము తమ మందిరమున నుభయు సంధ్యల నారాగము దేవిసన్నిధానమున నాలపింపవలయును. అది పౌరుషము భక్తి శృంగారములు ప్రధానముగ దీపించు రాగము. ఆ రాగము నాలపించువారీ మూఁడు భావములచే తాడితు లగుచుందురు. గౌతమీదేవి వృద్ధురాలైనను నామె ముఖనిర్గతమైన సంగీతము మాత్రము పరమసుకుమారమై లలితమై కమ్మెచ్చున లాగినట్లు సన్నగ సాగుచు మృదు సంచారము సేయుచు హృదయాం తరములఁ జొచ్చుకొనుచు శ్రోతలఁ బరవశులఁ జేయుచుండును. ఆమె యరువదేండ్లు వయసు కలిగియుండుటచే వృద్ధురాలనవలెఁ గాని చూచుటకామె నలువదేండ్లు దాటని స్త్రీ యనిపించును. ఆమె సౌందర్యము పట్టరానిదిగనుండును. నిత్యయోగాభ్యాస వశమున నామె దేహము సువర్ణశలాకవలె సాగినది. తళుకుచెడని శరీర కాంతి కలది. శివస్వాతి మహారాజామె సౌందర్యమునకు ముగ్ధుఁడై యామెకు తన్నుతాను సర్వాత్మనా సమర్పించుకొనెను. వశీకృత భర్తృచిత్తవృత్తియైన యామె రాజ్యము నేలినది. గౌతమీ బాలశ్రీదేవిని గూర్చి రాజ్యమునందంతట కథలుగఁ జెప్పికొందురు. ఆమె కైక సత్యభామ పాంచాలీ దేవులతో పోల్చదగినస్త్రీ. రాజనీతి యందామె కామెయే సాటి. ఆమెరాజనీతి పండి వెన్నెలలై ప్రస రించి తమరాజ్యము నిత్యకళ్యాణము పచ్చతోరణముగ సాగిపోవు చున్నది.

ఇప్పుడు తిరిగి క్షహరాటులు తలయెత్తినారు. వారిని నిర్జించు టెంతపని! తన మాతృదేవి తలఁచుకొని వ్యూహముఁ బన్నినచో వారీమారు నామమాత్రావశేషులుగాఁ గలరు.

మహారాజు లోని కడుగు పెట్టెను. అచ్చటి దృశ్య మాయన కన్నుల నాగినిల్చినది. నిలువెత్తు సాతవాహనీదేవి రక్తాంబర ధారిణియై రక్తమాల్యముల ధరించి రత్నాభరణములఁదాల్చి శ్వేత రక్తవర్ణపాటలీ పుష్పమాలలఁ బూని భయానకమూర్తియై దర్శన మొసఁగెను. వందదీపకళిక వెల్గులామె శరీరమంతటఁ బర్వు లెత్తుచు కర్పూరాగురు దీపధూపములతో గలసి చిత్రచిత్రముగ గన్పించుచుండెను. తిలకముగ నుంచబడిన మాణిక్యమా వెలు గులు ప్రసరించి యమ్మవారి తృతీయలోచనమను భ్రాంతిని కలి గించుచుండెను, ఆమె సింహవాహని. అష్టభుజ. మకరకుండల కిరీటకేయూరధారిణి. ఆమె శిరముపై నెలవంకగ వజ్రములమర్చ

బడెను. కన్నులుగ వజ్రములు నీలిమణులు కలిపి రచించిరి. ఆమె నేత్రములు మధురమందహాస రోచిస్సుల వెలిగ్రక్కు చుండెను. మందహాస సుందరవదనారవింద. ఆమె శివరంజిని! అసురభంజని!

ఆమెను చూచి గౌతమీపుత్ర శ్రీసాతకర్ణి మహారాజు భక్తి నమ్రుఁడై మనస్సునందే సాష్టాంగ ప్రణామమాచరించెను.

గౌతమీబాలశ్రీదేవి ధవళవసన ధారిణియై నిమీలితనేత్రగ వ్యాఘ్రాజినముపై నాసీనయై, దేవీధ్యానైకబుద్ధిగ సాతవాహనీ రాగ మాలపించుచుండెను. ఆమె కొకింత దూరముగ నామె కెదురై నంత ప్రక్కగ మహారాజ్ఞి వాసిష్ఠీదేవి తానునొక మృగాజినముపై నుపవిష్టయై వీణావాదన మొనర్చుచున్నది. అత్తగారు పాడు చున్నంతసేపామె వీణ వాయించును. ఆగానమావాద్యము రెండు నేకాకృతియై దెవియందు లీనమగుచుండెను. మహారాజు తాను గూడ నొక వ్యాఘ్రాజినముపై నాసీనుఁడై ధ్యానస్థిమితలోచనుఁ డయ్యెను.

కొంతతడవు గడచువరకు రాగమాగిపోయినది. మహారాజ మాత లేచినిలబడి ఘంటమ్రోగించి కర్పూర నీరాజన మెత్తిపట్టి నది - మహారాజును మహారాజ్ఞియు లేచినిలిచిరి. మహారాజు వాసిష్ఠీ దేవివైపుచూచెను. ఆమె చారుహాసిని. విశాలలోచన. ఆమె పసుపు పచ్చని కౌశేయమును ధరించి యెఱ్ఱని పట్టురవికఁదొడిగి స్నాన సిక్తములైన శిరోజముల జారుముడివైచి వానియందు రెండు చేమంతులు తురుముకొన్నది. ఆమెది చామనచాయ వర్ణము. ఆకర్ణాంత విశాలములైన యామెనేత్రములు కజ్జలరేఖలచే మరియు దీర్ఘములై మనోహరముగ నుండెను. పరిమితాభరణములఁ దాల్చి యామె యెల్లప్పుడు నిరాడంబరముగ నుండును. ఆమె వయసున చిన్నదయ్యు నడవడికచే నెల్లరకు మర్యాదా భాజనురాలయ్యెను. ఆమె నలుగురు పుత్రులఁగన్నతల్లి. అత్తగారివలె శలాకాసదృశము గాక నించుక పరిపుష్టిగల యవయవములు కలిగి కంటికి నిండుగ నుండును. గృహిణీలక్షణము లామెయందు సంపూర్ణముగ నధి వసించి యున్నవనిపించును. మహారాజ్ఞినను గర్వమామె కిసు మంతయులేదు. ఆమె యత్తగారికి బిడ్డలకు భర్తకు తానై పరిచ రించును. తన సుగుణసంపదచే నామె తన భర్త మనస్సు నాకట్టు కొన్నది. ఆమె రాజకీయములను పట్టించుకొనదు. ఆమెకు సర్వము భర్త, అత్తగారు, బిడ్డలును.

బహుగ్రంథముల నామె పఠించినది. లలితకళలనిన మిగుల నిష్టము. ఆడపిల్లలన్న మక్కువ. అందువల్లనే పాటలియెడల నామెకొక మమకార మేర్పడినది. వాసిష్ఠీదేవి తనభర్తను నేత్రాంతములనుండి దర్శించెను. ఆహా! యేమిభర్త! గంధర్వకల్పుఁడు! భర్తయనుకొన్నఁ జాలును, జన్మము సార్థకమగును. ఆ మాతాపుత్రులు దేవాంశసంభూతు లనుటలో సందేహము లేదు. తన యదృష్టముకొలది తానీ సాతవాహనుల కులవధువైనది. తన భర్త శ్రీరామచంద్రునివంటివాఁడు. అత్తగారు కౌసల్యాసమాన. తన భాగ్యమే భాగ్యము! గౌతమీదేవి వారిరువురఁగాంచి తన కొడుకు కోడలు శచీ పురందరులవలె నున్నారనుకొనును.

రాజాంతఃపురములలో నధికారమునకై ప్రాణములువెచ్చించువారెందఱులేరు! తనకోడలు వాసిష్ఠి కట్టివేమియుఁ బట్టవు. తన్ను కన్నతల్లికంటె నెక్కుడుగ మన్నించును. తనబిడ్డ సరేసరి. ఎట్టి రాచకార్యమైనను చివరిమాట తనదిగా జరుగవలసినదేగాని తానై స్వతంత్రించి యేమియుఁ జేయఁడు. తాను సర్వసమర్థుఁడైయుండి తల్లి నింత గౌరవముగ మన్నించు బిడ్డను కలిగియుండుటకన్న స్త్రీకి కావలసిన దేముండును? ఆమె తన మనస్సులో నానందించుచుండును. ఆమె కన్నులు మూసికొనెను. ఆమె కన్నుల శివస్వాతి మహారాజాడెను. ఆమె తనలో నిట్లనుకొనెను—స్వామీ! చూచితిరా! మీ బిడ్డలు! వీరిని నాకు సాధ్యమైనంత జాగ్రతగ కాపాడుకొనుచున్నాను. మీరు నాపైనుంచిన బాధ్యతలను శక్తివంచన లేకుండ నిర్వహించుకొనుచున్నా ననుకొనుచున్నాను. ప్రభూ! ఇట్టి రత్నదీపములవంటి బిడ్డల, మనుమల మధ్య నివసించుచున్నాను. నా మనస్సు మీయందే నిలిచి మీ సాన్నిధ్యమును వాంఛించుచున్నది. ఈ చిరవిరహిణిని సాతవాహనీదేవి యనుగ్రహించుటలేదు. స్వామీ! ఆ శుభఘటిక లెన్నటికి వచ్చునో!

మహారాజును వాసిష్ఠీదేవియు గౌతమీబాలశ్రీదేవి పాదములపై నొఱగి నమస్కార మొనర్చిరి. ఆమె కన్నులఁ దుడిచికొని వారిరువుర లేవనెత్తి మూర్ధముల నాఘ్రాణించెను. వాసిష్ఠీదేవి గౌతమీపుత్రునకు పాదాభివందన మొనర్చెను. మహారాజామెను మనస్సునందే యాశీర్వదించెను. గౌతమీదేవి నిర్మాల్యమును కొడుకునకును, కోడలికి నొసగి వారి నొసట కుంకుమ దిద్ది ప్రసాద మిచ్చెను. రాజదంపతులు దేవికిఁ బ్రణమిల్లి ప్రసాదము స్వీకరించి నిలిచిరి. గౌతమీదేవియు ప్రసాదము గైకొనెను. వారు ముప్వురు పూజా

మందిరమును వీడి యొక విశాలమైన చావడిలోనికి వచ్చిరి.

అది గౌతమీదేవి యంతఃపుర సభామందిరము. అంతిపురమునఁ జరుగు సర్వనిర్ణయము లచ్చటనే తీసికొనఁబడును. అంతఃపురము నేరముల నట పరామర్శించి శిక్షలు నిర్ణయింతురు. వీని నన్నింటిని గౌతమీబాలశ్రీదేవియే చూచుకొనును.

అచ్చటనున్న చంద్రకాంతశిలావితర్దికను వారు ముగ్గురధివసించిరి. తల్లి కుమారు లేదో సమాలోచన చేయుదురని తలఁచి వాసిష్ఠీదేవి రాజమాతతో—"అమ్మా! తా మనుగ్రహించుచో సెలవు తీసికొందు" ననెను. గౌతమీదేవి నవ్వుచు—వాసిష్ఠీ వాసిష్ఠి! అంత వినయ మెందుకమ్మా! నేను లోకుల దృష్టిలో నప్రధృష్యురాలను గావచ్చును. బిడ్డవు, నీకు నట్లే కనిపించుచున్నానా తల్లీ!" యనెను.

వాసిష్ఠీదేవి: మన్నింపుడు. మీ యెదలోని యమృతపుటూటలలో తేలియాడు మాకు మీ యంతరంగము తెలియనిదికాదు. అయినను రాచకార్యముల విలువఁ దెలియనిదానను కానుగద.

సాతకర్ణి: అమ్మా! మీ కోడలు చూచితిరా! ఎంత గడుసరిగ మాటాడుచున్నదో! తెలియనిదానివలె నటించుచు నన్నియుఁ దనకుఁ దెలిసిన లక్షణములను బయటపెట్టుచున్నది.

గౌతమి: నాయనా, శ్రీ! అది యామె వినయమునకుఁ దార్కాణము. అంతియకాని యామె కన్నియుఁ దెలియునయ్యా! ఈ నా కోడలు నా కాడపిల్లలు లేని కొఱతలేకుండఁ జేసినదోయీ నాయనా!

సాతకర్ణి: అమ్మగారికి నామీఁదకన్న కోడలిమీఁద....

వాసిష్ఠీదేవి: అత్తగారి కంద ఱొక్కరూపే. ఆమె హృదయమమృతకుల్య!

సాతకర్ణి: మొత్తమున కమ్మగారిని మరపించి యామె మనస్సు నాకట్టుకొనినావు!

వాసిష్ఠి విచిత్రమైన సిగ్గువోయినది. ఆమె యత్తగారి సమక్షమున భర్తతో సాధారణముగ మాటాడదు. నల్గురు కుమారుల తల్లియైగూడ యామె కోటలో క్రొత్తకోడలి తనమునే పాటించును. ఆమె తానై యెవ్వరి నాజ్ఞాపించదు. మహారాజ్ఞీపదవిని చూపింపదు. ఆమెకు తన భర్త సాక్షాత్తు శ్రీరామచంద్రుఁడు. తనయం దనురక్తుఁడు. తన కంతకుమించి కావలయున దేమున్నది? అత్తగారు రూపొందిన తమ కులదేవత సాతవాహనీదేవి! ఆమె చల్లని

యూహలఁబడి సామ్రాజ్యము నిష్కంటకముగ నిరుపద్రవముగ సాగును. ఈ రెండు భావములఁ బోషించుకొనుచు తాను వారల పూజారిణిగ వారి నర్చించుటలో కాలము గడపివేయును.

ఆమెదొక చిత్రమైన ప్రకృతి. లోకములో మానవ స్వభావ మనంతరీతులుగ నుండును. ఒక రధికారము నంతను తామే వహించి యితరుల నాజ్ఞాపించుటలో నానందము ననుభవింతురు. వేరొకరు బాధ్యతయంతయు నితరులపై నిలిపి తమకుఁ గావలసిన యవసరములఁ గూడ వారే తీర్చుచుండగా తాము నిశ్చింతముగ నుండిపోవుదురు. కొందఱకు స్వంత యభిప్రాయము లుండవు. కొందఱు వానిని వెలిబుచ్చరు. కొందఱు సర్వము తామేయై చరింతురు. వాసిష్ఠీదేవి సర్వము తన యత్తగారిపై భర్తపై వదలి నిశ్చింతముగ నుండును. ఇరువురు కలసి యేకసక్కెములాడుచు కిలకిలనవ్వుచు మధురమోహనముగ సంచరించు తీరులు లేవు. మొదటినుండియు నంతియ. అట్లని వారిరువురలో నన్యోన్యత లేదా యనిన నది యపరాధమగును. వాసిష్ఠి కన్నుల నారాధన ఒలికి వచ్చును. గౌతమీపుత్రుని కన్నుల ప్రేమ యుట్టిపడుచుండును.

మహారాజమాత యిట్లనుకొనెను—"వీరిరువురు తీవ్రప్రకృతులు గారు. సాతకర్ణి తన తండ్రి స్వభావమును పుణికిపుచ్చుకొనినాడు. ఆ శివస్వాతి మహారాజు నింతియ. ఆయన మనోభావము లన్నియు కన్నులలో దోబూచు లాడెడివి. వానికి వాగ్రూపమయిన యావిష్కరణము తక్కువ యుండెడిది. తన స్వభావ మట్టిది కాదు. తనది తీవ్రప్రకృతి. తా నేవిషయమునైన భావించుచో దాని యంతు తేలునంతవరకు నిద్రపోలేదు. ఏదైనను ప్రాణమునకుఁ బట్టించుకొని దానిని నిశితనిశితముగఁ బరిశీలించిగాని విడువలేదు. తన పుత్రునికి తండ్రి గుణములు తన యాకారవిశేషము కలసి వచ్చెను. ఈతఁడు తమ యిరువుర బహిరంతర స్వరూపములు గలవాడు. వాసిష్ఠి సర్వవిధముల నీతని కనురూపవతియైన భార్య.

గౌతమీదేవి యోజించుచుండెను. మధ్యాహ్నసమయమును సూచించుచు కోటలోని ఘటికాయంత్రము మ్రోగెను. గౌతమీదేవి ప్రకృతిస్థురాలై—"అమ్మా! వాసిష్ఠీ! నాయనా, శ్రీ! మీరు భోజన శాలకు పొండు. నే నచ్చటికి వత్తు ననెను.

సాతకర్ణి: అమ్మా!

గౌతమి: అవునోయీ నాయనా! నీవు వచ్చెదవని నాకుఁ దెలియును. నేటి రాత్రికి మన సమావేశము జరుగును. ముగ్ధ

దీపుని పై నభియోగము లనంతముగ వచ్చుచున్నవి.

సాతకర్ణి: అమ్మా! మీ మతివిభవము వేయంచుల సుదర్శనము వంటిది. మీ దృక్కులు నిశితనిశితములై దేవి శ్రీసాతవాహని ముమ్మొనవాలువలె హృదయముల భేదించుకొనుచు రహస్యముల వెలికి లాగునమ్మా!

గౌతమీదేవి: నాయనా! మీ తండ్రిగారి సాహచర్యమున నేర్చిన దెంతయున్న దందువు! ఇప్పుడు ప్రయోగించుచున్నా నంతియ. ఆయన నేత్రాంతములనుండి సాగు నాజ్ఞాకదంబముల వెంబడి నా మనస్సును పరువులెత్తించి వాని నన్నిఁటి నుచితరీతిని సంబాళించుకొనుట నాకు మిక్కిలి కష్టతరముగ నుండెడిది. కాని చిరతరాభ్యాసమున నట్టిది వశమైనది.

వాసిష్ఠీ గౌతమీపుత్రు లిరువురు కలసి మహారాజమాతకు నమస్కరించి వెడలిపోయిరి. పోవుచున్న వా రిరువురను జూచి గౌతమీదేవి యిట్లు భావించెను—వీరు శ్రీ శివస్వాతి మహారాజు కొడుకు కోడలును. వారిని కనిపెట్టి యుండవలసిన బాధ్యత తనపై నున్నది. వారి రాజ్యమును శత్రురహితముగ పరరాజ భయంకరముగఁ దీర్చి దిద్దవలసిన భారము తనపై బడినది. వారి వంశ మవిచ్ఛిన్నముగ రాజ్యము కొనసాగించ గలిగినట్లుగ రాజ్యమును కట్టుదిట్టములో నుంచవలసిన యవసర మెంతేని యున్నది. సర్వ భారతమున నాంధ్రసాతవాహన రాజ్యమన్న గుండె దిగులుగ నుండు నట్లు తమ సామ్రాజ్యమును నిర్మించవలెను. నిన్న మొన్నట చంద్రగుప్త మౌర్యుఁడు మౌర్య సామ్రాజ్యమునట్లు పాలించెను.

ఇప్పటికి మౌర్య సామ్రాజ్యము తరువాత మరల నంతటి ప్రాభవము సాతవాహనులదనియే చెప్పవలయును. తమకు ప్రాకారావృత నగరములు ముప్పది యున్నవి. వేంగీనగరము తన సైనిక నికాయమునకు జలదుర్గము. గోదావరీదేవి తమ్ము కన్నతల్లి. ఆమె తమ్మెల్లప్పుడు చల్లగ వీక్షించుచుండును. కృష్ణవేణి తమ కుల దేవతయే. పిధుండనగరమున్నది. విజయపురి యున్నది. అంధక పురియుఁ గలదు. ఇవి యన్నియు మిగుల పటిష్ఠములై శత్రువులకు తేరిపాఱ జూచుటకైన వీలుగాకుండ నుండును. క్షహరాటుల జయించినగాని తమ పూర్వరాజులు జయించి కోల్పోయిన భూభాగములను తిరిగి పొందినగాని తనకు మనశ్శాంతి యనునదిలేదు.

పాటలీపుత్రము తమనుండి చ్యుతమైనది. ఇంకను కొన్ని నగరములు తమ పూర్వులచే నేలబడి మరల జారిపోయిన వున్నవి.

వాని నన్నింటిని తన బిడ్డ తిరిగి పొందవలె. మగధ మహారాష్ట్రములు తమ వశమైనఁ గాని తనకు నిద్రపట్టదు. ఉజ్జయినిశకుల జయించి తన ప్రథమ కర్తవ్యమును నెఱవేర్చినది. సాతవాహన ప్రభువులు మగధ ఉజ్జయిని కళింగ కుంతలముల కధిపతులై వెలసిరి. దక్షిణాపథ చక్రవర్తులై యుత్తరాపథమునఁగూడ పెక్కు రాజ్యములు తిరిగి తాము జయించవలయును. తన పుత్రుఁడు రాజ రాజుగావలెను. చక్రవర్తియై తీరవలెను. సాతవాహన సామ్రాజ్యేతి హాసమున గౌతమీపుత్రుఁ డక్షరుఁడై యమరుఁడై నిలుచును!

తాను తన పుత్రుని పశ్చిమమునకుఁ బంపును. తన తనయుఁడు త్రిసముద్రపీతతోయవాహనుఁడగును. అపరాజిత విజయకేతనుఁడు కావలయును. దేవి ప్రసన్నురాలగుచో వీని నన్నిఁటిని తానొక్కతెయే నిర్వహించగలదు. గౌతమీదేవి వామ నేత్రము స్పందించినది. అమ్మ ముందున్న గంటపై పుష్పమొకటి పడి యది ధ్వనించెను. గౌతమీదేవి యానంద తరంగిత హృదయయై దేవీ మందిరములోనికేగి యమ్మవారి ముందు సాగిలపడి మ్రొక్కి—"తల్లీ! సాతవాహనీ దేవీ! గౌతముఁడు నీ బిడ్డ. నీవు వేదమయివి. వేదమార్గముల నీ యార్షధర్మము నుద్ధరింపఁదలచినచో నీ యీ బిడ్డ యందులకు సాధనము కాఁగలఁడు. వానిని దీవించుమమ్మా! వానికి జయముఁ జేకూర్చుము తల్లీ! యవనదుష్టమై పరభాషా సంప్రదాయ దూషితమై, వైదేశికాచార నాగరకతా విశృంఖలమై, ధర్మబాహిరమై, చనుచున్న యీ భారతమును నీవే దయచూడవలె నమ్మా! నీ కంటివెలులు చల్లనై వెల్లనై మల్లెలు పూచినచో నీ బిడ్డ నీకు వైదేశికాసుర రక్తధారల నభిషేక మొనర్చునమ్మా! యవన సైనిక శిరములతో రుండమాలలు సమర్పించును. సత్సంప్రదాయ దూరులైన వైరిరాజ మహిషముల నీకుఁ గానుకలొసఁగును తల్లీ! పూర్వసాతవాహనులపై నీవు గురిసిన యమృత జ్యోత్స్నల నీ గౌత మునిపైఁగూడ వర్షింపుమమ్మా! భారతదేశమున నుత్తరాపథ దక్షిణా పథ ద్రవిడ దేశములను మూఁడు భాగముల నొక్కఁడై యేలిన ఘనత మహాభారత కథానాయకుఁడైన యుధిష్ఠిరునికే దక్కినది. తరువాత సాతవాహనులకే దక్కినది. కాని కాలవైపరీత్యమున కొన్ని భాగములు చ్యుతములైనవి. మరల వానిని సముద్ధరించు భారము నీవు వహింపవలెను. లోకమాతా! ఏ నీ యమృతస్యందు లైన యపాంగ వీక్షణము లాంధ్ర సామ్రాజ్య స్థాపకుఁడైన సిముకునిపై బ్రసరించినవో, శ్రీ సాతకర్ణి మహారాజును శూరశ్రేష్ఠునిగఁ దీర్చి

దిద్దినవో, సాతవాహన ప్రభువుచే పాటలీపుత్రమును వశపరచుకొనఁ గల్గునట్లు జేసినవో, కుంతల సాతకర్ణిని భరుకచ్ఛాధిపతిగ నిల్పినవో, హాలసాతవాహనుని సాహిత్య సామ్రాజ్యసామ్రాట్టుగ పేర్కొనునట్లు చేయించినవో, ఆ నీ యమృతమయములైన కటాక్ష వీక్షణముల నీ గౌతమీ పుత్రునిపైఁగూడఁ బ్రసరింపఁజేసి ధర్మ సంస్థాపనమునకు కారణ భూతురాలవుగమ్ము జగజ్జననీ !" యిట్లనుచు గౌతమీదేవి దేవి పాదపీఠిపై తన శిరమునుజేర్చి నమస్కరించెను. ఆమె వంచియున్న శిరస్సుపై నమ్మవారి మెడలోని హారమునుండి రెండు పాటలీ పుష్పములు జారిపడెను. గౌతమీదేవి పులకిత సర్వతనువై— "అమ్మా ! నాయందు ప్రసన్నురాలవైతివా ? పాటలీ కుసుమముల నిచ్చి కర్తవ్యమును సూచించితివా తల్లీ ! నేడే నీ యాజ్ఞ నమలు జరిపెదను" అనెను. గౌతమీదేవి యా పుష్పములను కన్నుల కద్దుకొని వానిని తీసికొని దేవమందిరమునుండి వినిర్గమించెను.

భోజనశాలలో రాజదంపతులు తనకొఱకు వేచియున్నారు. సమయ మతీతమగుచున్నది. గౌతమీదేవి సువర్ణపల్యంకికము నధిరోహించి పరిచారికాగణము వెంటరా భోజనాగారమునకు వచ్చెను. వచ్చిన యామె వదనమున విరిసిన నవమల్లికా సహస్రములఁజూచి రాజదంపతు లాశ్చర్యానందములఁజెందిరి. రాజమాతకు వారిర్వురు పాదాభివందన మొనర్చిరి. ఆమె వారికిర్వురకు చెరియొక పాటలీ కుసుమము నిచ్చెను. వారు వానిని కన్నుల కద్దుకొని శిరస్సుల ధరించిరి. మహారాజు తమ తల్లి కనులఁ దిలకించి సర్వము నెఱిఁగిన వాడై యానందించెను. నాడు వారందఱు సంతృప్త మానసులై భోజనముల ముగించిరి.

నాటిరాత్రి రాజమాత రహస్య భూగృహమున వారు ముప్వురును సమావేశమైరి. రాజమాత, మహారాజు, వార్తావహుఁడు. అచ్చట ముప్వురు పరిచారికలునుండిరి. రాజమాత వారల నిషేధించలేదు. వారలలో నొక్కతె పరధ్యానమును నటించుచు వారు మాటాడున దంతయు శ్రద్ధగ వినుచుండెను. అమె పేరు వాసుకి. అమె యంతః పురమునఁ బ్రవేశించి రెండేండ్లయినది.

మహారాజు : వార్తావహా ! నీవు చెప్పదలఁచుకొనిన దానిని చెప్పవచ్చును.

వార్తావహుఁడు : మహారాజా ! ముగ్ధదీపుని గూర్చి పలువిధము లైన వార్తలు వచ్చుచున్నవి. శత్రుగూఢచార వర్గముతో నీతనికి సంబంధమున్నదఁట. వారలతో నీతఁడు మంతనము లాడుచున్నాడు.

గౌతమీదేవి : ఓయీ ! నీవు చూచితివా ?

వార్తావహుఁడు : లేదు. శ్రీగుప్తుల వారన్నారు.

గౌతమీదేవి : ఎవరితో ?

వార్తావహుఁడు : ఎవరితోనో నాకుఁ దెలియదు. కోటలో నందఱు చెప్పుకొనుచున్నారు.

గౌతమీదేవి : నీ కెవరు చెప్పిరి ?

వార్తావహుఁడు : ఎల్లరను కొనుచుండగ నేను విన్నాను.

గౌతమీదేవి : మూర్ఖుఁడా ! విషయమును వివరముగఁ దెలిసికొన కుండ నీ యల్లరియేమి ? నీవు పొమ్ము. మేము శ్రీగుప్తులఁ బిలిపించి విచారింతుము.

వార్తావహుఁడు వెడలిపోయెను.

గౌతమీదేవి : నాయనా శ్రీ ! ఈ ముగ్ధదీపుని విషయ మేమి చేయఁదలఁచితివి ?

మహారాజు : అమ్మా ! మీరాలోచించలేదా ?

గౌతమీదేవి : అదికాదయ్యా ! ఆ పిల్లవాఁడు పరమాశ్చర్య ముగ నున్నాడే ! వాడంతయుఁజేరి పదునాఱేండ్లయిన గడచినట్లు లేదు. అప్పుడే యాతనికిన్ని రాజకీయములా ?

మహారాజు : నాకు నదియే వింతగ నున్నది. బాలుఁడయ్యు నాతఁడా దినమున నెన్నివిద్యలఁ బ్రదర్శించినాడు ! అతఁ డేదేశము వాఁడో ! అమ్మా ! అతని నేమిచేసిన బాగుండునందురు ? గౌతమీ దేవి నవ్వి—ఓయి మహారాజా! "నామాట నాకే యొప్పఁజెప్పెదవేమి ? శ్రీగుప్తునిఁ బిలిపించి కలరూపెఱిఁగి యాతనిపై నభియోగములు నిజములని రుజువైనచో సభకుఁ బిల్వనంపి నేరమును విచారించి శిక్షింపవలెగద !" అనెను.

మహారాజు : అమ్మా ! ఈ బాలుఁడు ద్రోహబుద్ధి యనుకొన లేకున్నాను. అతఁడు శత్రుగూఢచారులతో మంతనములాడు నంతటి సాహసికుఁడు కాగలఁడా ?

గౌతమీదేవి : అట్లందువేమయ్యా ! శత్రువులుపన్ను నురులలో నిది యొక రకము. పసివారి నుపయోగించి వారియందు ప్రేమ పుట్టినంతనె ద్రోహము చేయించుట. నా యభిప్రాయమున నీ కుఱ్ఱ వాని నెవరో సంవత్సరములుగ విద్యలయం దుత్తీర్ణునిఁ గావించి మనదేశముపైఁ బ్రయోగించియుందురు. ఆ బాలుని వారేరినందు లకు వారిని మెచ్చుకొనవలయును. అంత జనముద్దయినవాని నెన్ను కొనినచో ప్రజలు వాని నభిమానింతురు. వాఁడు ఖడ్గవిద్యావేత్త.

విలువిద్యయందారితేరినవాఁడు. అశ్వారోహణ చతురుఁడు. ఇఁక జనులు వానియం దనురాగ బద్ధులైనచో నాశ్చర్య మేముండును ? అతఁడు తన తెలివితేటలతో మన రాజ్యము నందలి రహస్యముల సేకరించి తమ రాజ్యమునకుఁ జేరవేయుటలో సందేహముండునా !

మహారాజు : మీరన్నది యథార్థము. అతఁడు సామాన్య బాలుఁడు కాఁడు. ప్రత్యేకముగ శిక్షణ పొందినవాఁడు. అతని విషయముఁ దేల్చవలసినదే.

గౌతమీదేవి : రేపే సభతీర్చి ముగ్ధదీపునిపై నభియోగములను విచారణసేయుము. మహామంత్రుల తీర్పు ననుసరించి వాని కేశిక్ష విధించవలయునో యోజింపుము. ఇట్టి వ్యవహారములలో జాప్యము కూడదు. 'అలస్యాదమృతం విష'మన్నారు.

భూగృహమునందలి తైలదీపపు మందరశ్మిలలో మహారాజు గౌతమీదేవి కన్నులలోని యింగితమును గ్రహించెను.

దీపవర్తిక నెగసన త్రోయు నెపమున వచ్చిన వాసుకి చేయిజారి యటుబల్లపై నుంచిన కాచపాత్ర పడిపోయి చప్పుడయినది. వాసుకి తడబడుచు పరువెత్తెను. మిగిలిన యిర్వురు పరిచారికలు పాత్ర నెత్తిపెట్టిరి. గౌతమీదేవి నవ్వెను. ఆమె నవ్వులో నెన్నో యర్థములు భాసించినవి సాతకర్ణి మహారాజునకు. తల్లి కొమారు లిరువురు తమ తమ మందిరములకుఁ జనిరి.

బయటనంతయు నిశ్శబ్దము, చీకటి. ఆ చీఁకటిలో వాసుకి కన్నులు మిలమిల మెఱయుచుండెను.

"స్వాధీన ప్రియదయితః దీనోఽపిచ మన్యతే కృతార్థం స్వం
ప్రియరహితః పునరవనీమపి సంప్రాప్యాస్తి దుర్గతో హ్యేవ."

అతఁడు స్వాధీనప్రియ భార్యుఁడు. అనగా అతనిభార్య అతనికి స్వాధీనురాలు. అతఁడు భార్య తనవద్ద లేకపోయినను తాను కృతార్థుఁడ ననుకొనుచున్నాఁడు. అతనికి రాజ్యము సంప్రాప్తించినను అతఁడు దుర్గతుఁడే!

ఓయీ! శ్రీగుప్తా! నీవు ముగ్ధదీపుని గూర్చియనిన మాట లన్నియు యథార్థములేనా? వాని నట్లని రుజువు పరచగలవా?

శ్రీగుప్తుఁడు: చిత్తము.

శ్యామికుఁడు: అతఁడొనర్చిన నేరములేమి?

శ్రీగుప్తుఁడు: అతని చేతలన్నియు ననుమానాస్పదములుగనే యున్నవి. రాత్రి మూఁడవ జామున మునిమాపువేళ నాతఁడు శత్రు రహస్య స్థావరములకేగి చాలతడవచ్చట గడపివచ్చుచున్నాఁడు. ఎవరో క్రొత్తవ్యక్తితో కలిసి తిరుగుట వానితో సంభాషించుట చూచితిని. మనకోటలోని యొక రహస్య విషయము దేశముదాటి చనినదా యన్న యనుమానమునకు ముగ్ధదీపుఁడే హేతువనిపించుచున్నది.

శ్యామికుఁడు: నీవిచ్చట నెంతకాలముగ నివసించుచున్నావు?

శ్రీగుప్తుఁడు: నలువదేండ్లు గడచి యుండవచ్చును.

శ్యామికుఁడు: నీ వృత్తియేమి?

శ్రీగుప్తుఁడు: సర్వ రాజాంతఃపుర ప్రధాన పర్యవేక్షకుఁడను.

శ్యామికుఁడు: మరి నీకు ముగ్ధదీపుఁడు తెలియునా? అతనితో నీకేమైన పరిచయమున్నదా?

శ్రీగుప్తుఁడు: పెద్ద పరిచయములేదు. కాని నేనాతని నొక కంట కనిపెట్టియున్నాను.

శ్యామికుఁడు: నీవీసంగతి మహారాజ మాతతో చెప్పలేదా?

శ్రీగుప్తుఁడు: ఎందుకు చెప్పలేదు, విన్నవించితిని. ఆ మహాదేవియే నన్నాతనిఁ గనిపెట్టి యుండుమని యాదేశించినారు.

శ్యామికుఁడు: నీకు శత్రుస్థావరము లెచ్చట నున్నవో

తెలియునా ?

శ్రీగుప్తుఁడు : అవి చెప్పరాదు.

శ్యామికుఁడు : ముగ్ధదీపుఁడెచ్చట నుండును ?

శ్రీగుప్తుఁడు : కోటలోని యుత్తరపు భాగమున సైనిక నివేశ నములలో నైదవ వరుసలోని యెనిమిదవ గృహమునందుండును.

శ్యామికుఁడు : మహాప్రభూ! ముగ్ధదీపుని పిలిపించవల యును. అతఁడు వచ్చినచో విచారించవచ్చును.

మహారాజచ్చట నున్నయొక సైనికునివైపుచూచెను. అతఁడు మహారాజునకు నమస్కరించి వెడలిపోయెను.

అది మహారాజు శ్రీ గౌతమీపుత్ర సాతకర్ణి సభాభవనము. అందు నాలుగైదు వందలమంది కూర్చుండుటకు వీలున్నది. నిత్య మచ్చట నేరముల విచారించుట, శిక్షలు విధించుట, నగరము నందలి సామాన్య జనులయొక్క యభియోగముల నన్నింటిఁ బరి శీలించి న్యాయముఁ జేకూర్చుట అచ్చటనే జరుగుచుండును. నేరమునందలి క్రౌర్యము ననుసరించి శిక్షావిధిసైతము క్రూరముగ నుండును. రాజద్రోహ నేరముల విషయమున నిశిక్షలు మరియు క్రూరములుగనుండును. రాజద్రోహుల కురిశిక్ష సామాన్యమైనది. శూలారోపణము, చిత్రవధ, శిరశ్ఛేదము, ఉప్పుపాతరలో పూడ్చి పెట్టుట, సజీవదహనము, కాళ్ళుచేతులుఁగట్టి నదీగర్భమున విడిచి పుచ్చుట మొదలైన శిక్షలుండును. అట్టి శిక్షలు విధింపఁబడిన నేర గాండ్రను డప్పులు మ్రోగించుచు నగరము నందలి కూడలి స్థానముల నన్నిఁట నిలబెట్టి బిగ్గరగ వాని ద్రోహమును వివరించి శిక్షను చాటి తీసికొనిపోవుచుందురు. శ్మశానమున నీ శిక్షల కమలు జరుగును.

సామాన్యములైన నేరములకు కశాఘాతములు కారాగారము జరిమానా విధించుటయు జరుగును. సాతవాహన రాజులు పరిపాలన యందు శిక్షాతీవ్రులని చెప్పవచ్చును. అంత తీవ్రత నవలంబించ నిచో వారి రాజ్య విస్తరణ జరిగెడిదేకాదు. వారెంతటి రాజనీతిజ్ఞులో యంతటి ధర్మ సంరక్షణ బుద్ధులు. వారిది కౌటిల్యానీతి. చాణ క్యుఁడు మౌర్యసామ్రాజ్యమున నెఱపిన నీతినే వీరు తమ రాజ్యమునఁ బ్రవేశపెట్టిరి సాధారణముగ నెట్టి నేరములకును తావే యుండదు. ఎప్పుడైన నట్టివి జరిగినచో వాని ఫలితముగూడ నంత విపరీతముగనే యుండును.

గౌతమీపుత్ర సాతకర్ణి అపరిమిత దయాపరుఁడు. ఆయన

మరణశిక్షను సహించలేడు. కాని రాజనీతికిఁ దలయొగ్గవలసినదే. గౌతమీదేవి నేరగాండ్రను తీవ్రముగ దండించవలెనననును. లేనిచో వారి కిట్టినేరము లసంఖ్యములుగ జరుగనిచ్చుట కవకాశమిచ్చుటగునననును.

ముగ్ధదీపుఁడు సభాభవనమునకుఁ గొనిరాబడెను. అతడు భయముచే వడకిపోవుచుండెను. అతని వదనము కళాహీనముగ నుండెను. అతనిఁ జూడగనే సభాస్తారులందఱకు జాలికలిగెను. ఇంత పసివాని కింతటి నేరముఁజేయు సామర్థ్యముండునా! ఏదో కుతంత్రము జరిగియుండును. కిట్టనివారెవరో యీతనిపై నేరారోపణ మొనర్చియుందురు. కానిచో నింతటి జనప్రియుఁడయిన బిడ్డ రాజద్రోహ మొనర్చునా? అసలామాటకాతని కర్థము తెలియునాయని! జనులిట్లనుకొను చుండగా మహామంత్రి ముగ్ధదీపుని ప్రశ్నపరంపరలచే నూపిరాడకుండఁ జేయుచుండెను. దైన్యము రూపుగొన్నట్లు ముగ్ధదీపుఁడు నిలిచియుండెను. అంతటి మహారాజసభలో నెత్తయి సర్వజనులకుఁ గన్పించురీతిని నిలబెట్టఁబడిన ముగ్ధదీపునికా సభను చూడగనే చిఱుకంపమొదవెను. ఆ సభయందాతఁ డెవ్వరికోసమో యన్వేషించెను. అతని కన్నుల నిరాశ తాండవించెను.

శ్యామికుఁడు : ఓయీ! నేరస్తుఁడా! నీపేరేమి?

ముగ్ధదీపుఁడు : ముగ్ధదీపుఁడు.

శ్యామికుఁడు : నీమీద నభియోగములున్నవి. నీవు వానికి సమాధానములు చెప్పుకోవలసి యున్నది.

ముగ్ధదీపుఁడు : అవి యెట్టివో తెలిసినఁగద నా సమాధానములు.

శ్యామికుఁడు : ఓయీ! ముగ్ధదీపా! నీవు ప్రతిదినము చీఁకటిపడు వేళ కృష్ణాతీరమువెంట చాలదూరము పోయి వచ్చుచుందువుగద!

ముగ్ధదీపుఁడు : ఔను. పోయి వచ్చుచుందును.

శ్యామికుఁడు : అచ్చట నెవరున్నారు?

ముగ్ధదీపుఁడు : నా స్నేహితులు.

శ్యామికుఁడు : వారెవరు? వారి పేళ్ళేమి? వారెచ్చటివారు? తెలుపగలవా?

ముగ్ధదీపుఁడు మాటాడలేదు.

శ్యామికుఁడు : మాటాడవేమి? పోనిమ్మా సఁగతి చెప్పుము.

నీకు వానుకి తెలియునా ?

ముగ్ధదీపుఁడు : తెలియును.

శ్యామికుఁడు : నీ దేయూరు ?

ముగ్ధదీపుఁడు : అకరావంతి.

శ్యామికుఁడు : నీవిచ్చటికేల వచ్చితివి ?

ముగ్ధదీపుఁడు : బ్రతుకుతెరువు నన్వేషించుటకు.

శ్యామికుఁడు : నీవింత చిన్నవాఁడవు. నీకెవరును పెద్దవారు లేరా ?

ముగ్ధదీపుఁడు : లేరు.

శ్యామికుఁడు : నీ వీ విద్యల నెచ్చట నేర్చితివి ?

ముగ్ధదీపుఁడు : మా దేశమున సైనికులఁజూచి నేర్చుకొంటిని.

శ్యామికుఁడు : నీకంతటి నేర్పున్నదా! శత్రుస్థావరములకు పోయివచ్చుచుండుటలో నీ తాత్పర్యమేమి ?

ముగ్ధదీపుఁడు : నేనుపోలేదు.

శ్యామికుఁడు : నీవట్లు పోయివత్తువని పలువురతో నంటివఁట గదా ?

ముగ్ధదీపుఁడు : నే నట్లెవరితో ననలేదు. కృష్ణాతటమునఁబడి పోవుచున్నాననినాను.

అంతలో శ్రీగుప్తుఁడొక లేఖతీసి మహామంత్రి కీయగా నాయన దానిని చూపి ముగ్ధదీపుని—"ఓయీ ఈ లేఖ విషయమేమి?" యని యడిగెను.

ముగ్ధదీపుఁడు మాటాడలేదు.

మహామంత్రి దాని నిట్లు చదివెను—శ్రీశ్రీశ్రీ రాజమహారాజ క్షహరాటవంశ రాకాసుధాకర శిశునంది మహారాజ పరమేశ్వరుల చరణ సన్నిధికి. నేనిచ్చట నన్నియుఁ దెలిసికొంటిని. ఇచ్చటి మనవారెల్లరు నప్రమత్తులై కార్యముల నిర్వహించుచున్నారు. మమ్ముల నెవ్వరనుమానించుటలేదు. సమయ మనుకూలము గనే యున్నది. మీ యాజ్ఞా బద్ధుఁడను. ఇచ్చటి వారెల్లరు నా విద్యకు నివాళులెత్తుచున్నారు.

ఇంతే,

మీ నమ్మినబంటు

ముగ్ధదీపుఁడు

శ్యామికుఁడు : ఏమోయీ ! దీనికేమందువు ?

ముగ్ధదీపుఁడు : నాకేమియుఁ దెలియదు. ఆశ్చర్యముగ నున్నది !

శ్యామికుఁడు : పోనిమ్ము. ఈ వ్రాత నీదేనా ?

ముగ్ధదీపుఁడా లేఖను గైకొని పరిశీలించి—“అవును, నా వ్రాత వలెనే యున్నది. కాని నేను వ్రాయలేద”నెను.

జనులీ విచిత్రమును ఆశ్చర్య మనస్కులై చూచుచుండిరి. వారి కదియంతయు నయోమయముగ నున్నది. చివరకు పాపమీ ముగ్ధదీపు నేమి చేయుదురో ! వారందఱూపిరి బిగబట్టి తీర్పునకై వ్యగ్రులై చూడసాగిరి.

మహామంత్రి తీర్పునిట్లు చదివెను.

ముగ్ధదీపుడు తానుగ నొప్పుకొనిన విషయములను, ఈ లేఖను పోల్చి చూచిన నీతఁడు వైదేశిక గూఢచారియని స్పష్టపడు చున్నది. ఇంతటి పిన్నవయసుననే యింతటి సాహసోపేతమగు కార్యములఁ జేయఁబూనిన యీతఁడు మిగుల ప్రమాదకారి కాగలఁడు. ఎన్నివిధముల నాలోచించినను ఈతఁడు రాజద్రోహి యనక తప్పుటలేదు. ప్రభువులేమందురో !

మహారాజు : ఈతనికి విధించు శిక్షాస్వరూప మెట్లుండవలెను ?

శ్యామికుఁడు : ప్రభూ ! రాజద్రోహమునకు మరణశిక్షయే సరియైనది. కాని, నేరస్తుడు చాల పిన్నవయసువాఁడు. పెద్దవారి ప్రేరణచే బాల్య చాపల్యమున నిట్లు చేసియుండును. ఈతనికి మరణశిక్ష విధించుటన్న హాస్యాస్పదముగ నుండు ననిపించు చున్నది. కావున నీతనికి దేశబహిష్కారము తగినదనుకొను చున్నాను.

మహారాజు : నిజము. మీరు చెప్పినది చాల యుక్తముగ నున్నది.

మహామంత్రి : రాజద్రోహియైన ముగ్ధదీపుఁడు సాతవాహన సామ్రాజ్యమునుండి నిర్వాసితుఁడు గావింపఁ బడుచున్నాడు. ఈ సామ్రాజ్యమున నెచ్చటనైన నీతఁడు కన్పించిన శిక్షింపఁబడగలఁడు. నేటినుండి నాలుగు దినములలో నీతఁడు ధాన్యకటకమును వదలిపెట్టవలసినదిగా మహారాజశ్రీ గౌతమీపుత్ర సాతకర్ణి యాజ్ఞాపించుచున్నారు.

మహామంత్రి రాజాజ్ఞను ముమ్మారు చదివెను. మహారాజు దానిని తానొకమారు చదివి తన రాజముద్రిక నా యాజ్ఞాపత్రముపై

ముద్రించిరి.

నాటి సభ ముగిసినది. మహారాజు వెడలిపోయెను.

సభయందెల్లరు పలురకములుగ వ్యాఖ్యానించుచు గుస గుసలు వోవుచుండిరి. ముగ్ధదీపుఁడు తలవంచుకొని బుగ్గలపై కన్నీరు గారుచుండగా నిర్వురు సైనికులవెంట కోటలోనికిఁ బోయెను.

ముగ్ధదీపునికి దేశ బహిష్కారము విధించఁబడినదను వార్త నిముసములపై రాజధాని నగరమందంతట గుప్పుమన్నది. ధాన్య కటకమునందు ముగ్ధదీపుఁడన్న తెలియనివారెవ్వరు లేరు. అందఱు నే కొంతయో విచారించినవారే. ఈ నాలుగు దినములలో నెన్నియో చమత్కారములు జరిగినవి.

ఒకనాటి సాయంవేళ ముగ్ధదీపుఁడు కృష్ణాతటమున వాహ్యాళి కేగిన సమయమున నాతనికొకవ్యక్తి కనిపించెను. ఆతనిఁజూచి ముగ్ధ దీపుఁ డెవరవని యడుగగా నాతఁడిట్లనెను—"ఓయీ! ముగ్ధదీపా! నేను నిన్ను వసంతోత్సవములనుండి చూచుచున్నాను. నీవు మన దేశమునకు సంబంధించినవాడ వనుకొనలేదు. నా వెంట రమ్ము. మన క్షహరాట గూఢచారులున్న స్థావరములకుఁ దీసికొని పోయె దను. అచ్చట మనవారెల్లరకు నిన్ను పరిచయమొనర్తును. ఈ సాతవాహనుఁడు నిన్ను బహిష్కరించెనుగదా. నేను మా నాయ కునితో చెప్పి నీకు మన మహారాజు కొలువులో నుద్యోగము కుదురు నట్లు జాబు వ్రాయించి పెట్టెదను." ముగ్ధదీపుఁ డాతనివెంట నతని స్థావరమునకుఁ బోయెను.

శిశునంది మహారాజునకు ముగ్ధదీపుఁడు పరిచయ పత్రమును సంపాదించెను. శిక్ష విధింపఁబడిన తరువాత నాడు మూఁడవ దినము. ముగ్ధదీపుఁ డానాడెల్ల ధాన్యకటక నగరమునం దంతటను తెగదిరిగెను. ఆతనికా నగరమును వదలిపెట్టుటకు చాల కష్టముగ నుండెను. నాటిరాత్రి పాటలి, మహారాజమాత, మహారాజ్ఞి వాసిష్ఠి దేవుల మందిరములకుఁబోయి సెలవుగైకొనెను. నాల్గవనాడు ప్రొద్దు గ్రుంకు వేళ ముగ్ధదీపుఁడు ధాన్యకటక మహానగరమును వీడి విజయవాటికాభిముఖుఁడై చనెను.

నాటి రాత్రి కనకదుర్గా దేవ్యాలయమున నిద్రించి తెల్లవారి మరల బయలుదేరెను. ముగ్ధదీపుఁడు మహారాజదత్తమయిన యుత్తమాశ్వము నెక్కి ప్రయాణము సాగించుచుండెను. తనవద్ద చంద్రహాసము విల్లునమ్ములు నున్నవి. తన పోవు త్రోవల జనులు

తన్ను నివ్వెరపటి చూచుచున్నారు. తొలఁగి చనువారు, ఇతఁడే రాజద్రోహి ముగ్దదీపుఁడను వారు నీసడించు వారలుగ నుండిరి, ముగ్దదీపుని కిట్టివన్నియు మనస్సంక్షోభకారులయ్యె నాతఁడు మనస్సున నొకవిధమైన యానందము ననుభవించుచుండెను. అతఁడు విధివిరామములేకుండ పయనము సాగించుచుండెను. విశ్రాంతి కావలెననిపించినచోట నిద్రించుట లేనిచో పయనించు టలుగ నుండెను. బాటయంతయు నరణ్యమయము. వన్యమృగ సంకులము. ముగ్దదీపునికి మార్గములు తెలియవు. తోచినరీతిగ తనకు స్ఫురించిన మార్గము ననుసరించి పోవుచుండెను.

తనయొద్ద రెండువందల కార్షాపణములున్నవి. ఇరువది ప్రతీకలున్నవి. కానీ తాను వానితో చేయునదేమి? మార్గములో తన్నందఱు రాజద్రోహిగఁ జూతురు. తన గోడెవ్వరును వినిపించు కొనరు. దేవాయతనములలో మాత్రము తన్ను రాజపురుషునివలె నాదరించుచున్నారు. కారణమనూహ్యముగ నున్నది. పదునైదు దినములిట్లు ప్రయాణము చేయుటైనది. సాతవాహన సామ్రాజ్య మునకు క్షహరాటరాజ్యమునకు సరిహద్దు దగ్గఱపడెను. ముగ్దదీపుఁడు గోదావరీ తీరారణ్యభూములఁ గడచిపోవుచుండెను. ఆ యరణ్య ప్రాంతమంతయు సాంద్రమై యెండ చొరరానంత భీతావహముగ నుండెను.

ఆ ప్రయాణములో నొక చిత్రము జరిగెను. ముగ్దదీపుఁడు దీర్ఘదీర్ఘమయిన దూరములు పయనించుట వలని యలసటచే తన యశ్వమును నీళ్లకు వదలి తాను నొక వృక్షచ్ఛాయయందు విశ్రాంతి తీసుకొనుచుండెను. అంతలో నెచ్చటినుండియో పదుగురాశ్వికులు వచ్చిరి. వారందఱు క్షహరాటసైనికులు. వారు వచ్చుచునె ముగ్ద దీపుని చుట్టుముట్టిరి. ముగ్దదీపుఁడులిక్కిపడి లిప్తలో సంబాళించు కొని చిటికలో తన యశ్వమునధిరోహించి వారితో తలపడెను. ముగ్దదీపుఁడు తన నేర్చిన విద్యనంతను ప్రయోగించి తన నేర్పు నుపయోగించి ప్రయాసముతో వారినొడ్డుకొనుచుండెను. వారు పదు గురును సుశిక్షితులై నిత్యాభ్యస్తమయిన విద్యగలవారు. వారిని తట్టుకొనుట ముగ్దదీపునకు కష్టమగుచుండెను. అయినను ధైర్య మును వీడక వారినందఱ చమత్కారముగ గౌతమీబాలశ్రీదేవి నేర్పిన మెలకువలఁబ్రయోగించి యొకరిద్దరి చేతులలోని ఖడ్గ ములు నేలఁబడునట్లు చేసెను. ఇంకొక యిరువురి శిరస్త్రాణముల నెగురఁగొట్టెను. వేరొకరిపై జందెపుదెబ్బను ప్రయోగింపఁబోవు

చుండెను. అంతలో నెవరో — "ముగ్ధదీపా !" యని కేక యిడిన ట్లయినది.

ముగ్ధదీపుఁడాశ్చర్యపడెను. ఈ క్షహరాటసైనికులకు తననామ మెట్లు తెలిసినది! ఆ కంఠస్వరము తనకు శ్రుతపూర్వమైనదివలె నున్నది. ఆ ధ్వని తనయెడఁదలోతుల స్పృశించినది. ముగ్ధదీపుఁ డట్లే నిలిచిపోయెను. సైనికులును కదలక నిలుచుండిపోయిరి. ముగ్ధదీపుని కంతయు నాశ్చర్యముగ నుండెను. శత్రువైన తాను డస్సి నిలచిపోవగా వారూరక నిలబడి పోయిరేమి ? చిత్రముగ నున్నది ! అంతలో వారిలోనుండి యొక సమున్నతదేహుఁడైన యువకుఁడు ముందునకు వచ్చి ముగ్ధదీపుని బుజముపై చేయివైచి గుఱ్ఱముమీఁదినుండి యాతని దించెను, ముగ్ధదీపునికా యువకుని స్పర్శచే పులకలు కల్గినవి. ఆ యువకుఁడాతని నట్లు దింపగనే మిగిలిన తొమ్మండుగురు ప్రక్కకు దూరముగ తొలగిపోయిరి. ఆ యువకుఁడు ముగ్ధదీపుని కౌగలించుకొని, "పాటలీ !" యనెను. ముగ్ధదీపుఁడు సంతసమున పొంగిపోయి – 'స్వామీ ! మీరా ?' యనెను.

పుండరీకుఁడు : అవును పాటలీ ! నేను చెప్పలేదా ? నేనును నా యనుచరులును నిన్ను సర్వదా కనిపెట్టియుందుమని ! మహా రాజు నిన్ను నిర్వాసితునిఁజేసిన విషయము, నీవీ మార్గమున బయలుదేరుటయుఁ దెలిసికొని నిన్నొక్కమారు కలసికొనవలెనని యిట్లు వచ్చితిని.

పాటలి : నా యదృష్టము. నేనిన్నిరోజులుగ నెంతబాధ యనుభవించుచున్నానో తెలియునా ? ఇన్నినెలలైనది. ఒక్కమార యిన చూడలేకపోతినిగద. మహారాజులు పిలిపించుచో నచ్చట మీ దర్శనభాగ్య మొదవు ననుకొంటిని. కాని యదియు నిరాశయై పోయెను.

పుండరీకుఁడు : రాజధానిలో నీకు శిక్షణ నిప్పించిరి. నాట్య రీతులననేకముల నేర్పించిరి. పలుదేశములందలి భాషలు బోధింపించిరి.

పాటలియాశ్చర్యముతో – "అవునుస్వామీ ! ఇవన్నియు మీకెట్లు తెలియును ? మీరుకూడ నచ్చట నున్నారా ?" అనెను.

పుండరీకుఁడు : అమాయకురాలా ! నేనచటలేకున్న నాకా విషయములు తెలియవనుకొంటివా ? నా ప్రాణములన్నియు నీపై నిలుపుకొని నా ధర్మమును రక్షించుకొనుచున్నాను. ఎన్నెన్నిరాత్రులు

నీ ధ్యానములో నిద్రాదూరము లైనవో! నీకేమితెలియును?

పాటలి: నా స్థితి మీ స్థితికి ప్రతిబింబమనుకొనుఁడు. రాజధానికి వచ్చినతరువాత నా కన్నులు తెరవబడినవనుకొనుడు. అయ్యో! అడుగు కదల్చిన నేమగునో పెదవి విప్పిన నేమగునో! కంటితో చూచిన దోషము, చెవితో వినిన నపరాధము.

పుండరీకుఁడు: మరియేమనుకొంటివి! ముందున్నది ముసుళ్ల పండుగ! నీ రాజకీయ జీవితమంతయు క్షహరాట రాజ్యమున పుష్పించవలె. అచ్చట నీవు ప్రదర్శించు నీతిపై మన సాతవాహన సామ్రాజ్యవైభవ మాధారపడియున్నది. నీవతిజాగ్రత్తగ మెలఁగవలెను. నీవీదుస్తులతో నా రాజ్యమునఁ బ్రవేశించరాదు. యుద్ధోన్ముఖమైన....కాదు యుద్ధారంభమైనది. ఇట్టిస్థితిలో శత్రురాజ్యమున నీవీదుస్తులలో కనిపించిన పట్టివేయుదురు. నీవు మొదట క్షహరాట సైనికవేషము సంతరించుకొనవలెను. నీవద్ద శిశునందికి వ్రాసియిచ్చిన పరిచయపత్రమున్నదికద! జాగ్రత్తగ నుంచుము. పొఱపాటుననైన నెట్టి యధికప్రసంగము చేయకుము. నీవిప్పుడా రాజ్యభాగమున ప్రవేశింపనున్నావనిన మృత్యుగహ్వరమునఁ బ్రవేశించబోవుచున్నట్లే! కొన్నివేల జతల కన్నులనవరతము నిన్నణువణువునఁ బరిశీలించుచుండును. నీవు వానినన్నింటిని తట్టుకొని రహస్యమును కాపాడుకొనుచు మన పథకమును పండించవలెను. ఏమిచేసెదవో! నా ప్రాణములు పరివేషమై నిన్ను చుట్టి పరిభ్రమించుచు నిన్ను రక్షించుచుండును.

పాటలి: అది వేరుగ చెప్పవలెనా? నా చేయగలిగినంత చేసిగాని విడువను. ప్రాణపణముగ మాతృదేశమును రక్షించుకొందును. మీరుమాత్రము తఱచుగ మీ విశేషములఁ దెలియఁజేయుచుండవలయును.

పుండరీకుఁడు: పాటలీ! నీవింత బేలవగుదువేమి? నీకా పరిచయపత్ర మిప్పించినదెవరు? నిన్నాశత్రుస్థావరములకుఁ దీసికొని పోయినదెవరందువు?

పాటలి కన్నులాశ్చర్యముతో నున్మీలితములైనవి. — "ఏమి! మీరా! ఇవియన్నియు స్వయముగ మీరే చేసితిరా?"

పుండరీకుఁడు నవ్వుచు - చూచితివా! నీతో మాటాడుచు నిన్ననుసరించుచున్నను నీవు నన్ను గుర్తించనే లేకపోయితివి. గూఢచారి యన్ననట్లుండవలెను. అంతదాకవెందులకు? ఇప్పుడు మాత్రము నీవు నన్ను గుర్తించితివా?

పాటలి : తెలిసినది. ఇంకమీదట నట్లే సంచరింతును. నా వెంట తిరుగుచు నాతో మాట్లాడుచున్న మిమ్ము గుర్తించలేదు. చిత్రము. మీ లక్షణ మొక్కండు మీలో భాసించనేలేదు.

పుండరీకుండు : అప్పుడు నేను క్షహరాట సైనికుండను. సాతవాహన ప్రభువులన్న నాకు ద్వేషము.

పాటలి : తెలిసినది స్వామీ! మీరు మీ భటులతో నాపై విఱుచుక పడినారేమి?

పుండరీకుండు : నా పాటలి శక్తిసామర్థ్యములను కన్నులార దర్శింతమని, రాబోవు నాపదల నెడ్డుకొనుట కిది యొక యనుభవ మగునని.

పాటలి : మీ పరీక్షలో నెగ్గితినా?

పుండరీకుండు : నూటికి నూరుపాళ్ళు నెగ్గితివి. నేను నిజముగ నీ వింతటి ధైర్యశాలిని వనుకొనలేదు. ఆనాడు కోటలో చూచినను అది విద్యాప్రదర్శనము మాత్రమే. కాని స్వీయ జీవిత మున నిట్టి క్లిష్ట పరిస్థితులు హఠాదుత్పన్నములగుచో నప్పుడుగాని ప్రయోగ విజ్ఞానము మనోదార్ఢ్యము సలవడవు. ఇప్పుడిక నిన్ను గూర్చి నాకెట్టి చింతయులేదు. నేను సైతము కత్తియుద్ధమున నీ ముందు నిలువజాల ననిపించుచున్నది. నేను కేకయిడక పోయి నచో నీవు నిజముగ నా భటుని నొకనిని నీకత్తి కెరచేసెడిదానవే!

పాటలి : అందుకు సందేహమా? పదిమంది నాగి నిల్చు టన్నది నా జీవితమున నిదియే తొలిసారి. మీరనినట్లు శాస్త్రాధ్యయన మొనర్చుట వేరు. ప్రయోగము నెఱపుట వేరు! ఎంతటి యధ్య యన శీలియైనను ప్రయోగవేళల డీలు పడిపోవును. అదిగాక నేర్చువేళల నభ్యాసమునకై చేయు యుద్ధమునకును నిట్టిపరిస్థితు లకును పోలిక లేదుకద. ఎటులైన నేమి? నేను పరీక్షలో నెగ్గితిని కద. మొదట మీరు పదుగురును నొక్కమారుగ చుట్టుముట్టగనే నా మెదడు పనిచేయలేదు. కాని యంతలో మేల్కొన్నది. ఎటులో నిర్వహించితిని.

పుండరీకుండు : నీవానాడు కోటలో ప్రదర్శించిన విద్యలో లేని మెలకువలు కనిపించినవి. ఆ జందెపు దెబ్బ నెవరు నేర్పిరి? ఆ ఖడ్గముల నెట్లెగుర గొట్టితివి?

పాటలి : అవి యన్నియు మహారాజమాత తామై నాకు నేర్పి నారు. స్వామీ! యామె యా చండీదేవి యపరావతార మను కొనుండు. ఆమె యలవోకగ నచ్చనగాయ లాడునటులు కత్తిని

ఘుళిపించును. ఆమె చేతిలో నదికత్తికాదు, మెఱుపుతీగ! కన్ను లున్నందుకామె ఖడ్గ విన్యాసమును దర్శించుటయే సార్థకత యని పించును. ఆమెయే నా కశ్వచాలనము నందలి కొన్ని సూక్ష్మము లను నేర్పినారు. ఆమెకుఁ దెలియని యుద్ధ వ్యూహములు లేవను కొందును.

పుండరీకుఁడు : పాటలీ! నిజముగ నీవదృష్టవంతురాలవు. నీవు రాజమాత శిష్యురాలవు.

పాటలి : మీరును మహారాజులకు శిష్యుని వంటివారేగద!

పుండరీకుఁడు : అవుననుకొనుము పాటలీ! నీకు మనజాతిని పరిచయ మొనర్తును.

పుండరీకుఁడు తన భటులను పిలిచెను. వారు వచ్చి భక్తినమ్రులై పాటలీ పుండరీకులకు నమస్కరించిరి. పుండరీకుఁడు వారినందఱను పేరుపేరు వరుసగ పాటలికి చూపించి యిట్లనెను— "పాటలీ! వీరందఱు మనవారు. వీరి నందఱను సరిగ గుర్తుంచు కొనుము. వీరిలో నెవరో యొకొక్కవేళ నొకొక్కరు నీకు గన్పించ వచ్చును. వాని ద్వారా నీ విశేషములను నాకుఁ దెలియజేయు చుండవచ్చును."

పాటలి : మరి మీరెచ్చట నుందురు?

పుండరీకుఁడు : నాకుమాత్ర మేమితెలియును? ఈ గోదావరీ తీరదేశములందే యుండవచ్చును. ఈ ముళక విభాగఁపు సరిహద్దు లలో నచ్చటచ్చట యుద్ధము చిన్నచిన్న దాడులుగ మొదలుపెట్టి నది. ఇంతకు నీ కార్యక్రమమేమి?

పాటలి : మొదట ప్రతిష్ఠాన నగరమునకుఁబోయి యచ్చట కొంతకాలముండి పరిస్థితుల నాకళింపు చేసికొనవలసినదిగ రాజ మాత యాదేశము.

పుండరీకుఁడు : సరే. అటులే చేయుము. కాని, ఒక్క విషయమును మాత్రము గుర్తుంచుకొనుము. ఎట్టి క్లిష్ట సమయము లందునను రహస్యముల వెలికి రానీయకుము. శత్రువులు నిన్నెం తటి బాధలకు గుఱిచేసినను చివరకు ప్రాణాంతమేయైనను రహ స్యములు బయటికి రారాదు. మన గూఢచారదళమునందలివారు దేనికైన సిద్ధపడి యుండవలయును. రాజసేవలో నొక విచిత్రమైన మర్యాదయున్నది. ఒక నావికుఁడున్నాడు. అతఁడు యుద్ధసమయ మున తన నావయందలి సైన్యమంతయు నశించిపోయినను తానెం తటి దురవస్థలో మునిగియున్నను నావనువీఁడి చనరాదు. తాను

తన నావను ముంచి దానితో తానుగూడ మునిగిపోయి ప్రాణత్యాగ మయినఁ జేయవలెనేగాని తదన్యముగఁ బ్రవర్తించరాదు. అట్లే సేనాపతియు ఆశ్వికదళాధిపతియు, గూఢచారులు నట్లే ప్రవర్తింప వలయును. వారందఱి యుద్యోగములకంటే మన యుద్యోగములు కఠినమైనవి. గూఢచారులు సహస్రాక్షులై మెలగవలెను. ఇంతకు మించి చెప్పదగినది లేదు. బహురాజ పురుషసంకులమైన తావు లందు నిన్ను నీవే రక్షించుకొనవలయును. అంతఃపురములో మన లుట మరియు కత్తివాదరపై నడకవంటిది. నీకే తెలియునుగదా! రమ్ము. నిన్ను ప్రతిష్ఠాన మార్గమున కొంతదూరము సాగనంపు దును.

పాటలి యట్లే యనెను. పుండరీకుఁడు తన భటవర్గము వెంటరాగా ముగ్ధదీపు ననుసరించెను.

పుండరీకుఁడు: ముగ్ధదీపా! నీవు మొదట నీ వేషమును మార్చుకొనుము. నీవు క్షహరాట సైనికుల దుస్తులను ధరించ వలెను.

పుండరీకుఁడు తనయొద్దనున్న దుస్తులను ముగ్ధదీపుని కొసఁ గెను. అతఁడు వానిని ధరించెను.

పుండరీకుఁడు: చూడు మిప్పుడిఁక నీకెట్టి యాపదలేదు. వస్త్రధారణము, మాటాడుభాషావైఖరి వ్యక్తిని పట్టియిచ్చును. నీకవి యన్నియుఁ దెలియును. అయినను నాకు నీయందలి వ్యామోహ మిట్లు చెప్పించుచున్నది. ఈ యుద్ధమెట్లు ముగియునో! మన మిరు వురము కలసి జీవింప గల్గుటెన్నటికో!

వారిరువురు పోవుచుండిరి.

పుండరీకుఁడు: ఇదిగో చూడుము. ఇచ్చట గోదావరీ స్రవంతి మిగుల లోతుగ నుండును. ప్రవాహ మధ్యమున సుడిగుండము లున్నవి. ప్రతిష్ఠానము నొద్ద ప్రవాహము సమవేగముగ నుండును. ఈ నదియందు మానవ స్వభావముల నన్నిఁటిని దర్శింపవచ్చును. ఒక్కచో వేగవతి, మరియొక్కచో మందవేగ ఒక్కచో కుటిలగ, వేరొక్కచో కల్లోలిని. ఈ నది నాకెల్లప్పు డుత్సాహకారిణిగ నుండును. ఇచ్చటి యరణ్యసీమలెంతఘనశ్యామలములై చీఁకట్లఁ జిమ్ముచున్నవో చూడుము.

పాటలి: నిజముగ నేను ధాన్యకటకమున బయలుదేరునప్పు డొంటరితనమువలన భయమైనది. కాని తరువాత నీ ప్రకృతి సౌందర్యమును జూచుకొనుచు వన్యఫలముల నారగించుచు, అటవీ

కుసుమ సౌరభముల నాఘ్రాణించుచు సెలయేటిజాలుల నీరు త్రావుచు, స్నిగ్ధచ్ఛాయా నిబిడములైన మహా వృక్షమూలముల శయనించుచు గడపుట మనస్సునకెంతో యాహ్లాద మొదవించుచున్నది. నా ప్రక్కన మీరున్నచోఁ జెప్పవలసినదేమున్నది!

పుండరీకుఁడు: మరి వన్యమృగముల మాట చెప్పనేలేదేమి?

ముగ్ధదీపుఁడు: అవి నన్నేమి సేయును? ఊరక యనుకొందుముగాని మృగములఁ జూచిన మనకెంత భయమో మనలఁ జూచిన వానికంత భయము. భయము జీవప్రథమ లక్షణముగద!

చూచుచుండగనే సాయంకాలమైనది. దూరమునుండి ప్రతిష్ఠాన నగరపు పొలిమేరలు కనిపించుచున్నవి.

పుండరీకుఁడు: ఇదియంతయు ముళక విభాగము. ఇచ్చట సైనికుల యొత్తిడి మిక్కుటముగనున్నది. క్షహరాట భూపతులకీ నగరము కీలకస్థానమని చెప్పవచ్చును. ఇచ్చట రాజప్రతినిధి యుండును. అతఁడు వట్టి దుర్వ్యసనపరుఁడు. అతనిని బుట్టలో వైచుకొనుట సులువైనపని. కాని యతఁడు స్త్రీ గతబుద్ధి. జాగ్రత్తగ మసలుకొనవలెను.

ముగ్ధదీపుఁడు: ముగ్ధదీపమతనికి తలకొఱవి కాఁగలదు. అతఁడట్టివాడైనచో తానే తెలిసికొనగలఁడు.

పుండరీకుఁడు: నీవట్టివాఁడవే. మనమిచ్చట విడిపోవలయును. నీవచ్చట సునందుని కలసికొందువు. అతఁడు నీకన్నియుఁజెప్పును. నీయచ్చటి యునికి నాతఁడే నిర్ణయించును. నీకొఱకచట నన్నియు సిద్ధముగ నున్నవి. మనవారెవరైన వచ్చినచో మన సంకేతము 'యమదంష్ట్రిక!' ఆ మాట యుచ్చరించినఁగాని యాంతరంగికుఁడనుకొనరాదు.

ముగ్ధదీపుఁడు: అటులనే స్వామీ! మరల మిమ్మెప్పొడు దర్శింతునో!

ముగ్ధదీపుఁడశ్వము నవరోహించి పుండరీకునికి నమస్కరించెను. పుండరీకుఁడాతని నక్కునఁజేర్చుకొని మూర్ధమాఘ్రాణించి— "ముగ్ధదీపికా! నీవు జ్వలితజ్వాలవై విజృంభించుము. క్షహరాట రాజ్యమునఁ గల్లోలినివై, కాళివై, చండివై సంచారము లొనర్పుము. మోహినివై ప్రజల మోహపెట్టుము. నర్తకివై రసికుల నీ కొనగోళ్లపై నాట్యము చేయించుము. నీ సర్వశక్తుల కేంద్రీకరించి సాతవాహన సామ్రాజ్య మహోన్నతికిఁ దోడ్పడుము" అనెను.

పుండరీకుఁడాతని దక్షిణ హస్తమును ముద్దిడుకొని వెనుకకు

మరలెను. ముగ్ధదీపుఁడాతనివైపు చూచుచు నిలబడెను. పుండరీకుఁడు కనుమరుగగు నంతకుఁజూచి తాను పురోగమించెను. తన పతి యెంత నిరీహుఁడు! తన్నాయన ముగ్ధదీపునిగనే మన్నించెను గాని తన భార్యయైన పాటలి యనుకొనఁడు! కరడుగట్టిన కార్య దీక్షగలవాడు. ఆయన రాజభక్తి, దేశాభిమానము ననన్యములు. అంత నిస్స్వార్థపరులుండుటరుదు. అట్టి మహాపురుషుఁడు తన భర్తయై తానాతని యడుగుజాడల ననువర్తించుటకన్న వేరేమి కావలయును!

ముగ్ధదీపుఁడు రంగురంగుల దీపములతో చిత్రచిత్రములైన యలంకరణములతో విచిత్రమైన యుచ్చారణతో మాట్లాడు జనులతో క్రిక్కిరిసియున్న ప్రతిష్ఠాన నగరమునఁ బ్రవేశించెను.

8

"తస్యచ సౌభాగ్య గుణం మమ సాహస మేత దమహిలా సదృశం
శోధతి గోదాపూరో వర్షాసమయోఽర్ధ రాత్ర శ్చ."

వానియొక్క సౌభాగ్య గుణమునుగూర్చి యీ గోదావరీ నది వర్షాసమయపు టర్ధరాత్రము, స్త్రీజన సహజముకాని సాహసమును దెలుపుచున్నది. వానియందలి వాంఛాతిశయము, ఆమెచే నా సాహసముఁ జేయించినది.

ముగ్ధదీపుఁడు ప్రతిష్ఠాన నగరమునకు వచ్చి నాలుగు నెల లయినది. ఈ నాల్గు నెలలలో నాతఁడు గొప్ప వీరుఁడుగ పేరు పొందెను. ప్రతిష్ఠానమునందలి రాజప్రతినిధి భూమకునికి మిక్కిలి దగ్గఱవాఁడైనాడు. ముగ్ధదీపుఁడు తనయొద్దనున్న పరిచయ పత్ర మును భూమకునకుఁ జూపగా నాయన తాను ముగ్ధదీపుని తమ ప్రధాన రాజధాని కల్యాణీ నగరమునకు త్వరలో పంపింతునని, అచ్చట సైన్య విభాగమున నుద్యోగము తప్పక లభించగలదనియు చెప్పెను. ప్రతిష్ఠానము, తత్పరిసరములు, గోదావరీ తీరభూములు, అరణ్యములు సర్వము ముగ్ధదీపునికి సుపరిచితములైనవి. ప్రతి ష్ఠానమున ముగ్ధదీపుఁడనిన నొక గౌరవము భక్తి ప్రబలెను. భూమ కుఁడు క్షహరాట రాజైన శిశునందికి బంధువర్గము లోనివాఁడు. అందువలన భూమకుఁడు ప్రతిష్ఠానమున రాజప్రతినిధివలెఁగాక తానే రాజన్నంతగ నధికారమును వెలయించుచుండెను.

ఆయనకొక కుమార్తె యున్నది. పేరు శాలిని. ఆమె ముగ్ధ దీపుని గూర్చిన ప్రశంసలు వినివిని యాతని మనస్సులోననే వరిం చినది. ఇట్లుండగా నొకనాడు భూమకునియింట నేదో యుత్సవము జరుగుచుండెను. ఆనాడొక గొప్ప విందేర్పాటు గావింపఁబడెను. అందు ప్రధానముగ పెద్దపెద్ద రాజాధికారులు సేనాపతులు శ్రీమం తులును పాల్గొనిరి. భూమకుఁడు ముగ్ధదీపుని ప్రత్యేకముగ నాహ్వా నించెను. ఆనాడు శాలిని ముగ్ధదీపుని కనులార గాంచినది. ఆమెకాతని యెడఁగల మోహము ద్విగుణితమయ్యెను. నాటినుండి ముగ్ధదీపుని కలసికొనుట కుపాయముల యోజించు చుండెను. కుమార మన్మథునివలె నున్న యా సుందరుని మహావీరుని సాహ

చర్యమును పొందకున్న తనజన్మమెందులకు! అతఁడొక సామాన్య సైనికుఁడు. తాను రాజప్రతినిధి దుహిత. ఇరువురిమధ్య నంతర మపారముగ నున్నది. తానాతఁడు వినాముసజాలనట్లున్నది. అంతటి యందగాడును మహావీరుఁడునైన నాయుపకుఁడు తప్పక కులీనుఁడై యుండును. అతని నయనములు మోహనిలయము లట్లున్నవి. అతఁడెచ్చటివాడో, యెటనుండి వచ్చెనో అంత చిన్న వయస్సున నంతటి మహావీరుఁడెట్లయ్యెనో! అతనిఁగూర్చిన వివర ములు తానెట్లు తెలిసికొనగలదు? తనకెవ్వరు చెప్పుదురు? తన నాట్య శిక్షయిత్రియైన దీపశిఖాదేవి పలుదేశములు తిరిగి ప్రదర్శ నముల నిచ్చివచ్చిన నర్తకిగద! ఒకవేళ నామెకేమైనఁ దెలియు నేమో! అడిగిచూడవలెను.

దీపశిఖాదేవి నాట్యమునందును, నృత్యమునందును నందె వేసిన చేయి. మూఁడు నెలలుగ ప్రతిష్ఠానమున నెన్నియో నృత్య ప్రదర్శనము లిచ్చినది. జనములు విఱుగబడి చూచుచున్నారు. పెద్దపెద్ద యుద్యోగస్థులు ధనికులామెను తమతమ గృహముల కాహ్వానించి మర్యాదలనెఱపి నాట్యప్రదర్శనము లనిప్పించుకొన సాగిరి. క్రమముగ నామెప్రశస్తి భూమకుని భవనమున ప్రవేశించి ఆమెను శాలినికి నాట్య శిక్షయిత్రిగ నియమించుట జరిగినది. ముళక భాగమునందంతట నీమెపేరు మ్రోగిపోవుచుండెను. ఆమె నాట్యప్రదేశమున్నదనిన అచూకి తెలిసినఁజాలును పరిసర ప్రాంత ములందలి జనులసంఖ్యాకముగ బండ్లపై గుఱ్ఱములపై వివిధ వాహ నములపై ప్రతిష్ఠానమునకు వచ్చిచూచి పోవుచుండిరి. ఆమెలో నేమి మహాత్మ్య మున్నదో కాని, యొక మారు చూచినవారామె నాట్యప్రదర్శనమును వదలి పెట్టలేరు.

దీపశిఖ క్షహరాటరాజ్యమున నాట్యప్రదర్శనములనిచ్చిమహా ధనవంతురాలైనది. శాలినికి ఉపాధ్యాయి యైనపిమ్మట నింక చెప్పవలసినదేమున్నది! ప్రతిదినము దీపశిఖకొఱకు రాజశకటము వచ్చును. దానినధిరోహించి దీపశిఖ భూమకుని భవనమునకు పోవును. అచ్చట నొకటిరెండు గంటలు రాజప్రతినిధి కొమార్తెకు నాట్య శిక్షణము నొసఁగును. ఆ భవన సంబంధియుద్యానము, రాజ మందిరములు దేవతాయతనములు దీపశిఖకు సుపరిచితములైనవి. ఆమె శాలినితో నుపాధ్యాయివలెగాక స్నేహితురాలివలె మెలగును. వారిరువురిమధ్య రాజకీయ సంబంధమైన చర్చలుగూడా సాగు చుండెను.

శిశునంది మహారాజు వంశపరంపరాగతమైన రాచరికముచేత, రాజ్యముచేతనే రాజుగాని ప్రవర్తనచేత శీలముచేత రాజు కాడఁట. శాలిని శిశునంది వీరుఁడు కాడనును. నహపానవంశమున నాతఁడుడుగుకోత పిండెపంటివాడఁట. నహపానుఁడు మహా వీరుఁడు. ఈ రాజ్యమంతయు నాయన సంపాదించెనఁట. శిశునంది రాజ్యమును నిర్వీర్యమును జేసినాడు. పూర్వ రాజులనాటి యుద్ధనైపుణి యిప్పటి శిశునందికి లేదు. ఈ రాజు ప్రతినిధి చేతిలోని కీలుబొమ్మ. తన తండ్రి భూమకుని భుజబలము బుద్ధి వైభవములపై నీ కహరాట రాజ్యము సాగుచున్నదఁట. సేనానాయకులున్నారు. వారిలో నొకరిద్దరు కడు సమర్థులు. సర్వసైన్యాధ్యక్షుఁడు రాజమరాళుఁడున్నాడు. అతఁడు శక్తిమంతుఁడే కాని స్త్రీ వ్యామోహ దూషితుఁడు. శాలిని యిట్టి విషయముల నన్నిఁటిని చెప్పుచుండును. దీపశిఖ తనలో—"అయినచో శిశునంది మహారాజు వృద్ధుఁడా? విలాస బుద్ధియా? ప్రతినిధులపై నాధారపడియుండునా? అట్టివానికి రాజ్య విస్తరణ కాంక్ష యెందులకో! ఆ రాజెట్లుండునో? కానిమ్ము. తిన బోవుచు కూర రుచి యడుగనేల? తాను కల్యాణి నగరమునకు పోవలయునుగదా!"

ఒకనాటి నాట్యావసానమున దీపశిఖ తన యావాసమునకు బయలు దేరనుండగా శాలిని యన్నది—"దీపశిఖాదేవీ! మిమ్మొక విషయమడుగ వలెనని యున్నది!"

దీపశిఖ: తప్పక యడుగవచ్చును. నన్నేదైన నడుగుటకు సంశయింపనక్కరలేదు. నేనది తొలుతనే చెప్పితినిగదా. నాట్యశిక్షా వేళలందు మాత్రమే యుపాధ్యాయిని. తదితర సమయములందు మిత్రురాల నంటినిగద. శాలిని విచిత్రమైన సిగ్గువోయెను. ఆ సిగ్గది యొక చమత్కారమైనది. అసలు సిగ్గనునదే చమత్కారమైనది. భయము జీవితమున తొలి లక్షణమగుచో లజ్జ మలిజీవిత లక్షణమై పరమ నాగరకతను సంతరించుకొని మరియు రూపొందినది. 'లజ్జా విహీనః పశుః' అన్నట్లు లజ్జ మనోనిష్ఠమైన యొక పరమ సుకుమార లక్షణము. లజ్జా విహీనులు పశువులు. పశుస్థితి నధిగమించినఁ గాని లజ్జాశీలమలవడదు. ఈ లజ్జ మరల ననంతవిధములు. స్త్రీగతమైన లజ్జవేరు, పురుష నిష్ఠమైయుండు లజ్జ వేరొకతీరుది. ఈ లజ్జా ప్రకటనములో మరియు లక్షభేదములున్నవి. ఉత్తమ వంశ జాతులైనవారి లజ్జా ప్రకటన పద్ధతివేరు. అన్యులపద్ధతివేరు.

నేఁడీ శాలిని లజ్జఁ జెందినదనగా నది జగన్మోహనముగ

మన్నది. శలాకవలె సాగి సమవిభక్తాంగయై హసన్ముఖియైన శాలిని చిత్రముగ సర్వాంగములు కుంచించుకొని యానతనేత్రయై కంపితాధరయై త్రిభంగియై మిగుల యొయ్యారముగఁ గన్పించెను. దీపశిఖ యామెనుజూచి యాశ్చర్యముఁ జెందెను!

దీపశిఖ: శాలినీ! అంత లజ్జపడుచున్నావు. నీ స్థితినిబట్టి నీ మనస్సును నేను కొంత యవబోధ మొనర్చుకొన్నాను. చెప్పుము, నీ మధుర లజ్జయే పట్టియిచ్చినదిలెమ్ము.

శాలిని: దీపశిఖాదేవీ! ఉద్యానవనమున కేగుదము.

వారిరువురు విరియఁబూచి సువాసనల వెదజల్లు పందిరితో రచించిన లతాగృహమున పాలరాతి తిన్నెలపైఁ గూర్చుండగా, ప్రక్కనున్న జలయంత్రములోనుండి సన్నని నీటి తుంపురులు పన్నీటి చిలకరింపులై మందపవనము స్పర్శసుఖమై వీచుచుండగా, నయనాభిరామముగానున్న యా సంధ్యారుణకాంతులలో లజ్జాముగ్ధయైన శాలిని యనినది—దీపశిఖాదేవీ! మీరు నృత్యనాట్య ప్రదర్శనముల నిచ్చుచు పలుదేశములందు సంచరించినారుగదా.

దీపశిఖ: అవును. చాల నగరముల పట్టణములఁ జూచితిని. అయినచో............

శాలిని: ఎంతఱెందరినో పలురకముల వ్యక్తులఁ జూచి యుందురు.

దీపశిఖ: చూచితిని.

శాలిని: ముగ్ధదీపుఁడని యొక........

దీపశిఖ నవ్వుచు, "తెలిసినది, ఆ ముగ్ధుఁడా యీ ముద్దరాలి మనస్సును కలవర పరచినది!" అనినది. శాలిని సంతోషముతో—ఆఁ! మీకు తెలియునా? అని యడిగినది.

దీపశిఖ: మా యిద్దరి దొకే గ్రామము. చిన్ననాడు మేమిద్దరము స్నేహముగ నుండెడి వారము. పెద్దవారమైన తరువాత నిరువురము వృత్తిధర్మము ననుసరించి దేశముల పర్యటించుచునైనది. ప్రతిష్ఠానమునకు వచ్చిన తరువాత మరల నాతఁడు నా నృత్య ప్రదర్శనములకు వచ్చినాడు. నన్ను పోల్చుకొని పూర్వస్నేహమును పురస్కరించుకొని నా యావాసమునకు వచ్చెను. అప్పటి నుండి తఱచు వచ్చుచుండుట జరుగుచున్నది. ఎంతటి మహా వీరుఁడైనాడు! ఎంతటి ఖడ్గవిద్యావేత్తయైనాడో! అప్పటి కుఱ్ఱవాడు తేలి పరమసుందరాకారుఁడైనాడు. తొలుత నేనాతని గుర్తింపఁ జాలకపోయితిని. అతఁడు మా చిన్ననాటి సంగతులు

త్రవ్విపోయగా స్ఫురణకు వచ్చినది. అతఁడు నన్ను నిష్ఠురము లాడెనుకూడ. ఇప్పుడాతఁడీ ప్రతిష్ఠానమున మిక్కిలి ప్రతిష్ఠావంతుఁ డైనాడుకదా !

శాలిని : అవును. ఎవరినోట వినినను ఆయన ప్రశంసలే. మా నాయనగారుకూడ పలుమారు లాయననుగూర్చి చెప్పుచుందురు. మొన్న మా భవనమున జరిగిన యుత్సవమున కాయన వచ్చెను.

దీపశిఖ : ఇఁకనేమి ! నీ మనస్సు నాతఁడు తనతో గొనిపోయి యుండును. నీ యెన్నిక చాలబాగున్నది.

శాలిని : అయినచో నేమైనది ?

దీపశిఖ : మనసున్న మ్మార్గముండదా ?

శాలిని : ఈమధ్య నీ యధికారపుటడ్డుగోడ లభేధ్యములై యున్నవిగద. అదియుఁగాక నతఁడుకూడ...........

దీపశిఖ : ఆ సందేహము వలదు. ముగ్ధునివిషయము నాకుఁ దెలియును. అతఁడు సౌందర్యారాధకుఁడు. నీవు సౌందర్య రాశివి. నీవు కోరి వచ్చిన స్వర్గలక్ష్మి తనకబ్బినంతగ నానందించును.

శాలిని : ధన్యురాలను. అంతకుమించి నాకేమి కావల యును ?

దీపశిఖ : ప్రయత్నింతును. కాని నీవొకటి జ్ఞాపకముంచుకొన వలెను. ముగ్ధునికెట్టి యవమానము జరిగినగాని, మనసు కష్టపడిన గాని యాతఁడు పగఁబట్టిన కోడెత్రాఁచు. అతఁడెదైన తలచుకొని నచో నది చేసితీరును. పరిస్థితులెటుల పరిణమించునో ! ఆతనితోడి వ్యవహారము కష్టమైనది !

శాలిని : ఆయన నిచ్చట యవమానించునదెవరు ?

దీపశిఖ : అయినచో నే నీ విషయము నాతనితో ప్రసంగిం తును. ఆపై నీకుఁ దెలియఁజేసెదను.

శాలిని : అటులనే.

దీపశిఖ వెడలిపోయెను. శాలిని తనకు ముగ్ధదీపునితో సమా గమ మైనంతగ నానందము పొందెను. దీపశిఖ సూటిగ తన యావా సమున కేగెను. ఆమె దేవి తనయందు ప్రసన్నురాలైయున్నదను కొనెను. ప్రతిష్ఠాన నగరమిఁక నించుమించు తమవశమైనట్లున్నది ! తన యదృష్టవశమున శాలిని ముగ్ధదీపుని వలచినది. దానితో కాగల పనిని గంధర్వులు తీర్చినట్లయినది. తాను వచ్చినపని సులువైనది. శాలినీ ముగ్ధదీపుల సమాగమ మెచ్చట జరుగవలెను? ఎట్లు జరుగ వలెను? ముగ్ధదీపుఁ డంతిపురమునఁ బ్రవేశించరాదు. శాలిని నే

రప్పించవలయును. ఎచ్చటికి రప్పించవలయును ? తన మందిరమునకైనచో శాలినిని తేవచ్చునేమో ! ముగ్ధదీపుఁడై యంతిపురమున కేగుట యాపదఁగొని తెచ్చుకొనుటయే కాగలదు. ఏమిచేయవలెను ? దీపశిఖ చాలతడవు యోజించి తుదకొక నిశ్చయమునకు వచ్చెను.

మరునాడు దీపశిఖ శాలినితో ననినది—"నాగృహమున కేదైన మిషతో నీవు రాగలిగినచో నచ్చట ముగ్ధదీపుఁడు నిన్నుఁ గలసికొనునట్లు చేయుదును. నా గృహమొకటియు తన గృహమొకటియు నను భేదము లేనివాఁడు. అచ్చట నైనచో నాతఁడు నీతో స్వేచ్ఛగ మాట్లాడగలఁడు. లేనిచో నాతనినే యిచ్చటికిఁ దేవచ్చును. కాని, యందు చాల ప్రమాదములున్నవి.

శాలిని : ఏమి ప్రమాదము లుండునందురు ?

దీపశిఖ : అతఁడు ముగ్ధదీపునివలె నీ భవనమునఁ బ్రవేశించినచో తిరిగిపోవు నాస వదలుకొని రావలయును. లేనియెడల నొకపని చేయవచ్చును.

శాలిని : ఏమిటది ? ఎట్లయిన నాతఁ డిచ్చటికి వచ్చిననే బాగుగ నుండును.

దీపశిఖ : అటులైనచో నీవు చూచునది దీపశిఖాకృతిని మాత్రమే !

శాలిని : నా కర్థమగుటలేదు.

దీపశిఖ నవ్వెను—"శాలినీ ! తెలియలేదా ? నీ మనోహరుఁడు మనోహారిణియై దీపశిఖాకృతిగ నీ మందిరమున ప్రవేశించును. నీ కంగీకారమగుచో నేను ముగ్ధదీపునితో చెప్పి యట్లు చేయించెదను. నా బదులు ముగ్ధుఁడు దీపశిఖయై వచ్చును. అప్పుడితరుల కనుమానమునకు తావుండదు.

శాలిని : అమ్మో ! రహస్యభేదనము జరిగినచో !

దీపశిఖ : అటులనా ? ముగ్ధుఁడాడవేషము వైచిన నచ్చముగ నాడపిల్లవలె నుండును. నీవే గుర్తించలేవు. మేమిరువురము కవలవలె నుందుము. నీవే చూచెదవుగద. అతనిఁగలసికొనవలెనన్న నిది యొక్కటే మార్గము. అటుపైనిఁక నీ యిష్టము.

శాలిని : అయినచో నట్లే చేయుడు.

దీపశిఖ : మరియొక మాట. ముగ్ధునితో చాల యోజించి సంభాషించవలె సుమా ! దేనికిని తొందరపడగూడదు.

శాలిని లజ్జావనత వదనయయ్యెను.

దీపశిఖ : శాలినీ ! ఈ లజ్జ నా వద్ద నెందులకు ? రేపా ముగ్ధ దీపుని ముందర నొలకఁబోయుము.

శాలిని దోసిలిలో మొగము దాచుకొనెను.

దీపశిఖ : అయినచో రేపు క్రొత్త నాట్య శిక్షయిత్రి వచ్చును. ఆమె నేర్పు నాట్యమెట్లుండునోమరి !

శాలిని : దీపశిఖాదేవీ ! పరిహాసములాడుచున్నారు. అట్లయినచో నా క్రొత్త శిక్షయిత్రి నాకక్కరలేదు.

దీపశిఖ : ఇప్పుడననచో ప్రయోజనమేమి ? అచ్చుట నాతఁ డూరకుండునా ? ప్రాణముఁదీయుచున్నాడు.—"అక్కా ! ఆ శాలినీ దేవి నొక్కమారు కలసికొనునట్లు చేయవా ? నాడుత్సవ సమయమున వారి భవనములో చూచినదాది నా మనస్సామెయందు లగ్నమయినది" అని కలిసినపుడెల్ల నన్ను బతిమాలుచున్నాడు.

శాలిని : అటులయినచో........అ....యినచో....

దీపశిఖ : తెలిసినది. రేపు వచ్చునది ముగ్ధదీపశిఖ, గుర్తుంచుకొనుము. నాకు నతనికి నెట్టిభేదముండదు. నిన్న నా గృహమునం దీవేషము వైచినాడు. నేనాతనిఁజూచి నా ప్రతికృతియని భ్రమఁ జెందితిని.

శాలిని : అదృష్టవంతురాలను. మీకు నాయందలి శిష్య వాత్సల్యమునకు కృతజ్ఞురాలను.

మరునాడు వచ్చిన దీపశిఖ శాలినిని చూచి కనులు మిరుమిట్లు గొల్పగా నాశ్చర్యముగ్ధయై నిలిచిపోయెను. మన్మథునితో ప్రథమ సమాగమవేళ రతిదేవి యంత సుందరముగ నలంకరించుకొని యుండెనోలేదో ! నిన్నటి శాలినికి నేటి శాలినికిని పోలికయే లేదు. నిన్న శాలిని సామాన్య రాజప్రతినిధి గారాబు కూతురు. నేడు చక్రవర్తి తనూజవలె వెలిగిపోవుచుండెను !

శాలిని భవనమంతయు ప్రత్యేకాలంకారములతో ధగధగ లాడుచుండెను. ధూపకరండములనుండి నిరంతర పరిమళ భరితమైన చిఱు ధూమరేఖలు సాగి మందిరాంతర్భాగము నంతటనలముకొని యొకానొక మాదకతను గలిగించుచుండెను. స్వర్ణ పంజరమున రాచిల్క రెక్కలు విదల్చుకొనుచు 'రామరామ' యనుచుండెను. మందిరమున నొకవంక యున్నతమైన దంతపుటాసనము బహు వర్ణచిత్ర చిత్రితము హంసాకృతిలో నున్నది. దానికిఁ బార్శ్వభాగమున వేరొక కాశ్మీరదేశపు పనితనముగల గుండ్రని బల్లపై పలురకముల ఫలములు పానీయములు నమర్చబడి

యుండెను. ఒకపంక నాట్య సాధనములు వీణావేణు మృదంగము లుండెను. వేరొకదెస మహోన్నతమైన రాధాకృష్ణుల దంతపు విగ్రహమున్నది. ఆ మందిరము సరస్వతీ మందిరమువలె నద్భుతముగ నుండెను. శాలిని వదనము కోటిచంద్రులుదయించినట్లు వెలిగిపోవుచుండెను. ఆమె కన్నులానందపూర్ణములై మిలమిల లాడుచుండెను.

దీపశిఖ తనలో—"తొలిపలపు ప్రథమావిష్కరణ మిట్లుండునుకాబోలును" అనుకొనెను.

వచ్చిన దీపశిఖను జూచి శాలిని యాశ్చర్య ముగ్ధురాలగుచుండెను.

దీపశిఖ : శాలినీ! ఏమి నన్ను క్రొత్తదానిగఁ జూతువేమి? ఇదేమీ నాడింత మెఱసిపోవుచున్నావు? నీ మందిరమంతయు నింత యలంకరింపఁబడినదేమి? ఈ దినమున నిందేమైన నుత్సవము జరుగునా? నిన్న నాతో చెప్పితివికాదేమీ?

శాలిని నివ్వెర పోవుచుండెను. "ఇదేమి! ఈమె నిజముగ దీపశిఖాదేవియేనా యేమి?" యనుకొనెను.

దీపశిఖ నవ్వుచు—"ఏమమ్మా శాలినీ! నాట్యము నేర్చుకొనవాయేమి?"యని యడిగెను.

శాలిని కలవరముఁజెంది—అయినచో....అ.......యిన....చో మీరు నిజముగ దీపశిఖాదేవియేనా?" అనుచు శాలిని దీపశిఖ చేతులు పట్టుకొనెను.

దీపశిఖ నవ్వుచు—"ఓహో! అందుకా? తెలిసినది నీ యీ యలంకరణములోని రహస్యము. ఈవేళ ముగ్ధునికి తీరిక లేదఁట. అతఁడు రాలేదమ్మా" అనెను.

సురదీర్ఘికలో విహరించు రాయంచ నూరి చెఱువునఁ బడవైచిన నెట్లుండునో యటులున్న శాలినిని చూడగనే దీపశిఖకు జాలివేసినది.

శాలిని యుస్సురనుచు తల దించుకొనెను.

దీపశిఖ : శాలినీ! ముగ్ధదీపుని నిజముగ నంత గాఢముగ ప్రేమించితివా?

శాలిని కన్నులెత్తి దీపశిఖను చూచినది. ఆ కన్నులు వర్షాంబుదములు!

దీపశిఖ శాలిని చుబుకమును చేతిలోనికిఁ దీసికొనెను. ఆమె యనామికకు ముగ్ధదీప నామాంకితమైన యంగుళీయకముండెను.

శాలిని దానిని జూచి త్వరితముగ తటిల్లతవలె చలించిపోయినది. మరునిముసమున నామె సిగ్గుల బరిణయయ్యెను.

దీపశిఖ : ఏమమ్మా ! శాలినీ ! ఈనాడు నీ ప్రవర్తన యాశ్చర్యముగ నున్నది !

శాలిని : మీకేమియుఁ దెలియనట్లు !

ఇట్లనుచు శాలిని యటనున్న పూలమాలను తీసి దీపశిఖ కంఠము నలంకరించెను. దీపశిఖ దానిని తీసి శాలిని కంఠసీమను ప్రత్యేకాలంకారమొనర్చి—"శాలినీ ! ఎన్నాళ్లకు నా కోర్కె ఫలించి నిన్ను కన్నులఁదనివితీర దర్శింపఁజాలితిని !" అనెను.

శాలిని : దీపశిఖాదేవి పుణ్యమున నిది సంభవించినది.

దీపశిఖ : ఆమె నన్ను ముగ్ధదీపశిఖనుగ రచించినది.

శాలిని : మీకు నామెకు భేదమాపంతయు లేదు. మీ వ్రేలి యంగుళీయకము మిమ్ముల నాకు పట్టి యిచ్చినది.

దీపశిఖ : అంగుళీయకమును ధరించనిచో నేను వట్టి దీపశిఖనన్నమాట. అటులైన నీ యంగుళీయకమును నీయొద్ద నుంచుకొనుము. నేను దీపశిఖ నైపోయెదను.

శాలిని : వలదువలదు. మీరు ముగ్ధదీపులుగనే యుండవలయును.

దీపశిఖ : ఎంతకాలము వరకు ?

శాలిని : పరిస్థితు లనుకూలమగునంతవరకు.

దీపశిఖ : అనగా ?

శాలిని : మా నాయనగారు సాతవాహనులతోడి యుద్ధ వ్యవహారములలో మునిగి యున్నారు. ఈ సంగ్రామము పూర్తియయినఁ గాని యాయనగారేవిషయమును పట్టించుకొనరు.

దీపశిఖ : ఆ శిశునంది మహారాజులున్నారుగదా ! ఆయన యుద్ధతంత్రమును నడపరా ?

శాలిని : ఆయన పేరునకు ప్రభువు. వ్యవహారమంతయు మా నాయనగారును నింకొకరిద్దరు ప్రతినిధులును రాజకుమారుఁడును చూచుచుందురు.

దీపశిఖ : రాజకుమారుఁడా ?

శాలిని : ఆయన క్షహరాటు సర్వసైన్యాధ్యక్షుఁడు.

దీపశిఖ : అసలీ యుద్ధమెందుకు వచ్చినట్లు ?

శాలిని : సాతవాహన రాజ్యమంతయు నొకప్పుడు క్షహరాటులదేనఁట. అందువలన న్యాయమైన మా రాజ్యమును తిరిగి

సంపాదించవలెనని.

దీపశిఖ : అటులనా ? యుద్ధము ప్రారంభమైనదా ?

శాలిని : కాకేమి ? మా క్షహరాట రాజ్యపు సరిహద్దుల నన్నింట సైన్యము జాగరూకముగ సంసిద్ధమైయున్నది. ఆ సాతవాహన ప్రభువుకూడ యుద్ధసన్నద్ధుఁడైనాడని మా చారులు వార్తలు తెచ్చినారఁట. అకరావంతిలో యుద్ధమారంభమైనదఁట.

దీపశిఖ : సాతవాహను లుద్దండులందురు. క్షహరాటులు వారి నాగి నిల్వగలరా ?

శాలిని : తప్పక. మా నాయనగారు రాజమహేంద్రుఁడు నున్నంత కాలము క్షహరాటుల నెవ్వరుఁ గన్నెత్తి చూడలేరు.

దీపశిఖ : పోనిమ్ము. ఇప్పుడా గొడవ మనకెందులకు ?

శాలిని : అదే మట్లందురు ? మీరు మహావీరులు గద. యుద్ధము మాట యెందుల కందురేమి ?

దీపశిఖ : అదికాదు. నన్ను మీ నాయనగారు శిశునంది మహారాజు నొద్దకు పంపెదమనినారు. రెండుమూఁడు రోజులలో నేను కల్యాణికి పోవలసియుండును. మన యీ ప్రథమ మధుర స్నేహ సమాగమ సమయమున నీ యుద్ధ ప్రసక్తి యెందులకని యట్లంటిని.

శాలిని : ధన్యురాలను. పునర్దర్శన భాగ్య మెన్నటికో !

దీపశిఖ : ఏమో ! ఏమని చెప్పను ? యుద్ధసమయముగద. శిశునంది మహారాజులు నన్నే యుద్ధరంగమునకుఁ బంపెదరో మరి !

శాలిని : అయ్యో ! మిమ్ము కలసికొనుట మరి నా కెట్లు కుదురును ?

దీపశిఖ : నేనెచ్చట నున్నను నా మనస్సంతయు నిన్నుచుట్టి తిరుగుచుండును. ఆ యుత్సవమున నిన్నుఁ జూచినది మొదలు నా కంటికి కునుకు వచ్చుటలేదు. నిన్నుఁ గలసికొనుట నాకసాధ్య మని తెలియును. ఏమియుఁ దోచక నీ నాట్యశిక్షయిత్రి దీపశిఖ యని విని యామె నాశ్రయించితిని.

శాలిని : నన్నిప్పుడేమి చేయుమందురు ?

దీపశిఖ : నీ యానవాలేదైన నా కొసఁగుచో నేను తిరిగి యీ ప్రాంతములకు వచ్చినప్పుడు నీవద్దకు రావచ్చును. లేనిచో నే నెవ్వరికైన నా యానవాలును, నీ యానవాలుతో జతచేసి పంపినచో నీవు నావద్దకు రావలయును. నీ వంతటి సాహసముఁ జేయఁ గలవా ?

శాలిని : మీకొఱకేమైన చేయగలను.

దీపశిఖ : అయినచో నీ యానవాలేమి ?

శాలిని తన వ్రేలి యుంగరమును దీసి దీపశిఖ వ్రేలికిఁ దొడిగి—"మీరీ యుంగరమును జూపినచో నా మందిరమునగాని, నా యుపవనమునగాని మీ కెవ్వ రడ్డుచెప్పరు. మీరుగాని మీరు పంపిన వారుగాని స్త్రీ రూపముననే రావలయును" అని చెప్పెను.

దీపశిఖ : అది వేరుగ చెప్పవలయునా ? సరికాని నీవీవేళ నాట్యము చేయవా ? నాట్యాభ్యాసము లేనిచో నెవ్వరైన ననుమానించుట కవకాశ మిచ్చినట్లగును.

శాలిని : మీకుఁ గావలయునన్నచో నాట్యము చేయుదును. ఎట్టి యభ్యంతరమును లేదు.

ఇరువురు నవ్వుకొనిరి. శాలిని దీపశిఖను వెంటనిడుకొని తమ భవనము లన్నింటిఁ జూపించినది. దీపశిఖ వెడలిపోవుచు శాలిని కన్నీరు తుడిచి చెక్కులు మీటి వంద సాంత్వనములు పలికి త్వరలో మరల కలసికొనఁగలనని ప్రమాణము చేసెను. శాలిని నీరు నిండిన కన్నులతో నవ్వెను. దీపశిఖ యదిచూచి జాలిపడెను.

నాటి రాత్రి దీపశిఖ యింటికొక వృద్ధుఁడు వచ్చెను. అతఁడామె దర్శనమపేక్షించెను. ఆమె నిరాకరించగా నాతఁడు "యమదంష్ట్రిక" యనెను. దీపశిఖ వృద్ధునిలోనికి రావచ్చునని కబురు వెట్టెను. అతఁడు లోనికి వచ్చెను. దీపశిఖ యాతని వచ్చిన పని యేమని ప్రశ్నించెను. నీవెవరవని యడిగెను. వృద్ధుడు తన కృత్రిమ వేషమును తీసివైచెను. అతఁడు సునందుఁడు. నాడు గోదావరీ తీరారణ్యముల పుండరీకునితోఁజేరి తనపై వాడి సల్పిన వీరులలో నీతఁడొకఁడు. తన ప్రియుఁడు తనకు బాసటగ నిల్పిన గూఢచారి ! దీపశిఖ పుండరీకుని ప్రేమకు మనస్సులోనే సంచలించి సునందుని తమ నాయకుఁడెచ్చట నున్నాడని ప్రశ్నించెను.

సునందుఁడు : అమ్మా ! వారిప్పుడు గోదావరి కావలి యొడ్డున ప్రతిష్ఠానమునకు రెండు గవ్యూతుల దూరమున నున్నారు.

దీపశిఖ : అచ్చట గుడారములు వైచికొనిరా ?

సునందుఁడు : లేదు. ఒత్తయిన చెట్ల గుబురులతో నున్న యొక ప్రదేశమున్నది. అచ్చట నింక కొన్ని కొమ్మలు రెమ్మలు చేర్చి లోన నొక కుటీరమువలె నిర్మించుకొని యందులో నున్నారు.

దీపశిఖ : నాకేమైన వార్త యున్నదా ?

సునందుఁడు : ముగ్ధదీపులవారు కల్యాణికి పోవలసి

యున్నది.

దీపశిఖ : అటులనా ? ఎప్పుడు ?

సునందుఁడు : అవును త్వరలోనే. నేనుపోయి వచ్చెదను.

సునందుఁ డటనుండి వెడలిపోయెను. దీపశిఖ పుండరీకు నొకసారి చూచినచో బాగుండు ననుకొనెను. ఈ శాలినీ వృత్తాంత మాయనకు స్వయముగఁ దెలియఁజేసి తదుపరి కార్యక్రమమును గూర్చి యోజించ వచ్చునుగద యనుకొనెను. ఈ యూహతోనే నాలుగు దినములు గడిచినవి. ముగ్ధదీపుఁడు కల్యాణికి వెళ్ళినటుల శాలినికి వార్తఁజెప్పినది. శాలిని మనస్సున కష్టపడుచున్నది. ముగ్ధ దీపుఁ డచ్చముగ తనవలెనే యున్నాఁడఁట. తన ప్రియురాలి ప్రియు రాలైన శాలిని గాథ విని పుండరీకుఁ డేమనునో ! శాలిని పాపమమా యకపు పిల్ల ! తానాడించినట్లెల్ల నాడుచున్నది. తన్ను నిజముగ తన మనస్సునందు ముగ్ధదీపుఁడే యనుకొనినది. ప్రేమ యెంత గ్రుడ్డిది !

వర్షము కురియుచున్నది. రెండురోజులుగ నెడతెగకుండ వర్షించుచునే యుండెను. వర్షర్తు ప్రారంభముననే ముసురు వట్టి నది. అమావాస్య గడచినఁగాని ముసురు వదలునట్లు లేదు. ఇంక రెండు దినము లిట్లే యుండును. తాను కల్యాణికి పోవు పుండ రీకుని కలసి కొనవలెను. ఆమె కేమి చేయవలెనో పాలు పోవుట లేదు. ఆమె తన ప్రక్కనున్న బల్లపైనుండి హాలసాతవాహన మహారాజు సంకలన మొనర్చి తానై వ్రాసికొనిన గాథాసప్తశతిని తీసికొని తిరుగవేయుచుండెను. తన మందిరమున విశాలమైన వాతాయనమునొద్ద కూర్చుండి కురియుచున్న వర్షమును దిల కించుచు, నా వర్షములో తన స్వామి యా పర్ణకుటీరములో నేమి బాధపడుచున్నాడో యనుకొనెను. గ్రంథమెన్నిసార్లు చదివినను నెప్పటికప్పుడు క్రొత్తగ ననిపించుచుండెను. అందలి ప్రతిగాథను ధ్వని శాస్త్రవేత్తలు తమతమ గ్రంథముల నుదాహరణములకై యుపయోగించుకొనఁదగినదిగ నుండెను. ప్రాకృత సరస్వతికి గ్రైవేయ సదృశమైన గ్రంథమది. తనచిన్నతనమున వికుంఠపురము నందలి యాచార్యులవారియొద్ద పఠనమొనర్చిన గ్రంథము. తా నెచటికి బోయినను ఆ గ్రంథము తనతో నుండితీరవలయును. దీపశిఖ గ్రంథమును చూచుచు నొకగాథవద్ద నాగి మరల చూచినది.

"అద్య మమాగఁతవ్యం ఘనాంధకారేపి తస్య సుభగస్య
ఆర్యా నిమీలితాక్షీ పదపరిపాటీం గృహే కురుతే."

మర్యాదగలదైన యొక గృహిణి తన భర్తను ఘనాంధకారమైనసమయమున కలసికొనవలెనని సంకల్పించి గృహమునందు నిమీలితాక్షియై ధ్వనిరహితముగ నడుగులు వైచుచున్నది. పాదములందలి యలంకరణములు వానియెద్దకేగునపుడు ధ్వనిచేయకుండునట్లడుగులిడుట యామె కభ్యస్తమయిన విషయమే.

దీపశిఖ మనస్సంతయు పుండరీక మయమయ్యెను. ఆమె యా గాథా స్వారస్యమును మనసా యనుభవించుచు చదువుచుండెను.

"తస్యచ సౌభాగ్యగుణం మమ సాహసమేత దమహిలాసదృశం
బోధతి గోదాపూరో వర్షాసమయోఽర్ధరాత్రశ్చ."

వానియొక్క సౌభాగ్య గుణమునుగూర్చి, యీ గోదావరి వర్షాసమయార్ధరాత్రమున స్త్రీజనాసహజమైన నా సాహసమును దెలుపుచున్నది.

పుండరీకునిగూర్చిన భావనతో మనసునిండిన దీపశిఖ నీ రెండుగాథలు పట్టి నిల్పినవి. దీపశిఖ తనలో—"అవును. ఈగాథలు నన్ను ప్రేరేపించుచున్నవి. నేనుమాత్రమేల నాభర్తను కలసికొనరాదు! నాకు సాహసము లేదా? గోదావరి నన్నడ్డునా! వర్షము నన్నేమిచేయును? నేను స్త్రీజన సహజములుగాని సాహసములనేకములఁ జేసితిని. నా బ్రదుకే స్త్రీపురుషవివక్ష లేకుండ సాగుచున్నది. ఏమైన నీ రాత్రియే నా నాథుని కలసికొనితీరెదను. కల్యాణికిఁబోవుచో నాయన నెన్నటికి చూచుటగునో! సునందుఁడు చెప్పిన గుర్తుననుసరించి నా స్వామిని కలియవచ్చును" అనుకొనెను.

దీపశిఖ పుండరీకుని కలిసికొనుటకే నిశ్చయించుకొనెను.

ఆపాదమస్తకము నీటిలో తడిసి నడచుచు మేనంతయు నీరు కాల్వలు గట్టుచుండగా ముగ్ధదీపాకృతియై తన యెదుట నిలచిన దీపశిఖను చూచి పుండరీకుఁడు చలించిపోయెను. అతనికి నోట మాట రాలేదు. వారిరువురొకరినొకరు చూచుకొనుచు నిలబడిరి. కొంతసేపటికి పుండరీకుఁడు ప్రకృతిస్థుఁడై—"పాటలీ! ఎంతసాహసము! ఇంతవర్షములో నిట్టి ఝంఝూ వాతములో నర్ధరాత్రమున చీఁకటిలో కూలంకషముగఁ బ్రవహించుచున్న గోదావరి నెట్లు తరించి వచ్చితివి? అయ్యో! అదేమట్లు వడకిపోవుచున్నావు! ముందా తడిదుస్తులను మార్చుకొనుము" అనెను.

పాటలి పుండరీకుని పాదములకు నమస్కరించి తన వస్త్రములను పిండి పొడిబట్టలు ధరించి కుటీరమున వెచ్చదనముకై

యుంచఁబడిన నెగడి సమీపమున కూర్చుండెను.

పుండరీకుఁడు : ఏమయినను నీవు చేయరాని సాహసములఁ జేయుచున్నావు. నీ సాహసము నాకు నచ్చలేదు. ఈ భీషణ విలయ తాండవోన్మాదినియైన గౌతమిని దాటుటకు మానవులెవ్వరు సాహసింతురు! శత్రునిబిడమైన యీ ప్రాంతములనిట్లు నిర్భయముగ సంచరించుటలో నీ యభిప్రాయమేమి? నీవసలాడదానివేనా?

పాటలి నవ్వి—"కాను కాను! నేనాడుదానను. ఆడించెడి దానను" అనెను.

పుండరీకుఁడు : ఇది స్త్రీ జనోచితమైన కార్యమెంతమాత్రము కాదు. నీవసలు స్త్రీవి కావు.

పాటలి : అవును స్వామీ! ఈ పాటలి పుండరీకుని కొక్కనికె స్త్రీ. మిగిలినవారందఱకు గుండెగాలమైన ముగ్ధదీపుఁడు.

పుండరీకుఁడు : ఏమీ! ప్రతిష్ఠానమున నీపేరు మ్రోగిపోవుచున్నదఁట! నీ పౌరుషము పట్టరానిదిగ నున్నదఁట!

పాటలి సిగ్గుపడి—"స్వామీ! ఇంక నెంతయో యున్నది. ఈ ముగ్ధదీపుని ప్రేమించి ప్రాణముపెట్టు యువతి యొకర్తుక యున్నది!"

పుండరీకుని కాశ్చర్యముగ నుండెను.

పుండరీకుఁడు : ఆఁ! నిజమా? ఎవరా సుందరి?

పాటలి : ప్రతిష్ఠానమునందలి రాజప్రతినిధి భూమకుని యేకమాత్రదుహిత శాలిని!

పుండరీకుఁడు : చాల చిత్రముగనున్నది. నీవు నిజముగ పురుషుఁడవగుదువేమో! నేనేమి కావలెను?

పాటలి : మీకు పాటలియే దొరకదా!

పుండరీకుఁడు : హాఁ అపాటు. పాటలీ! నా ప్రభు వేకపత్నీ వ్రతుఁడు, నేను నంతియే!

పాటలి : స్వామీ! క్షమించుడు. చమత్కారమున కంటిని. ఇదిగో యంగుళీయకమును గ్రహింపుడు. శాలిని నా కొసఁగినదిది. దీని సహాయమున యీ నా ముగ్ధదీపనామాంకితమైన నీ యుంగరమును జతపరచి శాలిని నెప్పుడైన తనభవనము దాటింపవచ్చును. అది యామె తీర్పు. మీరు శాలినిని తీసికొనివచ్చి మహారాజమాత గౌతమీబాలశ్రీదేవివద్ద కామెను పంపవలయును. ఆమెను సముచిత సకల మర్యాదలతో చూచునట్లు నా విన్నపముగ నివేదింపుడు.

పుండరీకుఁడు : అవును పాపమామె నీ ప్రియురాలుగద.

ఇరువురు సెలవివార నవ్వుకొనిరి.

పుండరీకుఁడు : పాటలీ! నీవు నిజముగ నఖండప్రజ్ఞా శాలినివి. లేనిచో ననుభవశూన్యవైన నీవు ప్రథమముననే యంతటి నీతిని నెఱపి ప్రతినిధి కూతును పట్టితివన్న నిన్నెట్లభినందించ వలయునో తెలియుటలేదు.

పాటలి : ఇందు నాప్రజ్ఞ యేమున్నది ? సర్వసాతవాహన దళాధిపతులై సేనానులైన పుండరీకుని యిల్లాలితనము, రాజమాత గౌతమీబాలశ్రీదేవి శిష్యరికము నన్నట్లు తీర్చినవి.

పుండరీకుఁడు : నేను నిజముగ గర్వించుచున్నాను. పాటలీ ! నీవు నా జీవితప్రాంగణమును ముగ్ధదీపశిఖవై వెలిగించుచున్నావు. నీవు నా సహచరివను భావము నాకుఁ జాలును. ఇట్టి సమరములను వందలు జయించగలను.

పాటలి : సాతవాహనులకిట్టి యుద్ధావసరములు మఱిరావు. ఈ సంగ్రామమున క్షహరాట వంశము నిర్మూలింపబడును. శాలిని నాకు కొన్ని సంగతులు చెప్పినది. వానినిబట్టి నేనిట్లు చెప్పగలుగు చున్నాను.

పుండరీకుఁడు : ఓహో ! ఆమె నీకు శిష్యురాలుకూడ కాబోలును !

పాటలి : మఱి యేమనుకొంటిరి ! సరేకాని నేను కల్యాణి కెప్పుడు పోవలయును ?

పుండరీకుఁడు : రెండు మూఁడు రోజులలో వెళ్ళవచ్చును. అచ్చట మన యమదంష్ట్రికా దళమువారున్నారు. వారు నిన్నన్ని విధముల కనిపెట్టి యుందురు. పాటలీ ! అచ్చట రాజమరాళుఁడు సర్వసేనాపతి. వానిని జాగ్రత్తగ వలలో వేసికొనవలయును. వాడంగనా జనవ్యామోహితుఁడఁట. ముగ్ధదీపుఁడవై యాతని నడల గొట్టుము. దీపశిఖవై వానిని తగులబెట్టుము. తెలిసినదా ?

పాటలి : చూచెదరుగద! అకరావంతిలో యుద్ధగతి ఎట్లున్నది?

పుండరీకుఁడు : నీకు తెలియదా ? మన సేనలకరావంతిని గెల్చుకొన్నవి.

పాటలి : నిజమా ! ఇది మన విజయ పరంపరలకు నాంది.

పుండరీకుఁడు : ప్రతిష్ఠానమును నీవు జయించితివి.

పాటలి : అదెట్లు ?

పుండరీకుఁడు : అచ్చటి రాజప్రతినిధి కొమార్తెను సాధించి తివి. దానితో నిఁక నా నగరము మనదన్నమాట !

పాటలి : మఱి యిక నేను పోయివత్తునా ?

పుండరీకుఁడు : అదియేమి ! వర్షమింకను వెలియలేదు.

పాటలి : నేను వచ్చునపుడు వర్షము వెలిసియుండెనా ?

పుండరీకుఁడు : నేనుకూడ వచ్చెదను.

పాటలి : వలదుస్వామీ ! వలదు. మీకుఁ దెలియదు. నేను నా చిన్నతనమునుండి కృష్ణాతరంగిణి నీదరినుండి యాదరికీదు చుండెడిదానను. నాతో నెట్టి గజయీతగాడును పోటీచేయలేడు. మీ రిచ్చటనే ఆగిపొండు. నేను నిమేషమున నాదరినుండగలను.

పుండరీకుఁడు : పాటలీ ! నీవంతటి దానవే యగుదువు. సందేహములేదు. కాని నా మనస్సంగీకరింపవలెగద !

పాటలి : రేపు సమరాంగణమున శత్రువుల చేతిలో చిక్క వచ్చును. మరేమైనఁ గావచ్చును. అప్పుడు మీరు వేరొకచో నుండ వచ్చును. మీ మనస్సేమి చేయఁగలదు ? పోనిండు.

పుండరీకుఁడు : పాటలీ ! నీ మనస్థైర్యమునకు, నీ యను రాగమునకు నేనవశుఁడనై పోవుచున్నాను. సరి పోయిరమ్ము. రేపు సునందునకు నా క్షేమమును తెలియఁజేయుము.

పాటలి : అటులనే !

పాటలీ పుండరీకు లిరువురు కుటీరము వీడి వానలో నడచుచు గోదావరీ తటమునకు వచ్చిరి.

పుండరీకుఁడు : కాకితో కబురువెట్టిన నేను వచ్చెడివాడను కద ! నీ వొంటరిగ నిట్లు ప్రళయ వర్షానిశీధి నీనది నీదివచ్చుట మరల నట్లే సంతరణ మొనర్పనుండుట భరించలేకున్నాను.

పాటలి : నాకు వచ్చిన యాపదలేదు. మిమ్ము చూడవలెనని పించినది. వచ్చితినంతే !

పాటలి సరసర పామువలె నదిలోని కేగినది. ఆ కటిక చీఁకటిలో కన్ను పొడుచుకొన్నను ఏమియు కనిపించుట లేదు. గోదావరి ఘోష. వర్షబిందువులు జలతరంగములపైఁ బడుచున్న ధ్వని పెనుగాలి మ్రోత ! పుండరీకుని గుండెలో బాధరేగినది. పాటలి నా హృదయరాజ్ఞి యేమగునో ! ఆమె తన హృదయములో నెన్ని యందముల నింపినది ! ఎన్ని మధురోహలఁ గల్పించినది ! ఎంత యనురాగము చిందినది ! పాటలికి సర్వ దేవతలు రక్ష యగుదురు గాక ! తల్లి గోదావరి పాటలిని సురక్షిత ముగ తీరమును జేర్చుగాక !

పుండరీకుఁడు బరువుగుండెతో కుటీరమునకుఁ జేరుకొనెను.

ఆ మరునాడు దీపశిఖ కల్యాణి నగరమునకుఁ బోయెను.

"ఆత్మచ్ఛంద భ్రామక దుర్లభలభ్యం మృగయసహాణ
ఆకాశపథైః భ్రామ్యత్ కదాపి హృదయాయి భంక్ష్యసే తాత."

ఎవ్వరిని విశ్వసింపక దుర్లభమైన జనమును వెవకెడుదానా, హృదయమా! ఆధారములేని మార్గమునందు సంచరించుచు చివరకు భంజింపఁ బడుదువు.

ధాన్యకటకమునుండి సైన్యములు నేల యీనినట్లుగ బయలు దేరినవి. సేనయంతయు నాలుగైదు భాగములుగ త్రోవలు బట్టి వడచుచున్నది. గౌతమీపుత్ర సాతకర్ణిమహారాజు తానై స్వయముగ సేనను మహారాష్ట్రప్రాంతమునకు నడుపుకొని పోయెను. శత్రు వేదిక్కునుండి యెత్తివచ్చినను నెదిరించుటకు సర్వసన్నద్ధులై సేనానాయకులెల్లరు ప్రతీక్షించుచుండిరి. అకరావంతి స్వాధీనమగు టతో సాతవాహన సైన్యమున నుత్సాహ మినుమడించినది. పాటలి నేర్పుచే ప్రతిష్ఠానము కరగత మయినట్లే యనిపించుచున్నది.

శాలిని ధాన్యకటకమునకుఁ గొనిరాబడినది. గౌతమీదేవి పాటలి బుద్ధి విశేషమునకు రాజనీతివైశద్యమునకు వెఱగంది మనసులోనే యామె నభినందించెను. పాటలి నెచ్చటికి పంపిన నచ్చట విజయలక్ష్మి తాండవించు ననుకొన్నదామె. పాటలి తిరిగి రాజధానికి వచ్చినప్పు డామెను రాజమాత ఘనముగ సమ్మానింపఁ దలచెను. పాటలీపుండరీకు లిర్వురుఁజేరి యద్భుతములను సృష్టించుచున్నారు. వారి కసాధ్యమనునదే లేనట్లున్నది. వారొకరి నొకరు గాఢముగఁ బ్రేమించుకొన్నారఁట. వర్షాసమయపు టర్ధరాత్ర మున వఱదకెక్కిన గోదావరీ నదీ సంతరణ మొనర్చి పాటలి తన ప్రియునిఁ గలసికొన్నదనిన నిజముగ నామె మానవయువతి కాదు. ఆ ప్రేమ లక్షణమునట్టిదే. వారిరువురికి వివాహము గావించి వారిని రాష్ట్రాధిపతులను జేయవలయును. నాటి నాట్యప్రదర్శనావసరము ననే పాటలిలో నిట్టి యసాధ్యముల సాధ్యము గావించగల లక్ష ణములను తాను దర్శించినది. ఆమె తన పథకము పూర్ణముగ ఫలవంత మొనర్చుచున్నది. తా నామెకు విద్య నేర్పినదనగా నది శతాధికముగఁ బ్రజ్వరిల్లి శత్రువుల మండించును. ముగ్ధదీపుఁడు

దీపశిఖగ నిర్వహించిన కార్యము లనితరసాధ్యములు. అన్నియు నొకయెత్తు. శాలినిని తెచ్చుటొకయెత్తు. అసలా పథకమే.పరమాశ్చ ర్యముగ నున్నది. రాజకీయములలో చిత్రచిత్రములైన యనుభవ ములు కలుగుచుండును. అట్టిదిమాత్రమనిదం పూర్వమైనది. ఆలో చించినకొలఁది గౌతమీదేవికి పాటలి చర్యలద్భుతము లనిపించెను.

కల్యాణి మహానగరమున దీపశిఖానృత్యము లెడతెఱపి లేకుండా సాగుచుండెను. నగరమునందలి మహా ధనికులు, సేనా పతులు, మంత్రులు, నితరోన్నతోద్యోగులెల్లరును దీపశిఖ నభిమా నించువారే. ఆమెచేత తమ భవనములందు నాట్యప్రదర్శనముల నిప్పించుకొనువారే. తమ సంతానమునకు నృత్యశిక్షణము నేర్ప రచుకొనువారే. ఆమె యెల్లరకు ప్రీతిపాత్రురాలయ్యెను.

ఒకటి రెండుసార్లు శిశునందిమహారాజు నాస్థానమున సైత మామె నాట్యప్రదర్శనము జరిగెను. శిశునంది తన్నాస్థాన నర్తకిగ నియమించుకొన నెంచుచున్నాడని యొక వార్త వచ్చినది. తాను ధాన్యకటకమున బయలుదేరినవేళ చాల మంచిదనియే చెప్ప వలెను.

ధాన్యకటకమున పాపము శాలిని యేమనుకొనుచున్నదో! ఆమె యెంతటి యమాయకురాలు! రాజనీతి యెంత నిర్దాక్షిణ్యమైనది! తల్లియనిలేదు, తండ్రియనిలేదు, ప్రేమలేదు, జాలిలేదు. సాత వాహన రాజొకఁడు భార్యను కత్తెరవిసరి చంపెనఁట! భార్యాభర్తలై కూడ యొకరిపట్ల నొకరికి విశ్వాసముండదు. వికుంఠపురమున నాడుచుపాడుచు యథేచ్ఛముగ సంచరించిన నా పాటలికిని, రెం డేండ్లనుండి రాజకీయ జీవితమున ప్రతిపదమును తూచివైచుచు నే నిముసమున మృత్యుగహ్వరమున పడునో యన్నంత ప్రమాదభరిత మైన గూఢచారిణీజీవితము గడపు నీ పాటలికిని పోలికయెక్కడ!

నాడు ప్రతిష్ఠానమున ముగ్ధదీపుఁడై శాలినిని మోసగించి రాజ ధానికిఁ బంపుటయినది. నేడింకొక క్రొత్త బెడద వచ్చిపడినది. క్షహరాట రాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రాజమరాళుఁడు పట్టి స్త్రీలో లుఁడు. వానిని తట్టుకొనుట పాటలికి మిగుల కష్టముగ నున్నది. నెలకు నాలుగయిదు పర్యాయములైన నాతఁడు తన భవనమున నృత్యప్రదర్శనముల నేర్పాటు చేయును. స్వయముగ నాతఁడు తన యావాసమునకు వచ్చును. వచ్చినప్పుడెల్ల నాతఁడు పోవు పోకళ్ళనంత విధములుగ నుండును. ఈతనికన్న నా వప్పస్వామియే నయమనిపించును. తన్ను నోరువిప్పి యడిగెనుకూడ. తనస్వామి

తన్నెట్టి త్యాగము చేసియైన దేశమును పరాధీనము కాకుండఁ జేయు మనెను. తన సౌందర్యాగ్నిలో నాతని మండించు మనెను. దాని యర్థమేమి! ఛీ! తా నట్టిపని చేయగలదా! వాని నెట్టు తనవశ మొనర్చుకొని కార్యమును సాధించవలెనో తెలియుటలేదు. సంవత్స రముగ తానీబాధ పడుచున్నది. ఆతనిని మాయచేసి మురిపించి వలలో వైచికొనినచో క్షహరాటరాజ్యము సాతవాహనసామ్రాజ్యములో కలసిపోగలదు. కాని దీని నెట్లు నిర్వర్తించవలెను? తనజీవితము దినదినము క్లిష్టాతిక్లిష్ట మగుచున్నది. ఈ వాగురలోనుండి బయట పడి తాను తనభర్తయుఁ గలసి మెలసి సుఖించు టెన్నటికో!

భూమకుని దయావిశేషమున శిశుసంది కొలువులో ముగ్ధ దీపునికి నెల కిరువది కార్షాపణముల వేతనముపై నుద్యోగము చేకురినది. ధనమున్నది గౌరవమున్నది. పేరు ప్రతిష్ఠలున్నవి. బ్రదుకుమాత్రము సంశయగ్రస్తముగ నున్నది. ఏక్షణమున నే యాపద చుట్టివచ్చునో యే నిముసమున రాజసైనికులు తన గృహ మును శోధించి తన్ను బంధింతురో! అంతయు దినదినగండము నూతేండ్లాయుర్దాయ మనునట్లున్నది.

పుండరీకుఁ డెచ్చటనున్నాడో! నాడు గోదావరీతటమున నర్ధ రాత్రమున చూచుటేగాని మరల చూడలేదు. వికుంఠపురమున తనవారంద టెట్లున్నారో! తమ సైన్యము క్షహరాటరాజ్యపు సరిహ ద్దులలో తీర్చియున్నది. క్షహరాటులుకూడ సామాన్యులు కారు. వీరిని యుక్తిచేత సాధింపవలసినదేకాని కేవలము బహిరంగముగ పోరాటములతో జయింపరాదు. అయిన తమ సైన్యములకు నీసైన్యములకు ముఖ్య భేదము కలదు. అందెల్లవారు సుశిక్షితులు. వీరు శక్తిమంతులయ్యు సరియైన వ్యవస్థ లేనివారు. రాజమరా ళుఁడు సమర్థుఁడయ్యు విలాసప్రియుఁడు.

మొన్నటి యుత్సవములలో నాతని ఖడ్గవిద్యావైశారద్యము విలువిద్యాపాటవము తాను కన్నులార చూచినది. మనసుంచి ప్రవర్తించినచో నాతఁడు శత్రువులకు దుర్నిరీక్ష్యుడగును.

దీపశిఖ తనమందిరమున నిట్లాలోచించుచుండెను.

రాజమరాళుఁడు వచ్చుచున్నట్లు వార్త వచ్చెను. దీపశిఖ విసుగుజెందెను. ఆతని మన్నించక తప్పదు. దీపశిఖ యెదురేగి రాజమరాళుని సవినయముగ తోడితెచ్చెను. ఆయనకుచిత మర్యా దలు చేసెను. రాజమరాళుఁడు దీపశిఖను కన్నులతోఁ ద్రావు చుండెను. దీపశిఖ మనస్సునం దేవగించుకొనుచునే పైకి వినయ

మును ప్రదర్శించుచు—"సేనాపతులు నే డిచ్చుటికి విజయము చేయుట నా భాగ్యవిశేషము. ఈ దీనురాలివలనఁ గాదగిన కార్యము లేమైన నున్నవా ?" యనెను.

రాజమరాళుఁడు : నీవు దీనురాలవగుటెట్లు ? ఆ మాట నాకు వర్తించును.

దీపశిఖ : ఎంతమాట ! మీరు సకలకహరాట సర్వసేనాపతులు. మీరు తలఁచుకొనిన మహారాజపదమును స్వీకరించగల సమర్థులు. మీ యాజ్ఞలఁబడి సర్వసేనానివహములు నిప్పులు నుఱుకుమన్న నుఱుకును. మీరు దీనులగుటయేమి ? నా కర్థమగుటలేదు.

రాజమ : అవును. నీ వనునది నిజమే. కాదనను. కాని యీ సర్వసేనాధిపత్యము నీకడగంటి చూపుతూపులకు లోకువైపోవుచున్నదిగద ! నా వేడికోలు లన్నియు నూసరక్షేత్రమునఁజల్లిన బీజసదృశములయి పోవుచున్నవిగద !

దీపశిఖ : నేడేమో చిత్రముగ మాటాడుచున్నారు ! మీరు నన్ను వేడుకొనుట ! ఏదో మీ దయావిశేషమున నీ నగరమున నృత్యప్రదర్శనముల నాట్యప్రదర్శనముల నిచ్చుచు జీవికా నిర్వహణ మొనర్చుకొనుచున్న యతి సామాన్యురాలిని మీరు వేడుకొనుటయు నది ఫలింపకపోవుటయునా ?

రాజమ : ఈమాటకేమిలే ! సంవత్సరముగ నర్థించుచున్నాను. ఫలితమేమున్నది ! నీకుమాత్రము తెలియదా ?

దీపశిఖ : మీరిటుమాటాడిన నే నేమనఁగలను ? దేశముకాని దేశమున నీతిగ బ్రతుకు వెళ్ళదీసికొనుచున్న నన్ను రచ్చ కెక్కించుట తమబోంట్లకు న్యాయమగునా?

రాజమ : రచ్చకెక్కించుటయేమి. నీవు తెల్లవారినదిమొదలు రచ్చలో విహరించుటయేగద చేసెడిది. రాజస్థానము నుండి వచ్చిన నిన్నందల మెక్కించి కల్యాణినగరమందంతటను నీపేరు మ్రోగిపోవునట్లు చేయించినందులకు నాపై నిట్టి నిష్ఠురములు పలుకుచున్నావు. నీపై నాకు విపరీతమైన యభిమాన ముండుట చేతనేగద నీ విట్లు మాటాడునది !

దీపశిఖ : అటు లనకుడు. నాకుమాత్రము మీరన్న కృతజ్ఞత లేదనుకొంటిరా ? కాని దేనికైనఁ గాలము కలసిరావలెగద !

రాజమ : ఆ కాలమెప్పుడు వచ్చునందువు ? నే వేడాపిగ దీపశిఖా సౌందర్యాగ్నిలో దహించుకొని పోవుచున్నాను. తుదకి

జ్వాలలో శలభమువలె నగుదు నేమోయని భయముఁ జెందు చున్నాను. ఇన్నాళ్లకు నీనోటివెంట నీమాటయైన వచ్చినది. అంత వరకవృష్టవంతుఁడ ననుకొందును. నీకు పూర్ణానుగ్రహము వచ్చి నప్పుడే చూచెదములెమ్మని యుపేక్ష చేయుచున్నాను.

దీపశిఖ : పాపము ! లేకున్న నేమిచేసెడివారు ?

రాజము : బలాత్కారము ! కాని నాకది యిష్టము లేదంటిని గద !

దీపశిఖ : అదిసరే, ఆ విషయముఁ జెప్పుఁడు.

రాజము : ఏ విషయము ?

దీపశిఖ : మిమ్మంగీకరించుట వలన నాకగునదేమున్నది ? ఇప్పటికే యసంఖ్యాకముగ మిమ్మంగీకరించిన వారలలో నేను మరియొకతె నగుదును. అంతియేగద !

రాజము : ఎంతమాట ! వారందఱు నీకాలిగోటికెనగారు. నేను వారిని వాంఛింతునేని తమ బ్రదుకులు పండునని యఱ్ఱులు సాచుచు కూర్చున్నారువారు. నీకోసమే నేను తపించి పోవు చున్నాను. నే నేడాదిగ నామనస్సులో నెంతటి వేదన పడుచున్నానో నీకుఁ దెలియునా ?

దీపశిఖ : ఓహో ! నాకంటె నంపగత్తె లభించిననాడు ఆమెవద్ద నన్నుగూర్చి మాటాడున విట్టిమాటలే యనుకొన వచ్చునా ?

రాజము : అబ్బా ! నీవు మాటకారివి. నీతోమాటాడుట కష్టము. ఈ సృష్టిలో నిన్నుమించిన సుందరాంగి యుండదు.

దీపశిఖ : ఉండినచో నంతియేకదా !

రాజము : నన్నుచంపకుము. ఉండదంటినిగద. ఒకవేళ నుండినచో, నీవే నన్నింత వేధించు చుంటివి. ఇఁక నామె యెంత వేధించునో !

దీపశిఖ : వేధించకుండ నంగీకరించుచో సంతియేగద !

రాజము : దీపశిఖా ! నా ప్రాణములను తోడుచున్నావు. నీ వేమి చేయుమన్న నది చేసెదను. నన్ననుగ్రహింపుము. నిన్ను శిశునంది మహారాజు నాస్థానమున రాజనర్తకిగ నియమించుటకు యత్నించితిని. నీవింక నేమి చేయుమందువు ?

దీపశిఖ : ఓహో ! ఈయత్నము మీచేనైనదా ? తెలిసినది. నాకొఱకేమైనఁ జేయగలరా ?

రాజము : తప్పక చేయగలను.

దీపశిఖ : మాట తప్పరాదు. అది యెట్టిదైననసే.

రాజమ : అడి తప్పు లక్షణము నాకులేదు.

దీపశిఖ : అయినచో నేటికి పదునేడవరోజు పౌర్ణమినాడు నా వద్దకు రండు. అప్పుడు చెప్పెదను.

రాజమ : అటులనే కాని యింత దీర్ఘకాల వ్యవధానమా?

దీపశిఖ : తప్పదుమరి !

రాజమ : కానిమ్ము, నీయాజ్ఞాబద్ధుండను. రేపు మన భవనమున నీ నాట్యమున్నది. మరవలేదుగద !

దీపశిఖ : నా వృత్తియే యది. ఎట్లు మరతును ? ఎల్లుండి కోటలో సైతము నా నృత్యప్రదర్శన మున్నది. మీరు వీలైనచో విచ్చేయుండు.

రాజమ : తప్పక వచ్చెదను. నా దీపశిఖ నృత్యమును, నేను రాకుండుటయునా ?

దీపశిఖ : మీరన్యథా భావించరేని నాకు పూజా సమయ మైనది.

రాజమ : నాకును పనులున్నవి. మా రాజ్యముపై సాత వాహన ప్రభువు దండెత్తివచ్చుచున్నాడు. ఆయన కల్యాణీ నగరమును ముట్టడించునంట. సంగ్రామ మాసన్నమగుచో మా కూపిరి తీసికొనుటకుఁగూడ సమయముండదు.

దీపశిఖ : ఆంధ్ర సాతవాహనులంత సామర్థ్యము గలవారా ?

రాజమ : ప్రస్తుతమున్న రాజ్యములలో సాతవాహనుల రాజ్యమంతటి విస్తీర్ణమైనదిలేదు. ఆంధ్రులు మహావీరులు. వారు ప్రాణములకు తెగించి పోరాడుదురు. విజయమో వీరస్వర్గమో యనునట్లు చరింతురు. వారితోడి పోరు శక్తికి మించిన విషయము.

దీపశిఖ : మీవంటి సేనాపతుల యాధిపత్యమున సాతవాహనులు నిల్వఁజాలుదురా ?

రాజమ : అవుననుకొనుము. చాలకాలముగ యుద్ధములు లేనందున మా సైనికులు విలాసప్రియులై యాయుధములకు త్రుప్పు పట్టించుకొని యుద్ధ విముఖులుగ నున్నారు. మరల వారలనందఱి సమీకరించవలె. వారందఱకు శిక్షణ నీవలెను.

దీపశిఖ : మీరే యుద్ధమున కనభిముఖులుగ నున్నట్లున్నారు !

రాజమ : అట్టిదేమియులేదు. నేనెప్పుడును సిద్ధమే. ఈ శిశునంది మహారాజు యుద్ధోన్మాదికాడు. సహసానుఁడన్నచో నాయన మహాయోధుఁడు. వాని యంశ యీయనలో నల్పిష్ఠమైనది.

దీపశిఖ : అయినచో నేమందురు ? శిశునంది మహారాజు యుద్ధము నామోదించునా ?

రాజమ : ఆమోదించుటకు నామోదించకపోవుటకు నాయన యెవరు ?

దీపశిఖ : అదేమట్లందురు ? ఆయన మహారాజుగద !

రాజమ : ఆఁ! ఆయన నామమాత్రమునకే మహారాజు.

దీపశిఖ : అదియేమి ?

రాజమ : అదియంతే. రాజ్యమంతయు నా భూమకుండు, నింకొకరిద్దరు ప్రతినిధుల యధికారములో నున్నది. వారెంతచెప్పిన నంత.

దీపశిఖ : వారికి మీయందంతగ విశ్వాసములేదా ?

రాజమ : వారి విశ్వాసముతో నాకేమిపని ?

దీపశిఖ : వారధికారము నెఱపునపుడు వారియధికారము మీపైమాత్రముండదా ?

రాజమ : నేను వారి యధికారమును మన్నించను. నా సైన్యము నా యధీనమున నున్నంతవర కెంతమంది భూమకులైన నను నన్నేమియుఁ జేయఁజాలరు.

దీపశిఖ : అటులైన మిమ్ము నిరసనచేసి వారేమి చేయఁ గలరు ?

రాజమ : అదేమో నాకర్థమగుటలేదు. వారలకు నా శక్తిసామర్థ్యములు తెలియుటలేదు.

దీపశిఖ : మరి యట్టివారి కొల్వులో పనిచేయుటెందులకు? మీరే రాజ్యమున నున్న నా రాజ్యము ధగధగలాడును.

రాజమ : అవును. నీవన్నది నిజమే. ఏదో దేశాభిమానమును పురస్కరించుకొని కొల్వు సేయుటేగాని లేనిచో వీరందఱు నాకొక లెక్కయా ?

దీపశిఖ : పోనిండా గొడవ యెందులకు? నేనిఁక పూజకు పోవలెను.

రాజమరాజుఁడు వెడలిపోయెను.

దీపశిఖ సర్వమును తన పథకమున కనుకూలముగ సాగుచున్నదనుకొనెను. తన సౌందర్యమెరగ నాతనిఁ లోబరుచుకొన్నచో తనవచ్చిన పని పూర్తియైనట్లే. భూమకుఁడన్న నీతనికి ద్వేషమెందులకో ! కొంపతీసి యితఁడు శాలినిని వాంఛింప లేదుగద ! అట్టిదే జరిగియుండును. కాంతాకాంచనములఁ బురస్కరించు

కొనిగాని ద్వేషమును పగయు రగులవు. అందు మొదటిది మరియు బలీయమైనది. ఏమిటో యీ లోకము! సృష్ట్యాదినుండి యీ వైరము లిట్లేసాగుచున్నవి. కాని యెప్పటికప్పుడు క్రొత్తగ నని పించుచుండును. ఆనాడు రావణునకు తాను చేసినది న్యాయమని పించినది. కీచకునికి సైత మట్లేతోచినది. వారిరువురను విధి తగిన రీతిని శిక్షించినది. అది యందఱకు ప్రియమైనది. వారల చరిత్ర ములు నిత్య పారాయణ గ్రంథములే కాని, మరల నట్టివే యప రాధములు! ఈ మానవసృష్టి యెంత విచిత్రమైయినది! కోట్ల కొలది సంవత్సరములుగ యుగములుగ మన్వంతరములుగ జీవులు పుట్టుచున్నారు. చచ్చుచున్నారు. ఎప్పటికప్పటికి బుద్ధి వచ్చినట్లుందురు. కాని మరలరాదు. ఇది మాయా లక్షణము. ఈ మాయ లేనిచో సృష్టిసాగదు. అసలీ సృష్టి లేకున్ననేమి? ఉన్నను ఇన్నిలక్షల రకముల జీవరాసులు, వృక్షములు, గుల్మలతాదులు అంతయు పరమాశ్చర్యముగ నున్నది. మానవులుత్కృష్ట జీవు లంట! వీరి యాత్కృష్ట్యమేమి? వీరిలో నున్నన్ని పోకిళ్ళు భేద భావములు పగలు సెగలు నాశ్చర్యములు. ఏ జంతువులలోగాని పశువులలోగాని యిట్టివి యింతప్రబలముగ నున్నట్లు తోచదు. ఇది యంతయు నాగరికతయంట! ఇదేమి నాగరికతయో! పశువునకు మానవునికిగల మొదటిభేదము మనస్సు, విజ్ఞానము. అంతటితో నాగిన నెంత బాగుండెడిది!

ఈ కాంతా కాంచనములందలి మోహముచే మానవ నాగర కత కళ్మలమైపోయి నట్లున్నది. పశుపక్ష్యాదులు ఋతునిష్ఠములైన జీవులు. క్షుత్తు నార్చుకొనుట కాహారము, శ్రమదీర్చుకొనుటకు నిద్ర. వానికున్న నియమములుకూడ నీ మానవులకు లేవు. ఈ సృష్టి రహస్య మేమో తెలియదు. మహర్షులు సైతము వివరింపఁ జాలకుండిరి. పోనిమ్ము. తనకెందులకీ వృథాయాలోచనలు! తానెంత తలచించు కొన్న నేమైనతేలునా పెట్టునా? కాని, భగవంతుఁడు తన్నిట్లు సృష్టించినాడేమి? లోకములో నందరాడుపిల్లలు పెండ్లిచేసుకొని సంతానమును గని నిర్విచార సుఖజీవనము గడపుటలేదా! తన మనస్సు తద్భిన్నముగ నేల నుండవలె? చిన్ననాటనుండియు తాను భావమయ జీవితమునే గడపినది. ఇప్పుడిఁక వైవాహిక జీవితము భావమాత్రమేయై సాగుచున్నది. తనమృత్యువుమాత్ర మనుక్షణము తన భావమును వెన్నాడుచున్నది.

తాను మహారాజమాతకు, సాతకర్ణి మహారాజునకు తన

ప్రాణాధికప్రియుఁడైన పుండరీకునకు మాతృభూమియైన యాంధ్ర సాతవాహన సామ్రాజ్యమునకు ఋణపడియున్నది. ఆ ఋణమును తన ప్రాణము నొడ్డియైన చెల్లించవలసినదే! తానెట్టికార్యమునకైన సిద్ధపడవలె. ధర్మముకంటె నీతియే తనకు కర్తవ్యము.

దీపశిఖ కృతనిశ్చయురాలై లోనికేగెను.

నాడు రాజాస్థానమున దీపశిఖ నృత్యము. సభాభవనమంతయు రసపిపాసువులచే క్రిక్కిరిసి యిసుకవేసిన రాలనట్లుండెను. దీపశిఖ యానాడు గాథా సప్తశతియందలి యొక శ్లోకమునకు రూపకల్పనముఁజేసి నాట్యానుగుణముగ మలచి యభినయింప సాగెను. ఆమె రాజస్థానీయురాలివలె నలంకరించుకొనినది. సీలమందల పైభాగమువరకు కుచ్చెలు లెక్కువగానున్న యెఱ్ఱనిపరికిణీ ధరించి పైతాణి రవికఁ దొడిగినది. సన్నని యాకుపచ్చని వలెవాటువేసి రెండు జడలు వైచికొని సర్వాంగముల వెండి బంగారునగలు ధరించి జగన్మోహనముగ పాడుచు నభినయించినది. నృత్యమాగిపోయినను ప్రజలకింకను నా యనుభూతి వదలలేదు.

శశినంది మహారాజు రెప్పవాల్చక దీపశిఖను దిలకించుచుండెను. రాజమరాళుని గుండె గుభిల్లుమనెను. శశినంది చూపు పడినచో ప్రమాదమే! నేడోరేపో దీపశిఖకు కోటలోనికాహ్వానము వచ్చును. అట్లే జరిగిన నింక తనపని హుళక్కి. రాజమరాళునికేమి చేయవలెనో పాలుపోవుటలేదు. ఏడాదిగ పడిగాపులు పడియుండగా నిప్పుడిప్పుడే సుముఖురాలగుచున్నదనిన దీపశిఖను శశినంది మహారాజాహరించునేమో! దీపశిఖను తాను పోగొట్టుకొనఁజాలఁడు.

ఒకవంక యుద్ధజ్వాలలు, దీపశిఖ వేరొకవంక, రాజమరాళుని మనస్సునకు నిలుకడ లేకుండఁ జేసెను.

దీపశిఖ మందిరమునకు పున్నమనాడు రాజమరాళుఁడు అలంకృతుఁడై యేగెను. దీపశిఖ భవనమంతయు దీపమాలికలచే నలంకృతమై యుండెను. అగురుధూపములచే సువాసితమై యుండెను. ఆ యలంకరణమంతయుఁ రాజమరాళుఁడు దీపశిఖకు తనయందుగల యనురాగమును వెల్లడించుచున్నదని మురిసిపోవుచుండెను. దీపశిఖ రాజమరాళునికి ఘనమైన మర్యాద చేసినది. అతని సమ్ముఖమున నృత్యమొనర్చినది. రాజమరాళుఁ డొడలు తెలియని యానందములో చొక్కి యుండెను. ఆమె యాతనికి ద్రాక్షాసవముఁ ద్రావనిచ్చెను. దానితో నాతని పరవశత్వము మిన్నంటినది. కొలదిసేపటిలోనే మాదకత కల్గినది. దీపశిఖ దానిని గమనించి

సంభాషణకుపక్రమించినది.

దీపశిఖ : భూమకుఁడేమనుచున్నాడు ?

రాజము : దీపశిఖా ! విన్నావా ? భూమకుఁడు వట్టి గర్విష్ఠి, పొగరుబోతు. శాలినిని నా కియ నిరాకరించినాడు.

దీపశిఖ : శాలిని యెవరు ?

రాజము : ఓహో ! నీకు తెలియదా ?

దీపశిఖ : అవును. ఇఁకనేమి మీరామెపై మనసు పడి యుందురు.

రాజము : అప్పుడు నా కీయ నిరాకరించినాడు. అది నీకాలి గోటికైన సాటిరాదు. దానినిప్పుడిచ్చిన దానిగ గూడ గ్రహించను.

దీపశిఖ : అదియేమి ? ఆ భూమకునికంత యతిశయమెందులకు ? క్షహరాటరాజ్యమంతయు మీ కనుసన్నల మెలఁగుచుండగా మిమ్ము నిరాకరించి యింతకన్న గొప్ప సంబంధము తన కూతునకుఁదేగలఁడా ! అతని కేమి తెలియును ? మీరు తలఁచుకొనవలెఁగాని మరుక్షణమున నీ క్షహరాటమునకు మీరు మూర్ధాభిషిక్తులు కాగలరు.

రాజమురాళుఁడు నవ్వి—"యథార్థము వచించితివి, దీపశిఖా ! నీకు మనస్సులు చదువుట తెలియునా ? నా మనస్సునందలి యూహ నెట్లు కనుఁగొనఁజాలితివి ?" అనెను.

దీపశిఖ : నిజమా! అంతకన్న సంతోషించఁదగిన దేమున్నది? ఇంతకు శాలిని సంగతి యేమయినది ?

రాజము : ఏమయినది ! ఏమికావలెనో అదియే యైనది. ఏమయినదో తెలియునా ? అది యెవనినో తీసికొని లేచిపోయినది.

దీపశిఖ : అయ్యో ! ఆ పని మీతో నైనచో బాగుగ నుండెడిది!

రాజము : ఆ సంగతి నాకేమి తెలియును? ఇప్పుడా భూమకుఁడు శిశునందితో మొఱపెట్టికొనినాడు.

దీపశిఖ : ఏమని ?

రాజము : తన కొమార్తెకొఱకు వెదికించవలె. అతనికా కూతురనిన ప్రాణము. శాలిని మాయమగుటతో భూమకునికి నడుము విరిగినది.

దీపశిఖ : మరి మహారాజేమనుచున్నాడు ?

రాజము : ఆయన యేమనును ? రాజునకు భూమకునిపై నమితప్రత్యయము. అది యిట్లయినది. ప్రతిష్ఠానమును శత్రువులు చుట్టుముట్టుదురఁట.

దీపశిఖ : అయినచో మీకు చేతినిండ పని తగిలినదన్నమాట! మీరాహవరంగమునకు సైన్యమును నడపెదరా ?

రాజమ : నాకేమవసరము ? భూమకుండే చూచుకొనును. లేనిచో నోడిపోవును.

దీపశిఖ : మీ శిశునందిమహారాజు ఆజ్ఞాపించిన పోమందురా?

రాజమ : నేను పోను. వాఁడొక ముసలినక్క.

దీపశిఖ : మరచితిని. శిశునంది మహారాజు నన్ను కోటకు రావలసినదిగ కబురు పెట్టినారు.

రాజమ : ఆ శిశునంది వట్టి కాముకుఁడు. మొన్న నీ నృత్య ప్రదర్శనమున వాని ముఖలక్షణములను పరిశీలించితిని. నీకాయన కబురు పెట్టునని యప్పుడే యనుకొనినాను.

దీపశిఖ : మరి నన్నిప్పుడేమిచేయుమందురు ?

రాజమ : వెళ్లితీరవలెనుగద—చాల చిక్కువచ్చి పడినది. నా దీపశిఖనాముసలిరాజు తాకరాదు. తాకినచో కాలిపోవలె !

దీపశిఖ : అది యెట్లు ?

రాజమ : నాకు మహారాజు భవనమునుండి రహస్యమార్గము తెలియును. సమయము తప్పి వచ్చుచో నాతని సమయించి యా మార్గమునుండి తప్పించుకొని రావచ్చును.

దీపశిఖ : మరి నన్ను బంధించరా ?

రాజమ : నీవే చంపితివని యెట్లనుకొందురు ?

దీపశిఖ : మీకా రహస్యమార్గమెట్లు తెలియును?

రాజమ : పిచ్చిదానా! నేను సర్వసైన్యాధిపతినిగద! నా గూఢచారిణు లెల్లప్పుడు రాణ్మందిరములో తిరుగుచుందురు. వారావులించిన ప్రేవులు లెక్కిడగలరు.

దీపశిఖ : మీ కన్నిరాజ్యములందిట్టివారుందురా ?

రాజమ : ఉందురు. సాతవాహన రాజ్యమున వాసుకియుని యొక గూఢచారిణి యున్నది. అది దేవాంతకురాలు! దాని మూలముననే మాకు ముగ్ధదీపుని వృత్తాంతము తెలిసినది.

దీపశిఖ : సరి. ఆ రహస్య మార్గమును చెప్పుడు. అవసర మగుచో నుపయోగింతును.

రాజమరాళుఁడు దీపశిఖ చెవిలో నేదియో చెప్పెను. దీపశిఖ మోము వెలిగిపోయెను.

రాజమ : దీపా! నేడు పున్నమ. మూఁడవ యంతరువునకు పోవుదమా ? నేడు నీ గృహము నింతయలంకరించితివి. నీవసతే

దీపశిఖవు. నేడు దీపమాలాలంకృతమైన నీ మందిరమున మరియు జ్వలించుచున్నావు !

దీపశిఖ : ఈ నాడు నా జన్మదినము. పైకిపోవుదమా ?

రాజము : మరినాకు చెప్పితివి కాదేమి ? వట్టిచేతులతో వచ్చితిని.

దీపశిఖ : చేతులు వట్టివైననేమి ? మనసు గట్టిగ నున్న చాలును.

రాజము : ఏ మన్నావు ? నామనస్సునే శంకించు చున్నావా ?

దీపశిఖ : శంకించుట కాదు. ఈ పాడుమనస్సు సంకల్ప వికల్పములతో తాడితమగుచుండును. ఇదొక క్షీరసాగరమథనము. అందులకంటిని.

రాజము : అందువలన నన్ను నాప్రేమను శంకించి మాటాడు చున్నావా ?

దీపశిఖ : లేదు.

రాజము : అయినచో నీనాడుపూర్ణిమ. పైపెచ్చు నీపుట్టిన దినమనుచున్నావు. నీకేమికావలెనో కోరుకొనుము.

దీపశిఖ : ఆఁ నాకేమికావలయును ! మీరు వచ్చినారంతే చాలును.

రాజము : అట్లుకాదు. నీవేదైన నడుగవలసినదే. నామనస్సీ నాడానంద పూర్ణముగ నున్నది. నీవడిగెద నంటివిగద.

దీపశిఖ : నిజముగ నడుగుమందురా ?

రాజము : సందేహ మెందులకు ?

దీపశిఖ : తీరా అడిగిన మీఁదట కాదందురేని నాకు తలవంపులుగ నుండును.

రాజము : అడుగుము. సందేహింపకుము.

దీపశిఖ : మీకు నాపైనున్న యభిమానమునకు కృతజ్ఞురాలను.

రాజము : కేవల మభిమానమేనా ?

దీపశిఖ : మీకు నాపైనంతటి యమేయమైన ప్రేమగలదేని దానినిరూపించుటకు మీబొటనవ్రేలిరక్తముతో నాకు తిలక ముంచుడు.

రాజము : ఇంతేనా ! ఇదిగో, యిప్పుడే నీకు రక్తతిలకము తీర్చెదను.

రాజమరాజుఁడు తన కుడిచేతి బొటనవ్రేలికి కత్తితో గంటు

పెట్టి యారక్తముతో దీపశిఖ ఫాలమున తిలక ముంచెను. దీపశిఖ యానందము నభినయించుచు—"నేను మిమ్ము విశ్వసించు చున్నాను" అనెను.

రాజమ : అయిన నన్ననుగ్రహింతువనుకొందును.

దీపశిఖ : తప్పక. దానికింకను నొకటిరెండు కోర్కెలను తీర్చవలసి యున్నది.

రాజమ : వానిని కూడ వ్యక్తము చేయుము.

దీపశిఖ : మీరింతటి సర్వసమర్థులై యుండియు నాశిశునంది భూమకుల యదీనములో నెందులకుండవలయును ? స్వయముగ మహారాజుకాదగిన మీరిట్లుండుట నాకు భరింపరానిదిగ నున్నది.

రాజమ : అయిన నన్నేమి చేయు మందువు ?

దీపశిఖ : నేను చేయుమన్నట్లు చేయుదురా యని !

రాజమ : ప్రమాణము చేసి చెప్పుచున్నాను. నీవేది చేయు మన్ననది చేసెదను.

దీపశిఖ : మీ సేనాపతిత్వమును వదలిపెట్టుండనిన త్యజింతురా ?

రాజమ : తప్పక వదలిపెట్టుదును.

దీపశిఖ : మీరీరాజ్యమును త్యజించి వేరొకరాజ్యమునకు పొండనినచో పోయెదరా ?

రాజమ : నిశ్చయముగ. నీవు నావెంట నుందువేని యెచ్చటి కైనఁ బోగలను. ఏమైనఁ జేయగలను.

దీపశిఖ : అయినచో ముందీ పత్రముపై చేవ్రాలు చేయుఁడు.

రాజమరాళుఁడు చేవ్రాలు చేసి యిచ్చెను.

రాజమ : ఇంకనేమి కావలెను ?

దీపశిఖ : మీ రిట్లు మాటాడెదరు. నా తలిదండ్రులు ధాన్యకటకమున నున్నారు. నేను నాట్యప్రదర్శనములకై రాజసాన మున కేగితిని. ఇప్పుడిటకు వచ్చితిని. నేను తొలుత గౌతమీపుత్ర శ్రీసాతకర్ణి యాస్థానమున నర్తకిగ నుంటిని. నాయాస్తిపాస్తులన్నియు

రాజమ : అయిన నేమి చేయుదము ?

దీపశిఖ : మీరంగీకరింతురేని నాదొకమనవి.

రాజమ : మనవికాదు. ఆజ్ఞ యనుము.

దీపశిఖ : మీరు కూడ ధాన్యకటకమునకు వత్తురేని యచ్చటనే మీరుద్యోగమును చూచుకొనవచ్చునుగద. సాతకర్ణి

మహారా జుదారుఁడు, సరసుఁడు. వీరులను గౌరవించు తీరెఱింగిన వాఁడు. ఇచ్చట నీ దేశమునందుకన్న నచ్చట నెక్కువగనే యుండవచ్చును.

రాజమ : అటులే చేయవచ్చును. దీపా! రాత్రిగడచిపోవు చున్నది.

దీపశిఖ : గడవనిండు ఇట్టి రాత్రులెన్నిరావు ?

రాజమ : అన్నిరాత్రులీరాత్రి కావుగద.

దీపశిఖ : ఏరాత్రికది యీరాత్రియేకద ! మీకిటువంటి రాత్రులెన్నిగడచినవికావు !

రాజమ : అబ్బ ! నన్ను విసిగించకుము దీపశిఖా ! ఇవి చేతులుగాదు కాళ్లు. నాపై దయ చూపుము.

అతఁడామె చేతులు పట్టుకొని ప్రార్థనా పరిదీనవదనుఁ డయ్యెను.

దీపశిఖ దానినదనుగ భావించి—మీకు సర్వాత్మనా నాయందు ప్రేమయున్నచో నందులకు నిదర్శనముగ నే నొక్కటి యర్థింతును. దానిని సైతము మీరు మన్నించవలయును.

రాజమ : దానికింత మనవి యెందులకు ? నీ యిష్టాను సారము నడుచుకొందు నంటినిగద !

దీపశిఖ : అయినచో వినుఁడు. మనదేశముపై గౌతమీ పుత్రుఁడు దండెత్తి వచ్చినాడుగద.

రాజమ : అవును.

దీపశిఖ : ప్రతిష్ఠానము నేడోరేపో పడిపోవును. విదర్భ అసక దేశములు కూడ లుప్తములయినవి. అపరాంతమున సంగ్రామము తుములముగ సాగుచున్నది. ఇఁక మీ రాజ్యమున మిగిలిన దేమున్నది ! సురక కుకుర అనూప పుష్కర తీర్థములేకద ! క్షహరాట రాజ్యమున సగముపైన శత్రుహస్తగతమైనదఁట. గౌతమీ పుత్ర శ్రీ సాతకర్ణి కార్యవ్యగ్రుఁడు, వీరుఁడు, ధీరుఁడును. ఆయన యీ పర్యాయమెట్లును పశ్చిమ దిగ్విజయ మొనర్చితీరును. మీకు కోపము వచ్చుచో నేనేమియుఁ జెప్పఁజాలను. లేనియెడల నీ భూమకాదు లాయన నేమిచేయగలరు ? ప్రతిష్ఠానమును రక్షించు కొననిండు చూతము !

రాజమ : అవును. నిజమే.

దీపశిఖ : కాబట్టి నా మనవి నాలించి మన కల్యాణి నగరము నకు గౌతమీ పుత్రుఁడు సైన్యసమేతుఁడై వచ్చినప్పుడు మీరు

సేనాపతులు గావున మీ సేనల నాయన సైన్యమునఁజేర్చి యాయనకు స్వాగతి నెఱపుచో మీకి సర్వసైన్యాధిపత్య మాయనయే ప్రసాదించును. మనము సాతవాహన సామ్రాజ్యమున సుఖసంపదలతో జీవింప వచ్చును.

రాజమ: నీ యభిమత మెట్లో యట్లే కానిమ్ము. అయినను నాకే రాజ్యమయిననేమి!

దీపశిఖ: నాయందనుగ్రహము చూపినందులకు మిక్కలి సంతసము. కొలదిగ పానీయమును స్వీకరింపుఁడు.

దీపశిఖ స్వహస్తముతో నాయునకు ద్రాక్షాసవముఁ ద్రావించి నది. రాజమరాళుడు దానిని సేవించి దీపశిఖను తన పార్శ్వమునఁ గూర్చుండ బెట్టుకొనెను.

రాజమ: దీపశిఖా! ఆ చందమామను చూడుము. నిన్ను జూచి తన కళంకమును దలంచుకొని సిగ్గుఁజెంది మబ్బులలో దాగుచున్నాడు. ఈ వెన్నెల యంతయుఁ బారబోసికొనిన, పిండిపలె వృధాయగుచున్నది.

దీపశిఖ కానాడు కృష్ణాతీరమున పుండరీకుఁడును తానును గలసి గడపిన మధుర జ్యోత్స్నాయామిని స్ఫురణకు వచ్చినది. పుండరీకుని స్థానమున రాజమరాళుఁడామెకు పిశాచమట్లనిపించెను. తాను కార్యార్థిని. కానిచో నాతని నచటనే మట్టుపెట్టఁగలదు. అందు వలన తనవచ్చిన కార్యము సాధింపఁబడకపోగా తన భర్తకుఁ గోపము రావచ్చును. దీపశిఖ రాజమరాళుని మధ్యవ్రేలున మెఱ యుచు రవలతో నాయన నామాక్షరములు పొదిగియున్న యంగు ళీయకమును స్పృశించుచు — "సేనాపతులు మిగుల కళాదృష్టి కలవారు. ఈ యంగుళీయక మెంత ముద్దుగ నందముగ నున్నదో!" యనెను.

రాజమరాళుఁడు దానిని తన వ్రేలినుండి తీసి అంత యందముగ నున్నచో నిదిగో నీవద్దనే యుంచుమనుచు దీపశిఖ వ్రేలి కుంచెను.

దీపశిఖ: నాకిది వ్రేలికి మించినదైనది. నా కెందుల కూరక యందముగనున్నదంటి నంతే.

రాజను: అది నీయొద్దనుండుటయే నా యభిమతము. నీ నా భేదము లిక మన యిరువురిమధ్య నుండరాదు.

దీపశిఖ: మీరెంత సహృదయులు! చాల ప్రొద్దుపోయినది.

రాజమ: అవును. నిద్రపోవుదమా?

దీపశిఖ : అవశ్యము. మీరింటికి పోవలయునుగద !

రాజమ : అదియేమి ?

దీపశిఖ : అదియంతే !

రాజమ : దీపా ! ఇదేమిపని ?

దీపశిఖ : మీరెంత సేనాపతులో నేనంత స్త్రీని. మీరు గౌతమీ పుత్రులకు బాసటగ నిల్చి సాతవాహన పౌరులై సేనాపతులైన శుభ ముహూర్తముననే మన సమాగమము జరుగగలదు.

రాజమ : అంతదనుక నాగవలసినదేనా ?

దీపశిఖ : తప్పదు. నన్నుగురించి మీకు భయమక్కరలేదు. నేను వంటయింటికుందేలు నెచ్చుటికి పోగలను !

రాజమ : అబ్బ ! అట్లు మాటాడెదవేమి ? నేను నిన్ను విశ్వసింపక పోయినఁగద ! నీ యభిమత మెట్లో యట్లే కానిమ్ము. సంవత్సరము వేచియున్నవాఁడను, నెలలోపిక పట్టలేకపోనుగద !

రాజమరాళుఁడు వెడలిపోయెను.

దీపశిఖ సంతృప్తితో గుండెమీఁద చేయివైచికొని దీర్ఘముగ నూర్పు తీసికొని యిది ద్వితీయ విజయమనుకొనెను. పుండరీకుని కీవార్తను నివేదించవలయును, తల్లి సాతవాహనీదేవి తనపైఁ బ్రేమ వీక్షణముల వర్షించుచున్నది. ఇఁక భయములేదు. దీపశిఖ నాటి రాత్రి సుఖముగ నిద్రపోయినది.

"ఏకాకీ మృగో మృగ్యా తదా హి దృష్టః
సతృష్ణయా దృష్ట్యా
ప్రియజానేర్వినిపతితం వ్యాధస్య
ధనుర్యాధా హస్తాత్"

ఒక కిరాతునియందు వాని భార్య మిక్కిలి ప్రేమగలది. అతఁడు చంపుటకు లేడిని వెదకుచున్నాడు. మగలేడి కనిపించినది. ఆ మగలేడిని ఆడలేడి ప్రేమగా చూచుచున్నది. దానిమీఁద నాతని దృష్టిపడినది. ఆతని ధనుస్సుకూడ క్రిందబడినది.

ఓసి నందినీ! నీకీ శ్లోకము నెవరుచెప్పిరి? ఏదీ మరల చదువుము. నందిని భయపడుచు నా శ్లోకమును మరల చదివెను. మహాప్రభూ! ఈ శ్లోకమును నాకొక యయ్యవారు చెప్పినారు. నెల దినములుగ నేను వారియొద్ద చదువుకొనుచున్నాను.

ప్రభువు: ఎవరా యయ్యవారు? ఎక్కడనుండి వచ్చినారు? మాయొద్దకొక పర్యాయము తీసికొనిరాగలవా?

నందిని: చిత్తము. అటులనే. తమ యాజ్ఞయైనచో తప్పక తీసికొనిరాగలను. మహాప్రభూ! ఆయన గొప్పకవియఁట! ఇట్టి శ్లోకముల నాయన యెన్నిఁటినో రచించినారు.

ప్రభువు: మా వద్దకు తీసికొని రమ్మంటిమిగద!

మరునాడు నందిని యాబ్రాహ్మణుని తీసికొనివచ్చెను. ఆ వచ్చిన యాతఁడు స్ఫురద్రూపి. ఎదుటివారి నట్టే యాకర్షించు కొనఁజాలిన వాక్చాతుర్యము కలవాఁడు. ధరించిన యుడుపులచేత రుద్రాక్షమాలలచేత విభూతిరేఖలచేత కుండలములచేత నాతఁడొక గొప్ప పండితుఁ డనిపించుచుండెను. అతఁడు వచ్చుచునే రాజునకు స్వస్తి వాచకము పల్కి యాయనపై నొక శ్లోకము నాశువుగ చదివెను. శిశునంది మహారాజాయనను ప్రశంసించెను.

శిశునంది: మీ పేరేమి?

బ్రాహ్మణుఁడు: వప్పస్వామి మహారాజా!

ప్రభువు: మీరేదేశవాసులు?

వప్పస్వామి: ఏదేశమైన నేమిలెండు!

శిశునంది : అదేమట్లందురు ?

వప్పస్వామి : మావంటి బ్రాహ్మణులకు మర్యాదలేనిచోటు. అచ్చట మా కవిత్వము పాండితి బూడిదంబోసిన పన్నీరగుచున్నది ! మా జీవితములకే ముప్పు వచ్చునట్లున్నది.

శిశునంది : ఇంతకు మీదేశమేది ?

వప్పస్వామి : ఆంధ్రదేశము. మాది ధాన్యకటకము మహాప్రభూ!

శిశునంది : మీమాటలాశ్చర్యముగ నున్నవే ! గౌతమీపుత్రుండు బ్రాహ్మణుండుగద. పైపెచ్చు ధర్మావలంబి. ఆయన రాజ్యమున బ్రాహ్మణులకు మిక్కిలి గౌరవమున్నదని చెప్పికొందురు.

వప్పస్వామి : మహాప్రభూ ! అవియన్నియు వట్టిమాటలు. నేతిబీరకాయలోని నేయివంటివి.

శిశునంది : అయిన నిప్పుడు మీ రాజు దండయాత్రలకు బయలుదేరినాడు గద !

వప్పస్వామి : మహాప్రభూ ! ఆయనకు దురాశ హెచ్చు. సర్వప్రపంచమున కేకైక నియంతయై తానొక్కండే పరిపాలించవలె నని దురాకాంక్ష. తా నొక్కండే జగదేకవీరుండ ననుకొనును. ఆయనకు ప్రోత్సాహము తల్లి గౌతమీబాల శ్రీదేవి !

శిశునంది : ఏమీ ! ఆమె సైతమంతటి ధీరురాలా ?

వప్పస్వామి : అట్టిదేమియు లేదుప్రభూ !

శిశునంది : ఇంతకు మీకా రాజ్యమున జరిగిన యవమాన మెట్టిది ?

వప్పస్వామి : నేను ప్రేమించిన స్త్రీని ఆయన గూఢచారి యొకండపహరించినాడు. నేను మహారాజుతో మొఱపెట్టుకొంటిని. కాని ఆయన పట్టించుకొనలేదు సరిగద నన్నే అపహసించినాడు !

శిశునంది : ఆ యపహాస మెట్టిది ?

వప్పస్వామి : నీవు వీరుండవైనచో నాతనితో తలపడి యాతని గెల్చి యామెను తెచ్చుకొనుము. చేతగానిచో నూరకొనుమనినాడు.

శిశునంది : బాగుబాగు ! రాజైన యాతండు చేయవలసిన దిదియా ? ఇదెట్టిన్యాయము ? ఇట్టివానిని ప్రజలు ప్రశంసించుటా !

వప్పస్వామి : అవునుప్రభూ ! స్త్రీల నపహరించుకొనిపోవుట వీరపురుషలక్షణమంట ! అదియొక ఘనతయంట ! వట్టి రాక్షస ప్రభుత్వము !

శిశునంది : మీరు నిర్విచారముగ నుండుడు. మా రాజ్యమున నుండిపోవచ్చును. ఆ గూఢచారిని బంధించి యామె నాతనినుండి

విడిపించి మీ కొప్పగింతుము.

వప్పస్వామి : చిత్తము ప్రభూ! తమ యనుగ్రహము! నేను ధన్యుఁడను.

శిశునంది : మీరు ధాన్యకటకవాసులుగద. మీ ప్రభువు సేన యెంతటిదందువు? మా రాజ్యమున మూఁడు వంతులు వారికి వశమై పోయినది.

వప్పస్వామి : అదేమో నాకు తెలియదు. నాకు యుద్ధ ప్రక్రియలతో నెట్టి పరిచయమును లేదు. కాని, సాతవాహనులు శిక్షా తీవ్రులు. వారి సేనలు నిత్య జాగృతములు. అది యా రాచరికము నందలి ప్రధాన లక్షణము. అట్టి సుశిక్షితమైన సైన్యమున్ననే రాజునకైన విజయము కరతలామలకముగద మహారాజా! అదిగాక వారి గూఢచార దళమది యాశ్చర్యకరమైనది. దానిని తలఁచుకొనిన గుండెలవిసిపోవును. ఆ దళాధిపతి ప్రచండుఁడు. వానికసాధ్యమనునది లేదు. అతఁడు నాతని దళమునులేని దేశముండ దనినచో నందతిశయోక్తిలేదు. మీకుఁ దెలియునోలేదో! ఆ నాయకుఁడే మీ ప్రతిష్ఠాన ప్రతినిధి కూతురఁట శాలిని! ఆమె నపహరించుకొని పోయినాఁడఁట!

శిశునంది : ఆఁ! మా శాలినినా? సాతవాహనులపహరించిరా? ఎంతటి నైచ్యమునకు దిగజారినారు!

వప్పస్వామి : ప్రభూ! తాము నన్ను విశ్వసింతురేని కల్యాణి నగరమున సైతమాతని యనుచరులున్నారని నా యభిప్రాయము. నేను వారిని వెదకి తమకు పట్టి యీయగల ననుకొందును.

శిశునంది : తప్పక నేటినుండియే యా పని నారంభింపుఁడు.

వప్పస్వామి : చిత్తము మహారాజా! సమాచారముల నెప్పటికప్పుడు నందినిద్వారా తమ కందఁజేయుచుండెదను.

శిశునంది : అటులే, మీరిఁక వెళ్లవచ్చును, దీపశిఖ వచ్చు సమయముకూడ కావచ్చినది.

వప్పస్వామి : దీపశిఖయా ప్రభూ! ఆమె యెవరు?

శిశునంది : ఆమెనే యెఱుఁగరా? ఆమె రాజనర్తకి.... కాదు ఊర్వసి! కల్యాణినగర నర్తకీ శిరోరత్నము!

వప్పస్వామి : అటులనా ప్రభూ! చిత్తము. సెలవు తీసికొందును.

శిశునంది : మంచిది. మీ పనియందప్రమత్తులుగ నుండవలయును.

వప్పస్వామి : చిత్తము.

వప్పస్వామి యటనుండి వెళ్లెను.

నెలదినములు కల్యాణీనగరమునం దెల్లతావులఁ దిరిగితిరిగి వప్పస్వామి విసిగిపోయెను. ఫలితము శూన్యము. ఒకనాడొక ధనికుని యింట దీపశిఖ నృత్యము జరుగుచుండెను. అచ్చట నెల్లరు దీపశిఖను ప్రశంసించువారే! వప్పస్వామి కానృత్యమును చూడవలె ననిపించినది. కాని యాతనికి ప్రవేశము నెవరిత్తురు? చాల తడవా సమీపమునఁదిరుగుచు నృత్యానంతరము దీపశిఖ బండిలో నెక్కి పోవుచుండగా నామెను చూచెను. అతనికాశ్చర్యమనిపించెను. ఆమె కొలది చిఱుభేదములతో నచ్చముగ పాటలివలె నున్నది! ఆమెయుదంతమును సమగ్రముగఁ దెలిసికొనవలయుననుకొనెను. ఆపనిపై నెలరోజులాచూకి తీయుచు తిరిగెను. తుదకు తేలిన సారాంశ మామె రాజస్థానమునుండి వచ్చినది. నృత్య నాట్య ప్రదర్శనముల నిచ్చుచు పలురాజ్యములలో ప్రశంసలనందుకొనుచు నీ దేశమునకు వచ్చినది. ఆమె ఇటీవలనే క్షహరాట రాజ్యమున రాజనర్తకి యైనది. ఆమెను కలసికొనవలెనన్న దినములకొలఁది పడిగాపులు పడియుండినఁగాని ప్రవేశ పత్రమే లభ్యముకాదు.

వప్పస్వామికేమియుఁ బాలుబోవుటలేదు. గూఢచారుల గుట్టుమట్లు తెలిసినఁగాని తాను శశినందిని తిరిగి కలసికొనఁజాలఁడు. పాటలి యెచ్చటికేగినట్లు? పుండరీకుఁడేమైనాడో! రెండేండ్లకు పూర్వము ధాన్యకటకమును వీడి చనినాఁడు. మరల జాడ తెలియు లేదు. తానును తన పెదతల్లియు మాత్రము ధాన్యకటకమున నాతనియింటనే యాతని ధనముతో సకలభోగముల ననుభవించు చున్నారు. పాపము పుండరీకుఁడు చాల గుణవంతుఁడు! ఉదార బుద్ధి! లేకున్న తానెవరు? తన పెదతల్లియెవరు? తమ్మిరువురను శాశ్వతముగఁ బోషింపవలసిన యవసర మాతనికేమి యున్నది? అతఁడు తన్నెంతగ ప్రేమించును! కాని తానేమి చేయుచున్నాఁడు! తన ప్రవర్తన చాల ఘోరమైనది. కాని తానట్లు చేయకుండ నుండ లేడు. పాటలిచే ప్రేమింపఁబడుటయే పుండరీకుని దోషము. పాటలి నాతఁడు ప్రేమించుట వేరొక దోషము. ఆమె తన్నట్లు తిరస్కరించినది. ఆమెను తాను మనసారఁ బ్రేమించినాఁడు. విసుగు లేకుండ తన ప్రేమ నెన్నోమారు లామెకు ప్రకటించినాడు. ప్రార్థించినాడు. ఆమె తన్ను నిరసించి మాటాడినది. పుండరీకుని ప్రేమించినది కావున పాటలిపైఁ బగతీర్చుకొనుటకు పుండరీకుని

నిరసింపవలసి వచ్చుచున్నది. అసలు పాటలీ పుండరీకు లెచ్చట నున్నట్లు ? కలసియేయుండిరా ? విడివిడిగ నున్నారా ? ఆమె యిప్పుడెట్లున్నదో ! ఏమైన మారినదేమో !

దీపశిఖ పాటలివలెనున్నదేమి ? అమెయే యామె కాదు గదా ! అంతయు చిక్కుగ నున్నది.

ఒకనాటి సాయంసమయమున నగరమునంవలి బహిరంగో ద్యానములో వప్పస్వామి తనలో తానేమో యోజించుకొనుచు కూర్చుండెను. ఆ యుద్యానవనము సాంద్రమైగుల్మములతో లతానికుంజములతో నిండియుండెను. ఆ యుద్యానము పేరు మయూరము. పప్పస్వామి చూచుచుండగనే యిరువురు రాజపురుషులా యుద్యానములోనికి వచ్చి దట్టమైన యొక పొదరింటిలో ప్రవేశించిరి. వారు పరిసరములన్నియు జాగ్రత్తగ పరిశీలించి యెవరును లేరని నిశ్చయించుకొనియందుఁ బ్రవేశించిరి.

వప్పస్వామికి వారి చేష్టితము విచిత్రమనిపించెను. వారిని గమనింపనెంచి తాను లతాగృహములోని వారి సంభాషణలు విని పించునంత దూరమున చెవియొగ్గి నిలుచుండెను.

లోపల నా పురుషు లిరువురు నీ క్రిందివిధముగ మాట్లాడు కొనుచుండిరి :

ఒకఁడు : రాజస్థానపు యుద్ధవార్తలెట్లున్నవి ?

రెండవ : సర్వము మనకచట జయావహముగ నున్నది. శ్యామికులవారి నాయకత్వమున నపజయమునకు తావులేదు.

అయినచో నిప్పుడు పుండరీకదళపతి యెచ్చటనున్నట్లు ?

ఆయన యెచ్చటనుండునని చెప్పగలము ? ఈరోజకరావంతి యైనచో రేపపరాంతము, మరుసటి దినము ధాన్యకటకము. ఆయన సర్వాంతర్యామి, విశ్వవ్యాపి, విష్ణుసదృశుఁడు !

యమదంష్ట్రికా దళమునకుఁ దెలియని విశేషములుండునా ?

అన్నియుఁ దెలియవలెనని నియమమున్నదా ?

ఆయనను తుదిసారి యెప్పుడు కలసినారు ?

నాలుగుదినముల క్రిందట.

ఆయన యేమనినారు.

మీచుట్టును విషవలయ మేర్పడినదఁట. జాగ్రత్తగ మసల వలయునన్నారు.

ఎందువల్లనో !

ప్రతిష్ఠాన రాజప్రతినిధి కొమార్తెను సాతవాహనసామ్రాజ్యము

నకుఁ జేర్చిన వారిపేర్ల జాబితాలో ముగ్ధదీపుని పేరు సైతము చేరినదఁట.

అటులనా? శాలిని ధాన్యకటకమున నున్నట్లు వీరికిఁ దెలిసినదా?

అచ్చట గౌతమీపుత్ర సాతకర్ణి మహారాజాంతఃపురములో వాసుకియఁట! క్షహరాట రాజ్య గూఢచారిణియఁట! ఆమె యీ వార్త పంపినది.

అయిన నీ విషయము మహారాజమాతకుఁ దెలియదా?

ఎందుకు తెలియదు! వార్త రానిచ్చి వాసుకిని శ్రీగుప్తుని కొప్పగించినది.

హరిహరీ! పాపము!

మీ రెందులకు బాధఁజెందుచున్నారో నా కర్థమగుటలేదు.

పాపము వాసుకి చాల అందమైన యువతి, తెలివైనది. ఇంత చిన్నవయసున నన్యాయముగ మృత్యువు పాలైనదే యని!

అనినచో?

మా రాజ్యమున రాజద్రోహికి విధించు శిక్షయిది. శాలిని ధాన్యకటకమున నున్నదని భూమకునికి తెలియునా? ఆయన ముగ్ధదీపు ననుమానించుచున్నాడు.

వివరములు తెలియవు.

ఓయీ! సుబంధూ! ముగ్ధదీపుఁడనిన శిశునంది మహారాజునకు మనస్సు కెక్కినవాఁడు.

కావచ్చును. ఈ మనస్సు కెక్కుటనునది పరిస్థితులపై నాధారపడియుండును. ఒకనాటి క్షహరాట రాజు నహపానుఁడు యుద్ధమునకుఁ బయలుదేరెనన్న సర్వరాజ్యములు కంపించి పోయెడివి. నేటిరాజైన శిశునంది నెవ్వరు గణింతురు?

అనియేమి?

మనము క్షహరాటులను నాటివారలుగ నెంచి వృథాశ్రమ పడినాము. ఇచ్చటికి వచ్చి చూచిన నన్నియు నవక తవకలుగ నంతఃకలహములుగ నున్నవి.

అదియేకద మనకుఁ గావలసినది!

సుబంధూ! ఇవిగో నీ యంగుళీయకము నీ పత్రమును మన నాయకునికిఁ గాన్కలుగ నందిమ్ము.

చిత్తము. మరినాకు సెలవు.

వారిరువురు చెరియొక దారినేగిరి.

వప్పస్వామికి సర్వమును చిత్రముగ నుండెను. క్షహరాట రాజ్యమున క్షహరాటులను రూపుమాపు శక్తులనేకములు పనిచేయు చున్నవన్నమాట. ముగ్ధదీపుఁడెవఁడు? అతఁడు శిశునంది కిష్టుఁ డగుటయేమి? ఆ వ్యవహారమున ముగ్ధదీపుఁడు పాల్గొనుటయేమి? యమడంష్ట్రికాదళమేమి? ఆలోచించినకొలఁది యంతయు పద్మ వ్యూహమువలె చిక్కుగనున్నది. మొదట నీ ముగ్ధదీపుఁ డెవఁడో చూడవలసియున్నది. సాతవాహన సామ్రాజ్యమునుండి నిర్వాసి తుఁడు కాఁబడిన వాఁడేనా? అతఁడే యైనచో రాజప్రతినిధి కుమార్తెను బంధించుటలో సాయపడదుగద. అతఁడు కాకపో వచ్చును. అయినను ఆ విషయమును పసికట్టి వెలికిఁదీయవలెను. తాననవసరముగ ప్రగల్భములు పలికి శిశునంది వలని చిక్కున పడునేమో! తాను చెప్పినట్లు చేసి చూపనిచో నా రాజు తన్ను శిక్షింప వచ్చును. అనవసరముగ కొఱవితో తలగోకికొనినట్లగును.

వప్పస్వామి మయూరోద్యానమును వీడి రాజవీధి వెంబడి నడచిపోఁదొడఁగెను. త్రోవలో నొక భవన మాతని దృష్టినాగి నిల్చెను. ఆ భవనము రాజభవనమువలె మెఱసిపోవుచుండెను. ఆ భవనము నుండి వచ్చుచు తనకు తానింతకు పూర్వము చూచిన వ్యక్తులిరు వురు కనిపించినారు. ఆ భవన మెవ్వరిదో? అది రాజ్యమున మిక్కిలి పలుకుబడి కలిగిన వారెవరికో సంబంధించినదై యుండ వచ్చును. వీరిరువురేమో రాజద్రోహులట్లు మాట్లాడుకొనినారు. వీరా భవనమునుండి వచ్చుచుండుట మహాశ్చర్యముగ నున్నదనుకొనెను. ముందా భవన మెవరిదో తెలిసికొనవలెను. అతఁడు దారినపోవు నొక యువకునాపి యా భవన మెవ్వరిదని యడిగెను. వాఁడు విరుగబడి నవ్వి యాతనిని వింతగఁ జూచుచు—"మీ దీయూరు కాదా?" యని ప్రశ్నించెను.

వప్పస్వామి: అదేమిటోయి! అట్లు నవ్వెదవు?

యువకుఁడు: లేకున్న నేమిటి? క్షహరాట రాజ్యమునందం తట మ్రోగిపోవుచున్న నర్తకి దీపశిఖాదేవియే తెలియదా? అది యామె ప్రాసాదము. ఆమె శిశునంది మహారాజు నాస్థాన నర్తకి తెలిసినదా? ఈ విషయము నెఱుఁగని వారీ కల్యాణిలో లేరు. కావునఁ గ్రొత్తవాడ వంటిని.

వప్పస్వామి: పోనిమ్ము. నీవట్లనుకొనుటలో పొఱపాటు లేదు. నేను నిజముగ క్రొత్తవాడనే. దీపశిఖా దేవిని కలసికొన వలెనననిన నెవరినాశ్రయించిన సాధ్యమగును?

ఆ యువకుఁడాయనవైపు తేరిపాఱఁజూచి ఆసంగతి తనకుఁ దెలియదనెను. వప్పస్వామికి దీపశిఖ నెట్లు కలసికొనవలెనో యుపగతముగుటలేదు. నందిని యేమైన నుపాయము చెప్పగల దేమో! ఏమైన నిట్టిపను లాడువారికి చేతనైనంత సులువుగ మగవారికి సాధ్యము కావు.

వప్పస్వామి నందినిని కలిసికొనెను.

వప్పస్వామి : నందినీ! నీవెన్నఁడైన దీపశిఖాదేవి యింటికి పోయితివా?

నందిని : లేదుస్వామీ.

వప్పస్వామి : నీకామె బాగుగ తెలియునా?

నందిని : అట్టి అవసరమేమియుఁ గలుగలేదు. మా కోటలో నామె నాట్యము జరిగినప్పుడామె ననేక పర్యాయములు చూచినాను.

వప్పస్వామి : పోనిమ్ము. నిన్నామె యెఱుఁగునా?

నందిని : ఆమెదృష్టిలో మేమెంతటి వారము?

వప్పస్వామి : సరి. నీవామె యొద్దకు పోగలవా?

నందిని : ప్రభువులానతిచ్చినచో పోవుదును.

వప్పస్వామి : నందినీ! మన మహారాజు సైన్యములో క్రొత్తగా చేరిన యొక సైనికుఁడు, అతని పేరు ముగ్ధదీపుఁడు. అతని నీవెన్నఁడైన చూచుట తటస్థించినదా?

నందిని : ఆఁ. తెలియును. ఆ సైనికుఁడు చాల చిన్నవాఁడు. అందగాడు. గొప్ప యోధుఁడట. మహారాజాతని తెగమెచ్చుకొనును.

వప్పస్వామి : నాకాతనిఁ జూపించగలవా?

నందిని : తప్పక చూపింతును.

వప్పసామి : అతఁడేయూరి నుండి వచ్చినాఁడు?

నందిని : ప్రతిష్ఠానము నుండి.

వప్పస్వామి : అటులనా? సరే! నీవింక పోవచ్చును.

నందిని అచట నుండి వెళ్లిపోయెను.

ముగ్ధదీపుఁడు ప్రతిష్ఠానమునుండి వచ్చెనా? ప్రతిష్ఠాన రాజ ప్రతినిధి కుమార్తె నపహరించినవారి జాబితాలో నీతని పేరున్నది. ఆ ప్రతినిధి కూతురు ధాన్యకటకమున నున్నది. అయినచో నీముగ్ధ దీపుఁడు ధాన్యకటకమునుండి నిర్వాసితుఁడయిన వాఁడై యుండ వలయును. తన దేశమునుండి నిర్వాసితుఁడైనవాఁడు మరల

నా రాజునకే సహాయపడునా ? ఆ నిర్వాస మొక వ్యాజము కావచ్చును. తప్పక యట్లే జరిగి యుండును. ఆ ముగ్ధదీపుఁడు ధనంజయుగ్రామణి కొమార్తెయగు పాటలియని వికుంఠపురమున ననుకొనుచున్నారు. ధనంజయాదులు ఖేదపడు చున్నారు. అంతటి రాజభక్తి కలిగి పుండరీకుని ప్రేమించి యాతని యడుగులో నడుగు వైచు పాటలి రాజద్రోహ మేటికి చేయును ? అది యంతయు మిథ్యాపరికల్పనమై యుండును. కానిచో శాలినిధాన్యకటక ప్రవాసమున ముగ్ధదీపుని ప్రసక్తియుండదు. ముమ్మాటికిని ముగ్ధదీపుఁడు పాటలియే యగును. ఈ ముగ్ధదీపునిఁ జూచిగాని తానేమియు నిర్ణయింపఁజాలఁడు. మరి యానాఁడా దీపశిఖలో పాటలి ముఖకపళికలు కన్పించినవే ! దీపశిఖ ముగ్ధదీపుఁడిరువురు నొకటియేనా ? అది కూడ నాలోచింపఁదగినదే. అటులేయైన పాటలి యెంత గుండెలు తీసినబంటు ! ఈ విషయము సంతయు తేల్చిగాని తాను నిద్దురపోజాలఁడు.

ఇది యిట్లుండ రాజుయొక్క కోశాగారము కొల్లగొట్టఁబడినది. వేసిన తాళములు వేసినట్లున్నవి. అడుగుజాడలు లేవు. కోశాగారమున మూఁడు మలకలుగ ముప్పేటలుగ నడుగున్నర రెండడుగులు వెడల్పు వదలి పాతబడి యినుపచువ్వలు గలిగిన గవాక్షము నుండి యెవరో స్త్రీ వ్యక్తి పామువలె మెలికలు తిరుగుచు లోనఁ బ్రవేశించిన చిహ్నములున్నవి. నాలుగైదు దీర్ఘకుంతలములు రెండు పగిలిన గాజుముక్కలు, అచ్చటపడి యున్నవి. ఎఱ్ఱని గాగరా యొక్క పోగులందు ప్రవేశించినది స్త్రీ వ్యక్తిగఁ బట్టి యిచ్చినవి. చూచినవారికి వినినవారికి నాశ్చర్య మనిపించుచున్నది. కోశాగారరక్షకులు గాఢనిద్రలో నున్నారు. తెల్లవారిన పిమ్మట కూడ వారికి మెలకువరాలేదు. వారిపైనెదో మత్తు ప్రభావమున్నది.

ఒక స్త్రీ అట్టిపని చేయఁగలదా ? ఆ వెనుకనెంత పెద్దకుట్ర యున్నదో ! రాజునకు మంత్రులకు కూడ మతిపోవుచున్నది. ఈ విషయము ప్రజలకు తెలియనీయకుండుటకు నిర్ణయించుకొనిరి. యుద్ధపు పన్నులని ప్రజలనుండి యధికముగ వసూలు చేసిరి. ప్రజలలో రాచరికముపై విశ్వాసము సన్నగిల్లినది. ప్రజలు రాజును, పరిపాలనను నిందింపసాగిరి. పల్లెపట్టులలో కృషీవలులు మొదలైనవారు ప్రభుత్వమును నిరసించి దళములుగ సభలు సమావేశములు జరుపుచు ప్రభుత్వాధికారుల నెదిరింపసాగిరి.

పరిస్థితులన్నియు నల్లకల్లోలముగనున్నవి. క్షహరాట రాజ్యభాగము లన్నియు నొక్కటిగ శత్రువుల వశమై పోవుచుండెను. శిశునందికి ధైర్యము సన్నగిల్లినది. భూమకుఁడు శాలిని ధాన్యకటకమునకుఁ జేరినదని మండిపడుచున్నాడు. ప్రతిష్ఠానము చేజారిపోవుటచే నాయన యెడ గౌరవము ప్రజలకు తగ్గిపోయినది. శిశునందికి మూలిగిన నక్కపై తాటిపండు పడినట్లసలే ముజ్జిడ్డుగ నున్న యీ రాజకీయపు టలజడులలోనే కోశాగారము కొల్లగొట్టఁబడుట, గ్రామములందలి ప్రజల తిరుగుబాటు, ఎటు చూచినను ఘోరముగ నున్నది.

ఇట్టి పరిస్థితులలో నెవరిని నమ్మదగునో యెవరి ననుమానింప వలెనో తెలియకుండ నున్నది. వప్పస్వామి తఱచుగ కోటలోనికి వచ్చుచుండుట పరిచారికలతో సంభాషించుట మహారాజుతో ప్రసంగించుట యన్నియు సమస్యలైనవి.

ఒకనాడు వప్పస్వామి శిశునందితో—"ప్రభూ మీ ముగ్ధ దీపుఁడు సాతవాహన సామ్రాజ్యమునుండి నిర్వాసితుఁడై యిచ్చటికి వచ్చెనుగద" యనెను.

శిశునంది : అవుననుకొందును.

వప్పస్వామి : అతఁడు గొప్ప ఖడ్గ విద్యావేత్త ప్రభూ !

శిశునంది : అవును. మేమాతని విద్యను పరీక్షించియే యుద్యోగమిచ్చితిమి. ప్రతిష్ఠాన నగరమునఁ బేరు మోసి వచ్చినాడు. మా భూమకునికి నచ్చిన వీరుఁడు. ఆయనయే ముగ్ధదీపునిచ్చటికి పంపినాడు.

వప్పస్వామి : ప్రభూ ! ఇప్పుడంతయు తారుమారైనది. ఆ భూమకులవారి కుమార్తె శాలినీదేవి నీ ముగ్ధదీపుఁడే ధాన్యకటకమునకు బందినిగఁ బంపెనఁట !

శిశునంది నవ్వి—"ఓయీ ! వెఱ్ఱి బ్రాహ్మణుఁడా ! ముగ్ధ దీపుఁడిచ్చట నున్నాడుగద" యనెను.

వప్పస్వామి : అయ్యో మహారాజా ! అదియే చిత్రము ! అసలు ముగదీపుఁడు నిర్వాసితుఁడగుట మిథ్యమని నా యనుమానము.

శిశునంది : అందులకాధారములేమైన నున్నవా ?

వప్పస్వామి : ప్రభూ ! నాకొక యనుమానమున్నది.

శిశునంది : ఏమది ?

వప్పస్వామి : దీపశిఖాదేవికి ముగ్ధదీపునకు సంబంధమేమైన నున్నదా ?

శిశునంది : అదే మట్లంటిరి ?

వప్పస్వామి : వారిరువురికిఁ గల రూప సాదృశ్యమునుబట్టి యిట్లూహఁజేసితిని.

శిశునంది : బాగున్నదయ్యా! దీపశిఖనుగూడ గూఢచారిణి యంటివిగాదు!

వప్పస్వామి తనలో నిట్లనుకొనెను—"అవును, దీపశిఖ గూఢ చారిణి యేల కాకూడదు? ఇంకను నిశితముగ పరీక్షింపవలెను."

శిశునంది : అయినచో మీ మాటపై ముగ్ధదీపుని బంధింతునా?

వప్పస్వామి : వలదు మహాప్రభూ! అతఁడొక మహా ఖడ్గ విద్యావేత్తగద. మీరొక పని చేయుఁడు. మెఱికలవంటి నలుగురు యువకులనేరి యా విద్యలోని మెలకువలన్నియును వారి కాతనిచే నేర్పించుడు. విద్యను వారుసాంతముగా నేర్చినమీఁదట మీ యిష్టమువచ్చినట్లు చేయవచ్చును. సాతవాహన సామ్రాజ్యమున నింతటి ఖడ్గవిద్యా ప్రవీణులింక నొకరిద్దరున్నారు. ఆ విద్య యందలి యా మెలకువలను తెలిసికొనినఁగాని వారినెదిరించుట కష్టమగును.

శిశునంది : అట్లే చేయుదము.

*　　*　　*　　*

మరునాడే ముగ్ధదీపునికి నలుగురు శిష్యుల నేర్పాటు చేసిరి. రాజుగారి యీ చర్య ముగ్ధదీపుని కనుమానాస్పదమయ్యెను. తాను వారికి విద్య నేర్పెను. వారు నల్వురు ముగ్ధదీపుని విద్యానైపుణికి బోధనా సామర్థ్యమునకు నచ్చెరువుఁజెందుచు మెచ్చుకొనుచు నాతని కించుమించు వారందరు కింకరప్రాయులైరి. వారు ముగ్ధ దీపునిపై నీగ వ్రాలనీయరు. క్షహరాటరాజ్యమున లేని కొన్ని క్రొత్త రీతులు మెలకువలు వారికి వశమగుటచే వారు మహావీరు లైనారు. దానితో వారికి గర్వము బలిసినది. విద్యాదాతయైన ముగ్ధదీపునికి వారు ప్రాణము పెట్టుదురు. రెండునెలలు గడచునప్పటికి వారి విద్య పూర్తి యయినది.

వప్పస్వామి మరల నింకొక యూహ చేసెను. అతఁడు దీపశిఖ భవనమునకుఁ బోవలెననుకొనెను. అందులకు 'యమపంష్టిక' యేమైనఁ బనిచేయునేమో చూడవలెనని యెంచెను. నాడు నాగ పంచమి. కోటలో దీపశిఖ నాగనృత్యమున్నది. వప్పస్వామిగూడ నృత్యమును చూడనేగెను. నాగనృత్యమది నృత్యమేగాదు. ఒక దేవతాసర్పము యథేచ్ఛావిహారము సల్పినట్లున్నది. ఆమె ధరించిన

యుతుపులచే నాభరణములచే నామె ముమ్మూర్తుల నాగకన్యకవలె నున్నది. మొగమున సర్పాకృతిగ తిలకముంచినది. కనుతుదల సర్ప పుచ్ఛాకృతిగ గీతలు గీసికొనెను. పాము కుబుసముపంగు పల్చని వస్త్రముపై కుబుసమునందలి పొలుసులు కనఁబడునట్లు చుక్కలద్దించి, దానిని చిత్రముగ శరీరమున కంటుకొనిపోవునట్లు మడతలు మడతలుగ త్రిప్పి చుట్టినది. హఠాత్తుగ చూచువారికామె రంగస్థలమున నొక తెల్లని జాతిసర్పము తోకపై నిలబడినట్లు కన్పించెను. నాగస్వరము మ్రోగుచుండగా నభినయించిన భంగిమము లద్భుతములు! భయంకరములు! ఈమె నిజముగ నాగినియేమో! కాకున్న నట్లు మెలికలు తిరుగుటెట్లు? ఆమె బరిమీఁద కఱ్ఱదెబ్బ దినితిరుగు కోడె త్రాచువలె మెలికలు తిరిగినది. ఆమె రేచక మొనర్చి శరీరమును సన్నగిలఁజేసి చీపురుపుల్లవలె కన్పించెను. మరునిముసమున పూరకమొనర్చి మహాకాయమును ప్రదర్శించెను. వాయువును కుంభించి ప్రాణరహితమైనటుల బిగుసుకొనిపోవును. ఆమెయొక్క లఘ్వలఘు ప్రమాణములు పరమాశ్చర్యకరములుగ నుండెను!

వప్పస్వామి కన్నులు తిరిగిపోవుచుండెను. ఆమె పాముకాటు వేయునటులఁ దన యుఁ అచేతులను ఫణా సదృశములుగ దోయిలించి చిత్రచిత్రములుగ విసరుచు ప్రేక్షకులలో నెవరికివారు తమ మీఁదనే యూ పడగ పడునేమోయనునంత భయముఁజెందిరి. రంగస్థలముపై నట్లు మెలికలు మెలికలుగ తిరుగుట సర్పములకు మాత్రమే సాధ్యమైనది. చిన్నతనమునుండి నిత్యాభ్యాసముచేగాని యట్లు శరీరమును స్వాధీనమొనర్చుకొనుట యసంభవము!

వప్పస్వామి యామె నృత్యము చేయుచున్నంతసేపు నామె యందు పాటలినే దర్శించుచుండెను. ఆమె కుపిత దృష్టియై చూచునపుడామె యధరము కంపించును. ఆమె కన్నులు కాశ్మీరముల విరజిమ్మును! ఆమె యెడమ చెక్కిలిపై చిన్న నక్షత్ర మంత పుట్టుమచ్చ యున్నది. ఆమె పలువరుసలో పైభాగమున నొక పంటిపై నింకొక చిన్నపల్లున్నది. అది యామె సౌందర్యము నినుమడింపఁ జేసినది. వీనియన్నిఁటి చేతను వప్పస్వామికామె పాటలియే యనిపించెను. శశునందికి, కొందరు మంత్రులకు కోశాగారముఁ గొల్లగొట్టిన నాటి విషయము జ్ఞప్తికి వచ్చి ఆ గవాక్షము నుండి దూరిపోగల స్త్రీ దీపశిఖవంటిదై యుండవలయు ననుకొనిరి. అందఱమనస్సుల నేదో యనుమానచ్ఛాయ దోబూచులాడుచున్న

ట్లుండెను.

మరునాడు వప్పస్వామి దీపశిఖా మందిరమునకుఁ బోయి యామె దర్శనమును కోరెను. కావలివాండ్రు నిరాకరించిరి. వప్పస్వామి 'యమదంష్ట్రిక' నుపయోగించెను. కావలివాండ్రు మరల నతని పేరడిగిరి, వప్పస్వామి 'సుబంధు' శబ్దము నుచ్చరించెను. కావలివాండ్రతనిని లోనికిఁ దీసికొనిపోయిరి. లోపల ప్రవేశించుచు వప్పస్వామి యా భవనసౌందర్యమునకు ముగ్ధుఁడగుచుండెను. ఆ భవనోద్యానము, అందలి పాలరాతి బాటలు, లతలను పోషించు తీరులు, పంజరములందలిచిలుకలు గోరువంకలు నెమళ్లు సర్వము విస్మయ జనకముగ నుండెను. అతఁడు లోనికేగుసరికి దీపశిఖ మెత్తని పట్టుపరుపులను దిండ్లనమర్చిన పర్యంకముపై తలనానించి యొకప్రక్క కొయారముగ, చిత్రించిన చిత్రమువలె పండుకొని యుండెను. ఆమె సౌందర్యము పట్టరానిదిగ నుండెను. ఆ చతుశ్శాలమున ద్వారము లన్నింటికి పాటలివర్ణ మృదు కౌశేయయవనిక లమర్పఁబడినవి. ఆ ప్రతిసీరలనుండి చొచ్చుకొనివచ్చు నాదిత్యాంశువు లాపర్ణ మిశ్రితములై, దీపశిఖపైఁ బ్రసరించి యామె సహజ లావణ్యమైన వపుఃకాంతినింకను మనోహరముగ భాసింపఁ జేయుచుండెను.

ఆ వైభవము నంతను దిలకించిన వప్పస్వామి కామె పాటలి కాదేమో ననిపించెను. అయినను తన యత్నము తాను చేయవలె గద యనుకొనెను.

వచ్చిన వప్పస్వామి నాతని ముఖవైఖరినిబట్టి గుర్తించి దీపశిఖ యుల్కిపడి యంతలోనే తేరుకొని — "ఎవరునీవు? యమదంష్ట్రికా దళమునకుఁ జెందినవాఁడవు కావే!" యని రాజస్థాన భాషలో ననెను.

వప్పస్వామి కా భాష యేమియు బోధపడలేదు.

దీపశిఖ తనకాంధ్రభాష తెలియునట్లు నటించెను: అమె యాతని 'బేవకూఫ్' అనెను.

వప్పస్వామి : నీకైశ్వర్య గర్వము బలిసినది. అధికారపు టహంకారము ప్రబలినది. వికుంఠపురమున నీవారేమైనారో నీకుఁ దెలియదు. మీ నాయనమ్మ బప్పిక మరణించినది. మీ నాయన ధనంజయుఁడు నీ నిర్వాసనమును విని కుమిలి పోవుచున్నాడు. నీ తల్లికి మతి చలించినది. మీయింట సుఖశాంతులు కఱవైనవి. నీ విచ్చట రాజద్రోహ మొనర్చుచు కులుకుచున్నావు!

వప్పస్వామి యీ మాటలనుచు దీపశిఖ ముఖలక్షణములను పరిశీలించు చుండెను. ఆమె నిర్వికారముగ నుండెను. ఆమె వదనమున నెట్టి యుద్వేగమును పొడకట్టలేదు !

దీపశిఖ యెంతకు రాజస్థానీ భాషలోనే మాటాడుచుండెను— "అసలు నీవు నా వద్ద కెందులకు వచ్చితివి ? నీవు చెప్పునదేమియు నా కర్థముగుట లేదు. ఈ యసందర్భపు టర్థరహితమైన సంభాషణకైనచో నీవు వెళ్ళవచ్చును" అనెను.

వప్పస్వామి : నీ వెంత పరదేశినిగ నభినయించుచున్నను నీవు పాటలివని నాకుఁ దెలియును. నీవును నీ 'యమదంష్ట్రికా' దళమును శిశునంది మహారాజు కోశాగారమును కొల్లగొట్టినారని రాజాధికారు లనుకొనుచున్నారు. నేనానాడే చెప్పితిని నాపగ పాము పగయని. నేనీ రెండేండ్లుగ రాజ్యములన్నింట వలవేసి వెదకితిని. 'మీ యమదంష్ట్రిక' నాకు తెలియును. నీవు ముగ్ధదీపుఁడవై శాలినిని ధాన్యకటకమునకుఁ బంపుట తెలియును. కోశాగారమును కొల్లగొట్టిన విషయము మొన్నటి నీ నాగ నృత్యముతో మరియు దృఢపడినది. నీవు కాక కోశాగార గవాక్షమునుండి వేరెవ్వరు లోనఁ బ్రవేశింపఁజాలరు. ఇన్ని నేరములు మోయుచు నీ రాజ్యమున నింక వైభవము ననుభవించు చుండగలననుకొనుట యవివేకము. నీ పాపము బ్రద్దలగు సమయము సన్నిహితమైనది. ఎల్లకాలము నీదనుకొని మురియకుము.

దీపశిఖ మాటాడలేదు.

వప్పస్వామి : నీవెంత పేరు మార్చుకొన్నను, ఎట్టి వేషమును సంతరించుకొన్నను అన్యభాషలో ప్రసంగించుచున్నను నిన్ను గుర్తించలేననుకొనుచున్నావా ! నీ వెట్టి సాకులు చెప్పియు తప్పించుకొనఁజాలవు. ఇప్పటికైన మించిపోయినది లేదు. నీవు నన్నంగీకరించుచో నీ రహస్య మిచ్చటనే నిలచిపోవునట్లు చూచెదను. లేనియెడల నీ యంతును నీ ప్రియుని యంతును తేల్చిగాని వదలను. తెలిసినదా పాటలీ !

దీపశిఖ వప్పస్వామి మాటలలో నొక్కటైన తనకర్థమైన వైఖరిని తనలో పొడకట్టనీయలేదు. ఆమె యతనిని పిచ్చివానిగ చిత్రించుచు ద్వారపాలురను పిలిచి యాతనిఁ తన భవనమునుండి గెంటించివేసెను.

దీపశిఖ మరుక్షణమున చలించిపోయినది. ఫలోన్ముఖమైన తన వ్యవసాయమున కడ్డువచ్చుచున్న నీ శనిగ్రహము దాపురించి

నాడేమా! యనుకొనెను. 'యమదంష్ట్రిక' సంకేత మితని కెట్లు తెలిసినది? ఈ దుర్మార్గుఁ డీ రాజ్యమున నెట్లు ప్రవేశించెను? మొన్న కోటలో తానానృత్యము చేయకుండ నుండవలసినది. తన్ను తానే శత్రువులకు పట్టియిచ్చు కొన్నట్లయినది! ఈ నీచుఁడు తన్నుందఱ కెఱిఁగించును కాబోలు!

దీపశిఖ కేమిచేయుటకును పాలుపోపకుండెను.

వప్పస్వామి శిశునంది యొద్దకుపోయి — "మహాప్రభూ! అంతయు నవగతమైనది. తరువాతి పని తమయిష్టమ"నెను.

శిశునంది : ఏమనుచున్నారు?

వప్పస్వామి : ఆ గూఢచారుల నాయకురాలినిఁ బట్టివేసితిని.

శిశునంది : నాయకురాలనుచున్నారు! చిత్రముగనున్నది!

వప్పస్వామి : అవును ప్రభూ! ఆశ్చర్యముగనే యనిపించును. ఆమె గూఢచారిణి. ఆమె యెవరో తెలిసిన మీరింకను నాశ్చర్య పోవుదురు.

శిశునంది : ఎవరా స్త్రీ?

వప్పస్వామి : ఎవరో కాదు. క్షహరాట రాజాస్థాన నర్తకి దీపశిఖాదేవి!

శిశునంది : బాగున్నదయ్యా బ్రాహ్మణుఁడా! మా యాస్థాన నర్తకియా! కొండను త్రవ్వి యెలుకను పట్టినట్లున్నది!

శిశునంది నవ్వసాగెను.

వప్పస్వామి : కాదు ప్రభూ! నేనింకను కొన్నివిషయములు సేకరించితిని. ఆ దీపశిఖయు ముగ్ధదీపుఁడు నిరువురు నొక్కరే. యని నా యభిప్రాయము!

శిశునంది : మీరు స్పృహలో నుండియే మాటాడుచున్నారా?

వప్పస్వామి : మీకంత విశ్వాసము లేనిచో దీపశిఖా ముగ్ధదీపుల నిర్వుర నొకేసారి పిలుపించుఁడు, మీకే తెలియగలదు.

శిశునంది వెఱగుపడి వారలకై కబురుపెట్టెను.

ముగ్ధదీపుఁడు వచ్చెను. దీపశిఖ భవనమునందు లేదఁట! రాజున కాశ్చర్యము ద్విగుణితమయ్యెను.

అచ్చటనున్న వప్పస్వామిని చూచి ముగ్ధదీపుఁడు కళవళపడి యంతలోనే స్వస్థుడయ్యెను.

వప్పస్వామి ముగ్ధదీపుని "పాటలీ! వేషములో నుంటివేమి!" యనెను.

ముగ్ధదీపుఁడు : పాటలియా? నీ వెవ్వరవు? నీకు నేనెవరనో

కనిపించుట లేదా ?

వప్పస్వామి : అవును. కనిపించుచున్నది. కనుకనే వేష మంటిని.

ముగ్ధదీపుఁడు : బాగున్నది. నీవే వేషగాడవేమో !

శిశునంది యా వినోదమును చూచుచుండెను.

ముగ్ధదీపునిలో దీపశిఖ పోలిక లాయన కాశ్చర్య మనిపించినవి.

వప్పస్వామి : ప్రభూ ! ఇతఁడు — కాదీమె ముగ్ధదీపుఁడు కాదు. పాటలి ! ఈమె సాతవాహన గూఢచారిణి. ఈమెనే నేను కామించినది ! పుండరీకుఁ డపహరించినదీమెనే !

శిశునంది : పుండరీకుఁడెవ్వఁడు ?

వప్పస్వామి : ఉన్నాడు. అతఁడు వీరి దళనాయకుఁడు. ఏమి పాటలీ ! పుండరీకుఁ డెచ్చట నున్నాడు ?

శిశునంది : ఉండవయ్యా ! ముగ్ధదీపుని పాటలి యందు వేమి ?

వప్పస్వామి : నిజము మహారాజా ! నా మాటయందు విశ్వాసము లేనిచో నాతనిని పరీక్షింపఁజేయుఁడు. వాస్తవము మీకే తెలియఁగలదు.

శిశునంది యాజ్ఞపై నిరువురు యువతులు ముగ్ధదీపుని లోనికి దీసికొనిపోయి దీపశిఖతో తిరిగివచ్చి ప్రభూ ! ఈమెయే ముగ్ధదీపుఁడనిరి.

రాజునకు తల తిరిగిపోవుచున్నది !—"దీపశిఖయు ముగ్ధదీపుఁడు నొక్కరగుటయేమి ! ఈ రూప ద్వితయమునకు మూలరూపము పాటలియా ! పరమాశ్చర్యముగ నున్నదనుకొనెను.

వప్పస్వామి : మహాప్రభూ ! ఈమెను గూర్చి చెప్పవలసినదింక నెంతయో యున్నది. ప్రతిష్ఠానమున మీ రాజప్రతినిధి కుమార్తె శాలినీదేవి నీమెయే ముగ్ధదీపుఁడుగ నటించి మోహపెట్టి ధాన్యకటకమునకుఁ జేర్చినది. ఇటీవల మీ కోశాగారమునఁ బ్రవేశించి ధనమును కొల్లగొట్టినదీ దీపశిఖయే ! ఈమె దేవాంతకురాలు ప్రభూ !

శిశునంది నోట మాటరాక మ్రాన్పడిపోయెను.

"ఇట్టిదెచ్చటనైన సంభవమా? ఒక యాడదింతటి సాహసము చేయఁగలదా ? ఆ కోశాగార గవాక్ష స్వరూపమును పరిశీలించిన, నీమె మాయలు తెలిసిన మంత్రగత్తె యనిపించు చున్నది"

అనుకొనెను.

మహారాజు వెంటనే దీపశిఖను బంధించుట కాజ్ఞయిడెను.

దీపశిఖ క్రోధముతో జ్వలించి పోవుచుండెను.

జ్వలితజ్వాల వలెనున్న యామెను జూచి వప్పస్వామి గడగడ లాడి పోయెను. అంతలోనే స్థిరపడి యామెను చూచి వికటముగ నవ్వనారంభించెను.

శిశునంది అపహాస భాజనమైన యానవ్వుఁ జూచి "మీపని ముగిసినదికద. మీరిఁక వెళ్లవచ్చు" ననెను.

వప్పస్వామి వెడలిపోయెను. రాజు జ్వరితునివలె నీరసించి పోయెను. ఆయన "దీపశిఖ యెంతటి ధీర వనిత!" యనుకొనెను.

చీకటి పడినది. రాజు గదిలో దీపము లేదు. ఆయన కన్నులముందు నాగనృత్యమొనర్చుచున్న దీపశిఖమోము పడగ త్రొక్కగా నదరిపడి కాటువేయ నుంకించు కోడెనాగమువలె భయంకరముగ కన్పించెను. ఆమె కన్నులనుండి జాలువారు నగ్నిస్ఫులింగములు తన్ను దహించునేమో! ఆమె సర్వ సమర్థురాలు. ఆమె తన్నెంతగా మురిపించినది.

దాసి వచ్చి గదిలో రత్నదీపముంచినది. ఆ దీపకాంతులఁ జూచి రాజు వెఱగందెను. ఈ దీపశిఖ తన్ను దహించివేయును. తానేమియుఁ జేయఁజాలఁడు. ఆమె తన్ను వదలి పెట్టదు!

రాజు భయగ్రస్తుఁ డయ్యెను. నీతియందామె చాణక్యుని సంతాన మన్నట్లున్నది!

తనకింక దిక్కెవ్వరు!

## 10

"బంది! అకాల గర్జాజల దాశని పతన రవయేషః
పత్యుః ధనురాకాంక్షణశీలే, రోమాంచం కిం వృధా వహసి?"

భర్తయొక్క ధనుష్టంకారమునకై యెదురు చూచుచున్న బందీ! ఇది యకాల మేఘ గర్జనము యొక్క యార్భటి. వృథాగా నెందుకు రోమాంచము కల్గించు కొందువు!

స్వామీ!

ఊహించని విషయములు ప్రత్యక్షములై పెట్టనిగోడలై యడ్డు నిలిచినవి. పురుష ప్రయత్నమును మించిన దైవశక్తి తన యాధిక్యమును నిరూపించుకొనుచున్నది! శిశునంది వద్దనుండి నాకు—కాదు దీపశిఖకు—కాదు ముగ్ధదీపునకు—అదియుగా దిరువురకొకేమారు ఆయనను దర్శించవలసినదిగ కబురు వచ్చినది. చూచితిరా! ఎంతచమత్కారముగ నున్నదో! రాజ నర్తకిని రాజ్యమునందలి సామాన్యసైనికుని నొక్కమారే కలసి చూడవలెనని రాజునకు కోరిక కల్గినదన దానివెనుక నెన్నినిగూఢాభి ప్రాయములున్నవో యోజింపుఁడు. దీపశిఖయు ముగ్ధదీపుఁడు నిరువురొక్కరని తెలిసిన వ్యక్తులుండి వారు పనిగట్టుకొని యీ విషయమును శిశునంది చెవిలో నూది యుండవచ్చును. అందుచే రాజునకనుమానము కలిగి యీ పని చేసినాడు. ఆ తెలిసినవారె వరో తెలియునాస్వామీ! అతఁడు నాపై పగఁ బట్టిన మహాపాపి! మనరాజ్యముపై పగసాధించుచున్న దుర్మార్గుఁడు. పేరు చెప్పిన మీరు విశ్వసించరేమో! మీరు నన్నేమను కొందురోయని భయమగు చున్నది కూడ! అయినను చెప్పక తప్పదు. అతఁడెవఁడో కాడు. మన వప్పస్వామి! మీకునేనెన్నఁడు తెలియఁ జేయలేదు. కాని, యాతఁడు తనయన్నగారి సతినైన నన్ను వాంఛించినాఁడు. నేనాతనికెన్నియో విధముల నచ్చజెప్పితిని—ఉపదేశించితిని—మందలించితిని—నిందించితిని. తుద కేవగించు కొంటిని. అతఁడది మొదలుగ పగఁ బట్టి నా బ్రతుకున నిప్పులు చెఱగుచున్నాడు. నా భర్తను నాశనము చేయుదు నన్నాడు. మన యిరువురను కలసి బ్రదుకనీయననినాడు. అతఁడనిన మాటలన్నింటిని నెఱవేర్చుకొను

చున్నాడు. వప్పస్వామి కల్యాణికి వచ్చి శిశునంది నాశ్రయించి, కుహనా బ్రాహ్మణుఁడై మన రాజ్యమును గూర్చియు మహారాజును గూర్చియు దుర్భాషలాడుచు మన రహస్యముల నన్నిఁటిని భేదించు చున్నాడు.

ఇటీవల నొకనాడు నా భవనమునకువచ్చి మన 'యమదంష్ట్రిక'ను గూర్చియు నన్నుఁ గూర్చియు మాట్లాడినాడు. నేనవి యేమియు నాకుఁదెలియనట్లు, అసలాతని భాషయే తెలియ నట్లు నటించి యాతనిని గెంటించి వేసితిని. దానికిది ఫలితము. అతఁడు శాలిని సంగతి, కోశాగారమును కొల్లగొట్టిన సంగతి సర్వ మును వెలికిఁదీసినాడు. స్వామీ! అతఁడు చాల దుర్మార్గుఁడు. అతని నేనంగీకరించుచో రహస్యమును బయట పెట్టనన్నాడు. చూచితిరా! అతని దుర్లక్షణము! పోనిండు. ఆతని నేమి చేయ వలసి యుండునో మీరే నిర్ణయింపుడు!

ఇచ్చట సర్వసేనాపతి రాజమరాళుఁడున్నాడు. వాఁడు నట్టి వాఁడే. మీరే చెప్పితిరిగద! వాఁడు నేను పన్నిన వలలో పడి కొట్టుకొను చున్నాడు. మొన్నటి దినమున సుబంధునితో పత్రము నంగుళీయకమును పంపితిని. ఎట్లు చేసిన బాగుగనుండునో యట్లే చేయుఁడు. రాజమరాళుఁడిప్పుడు రాజధాని నగరమున లేడు. అతఁడు కూడ నీ రాజ్యమునకు ప్రమాద కారియే కాఁగలడు. అతనికి దేశభక్తిలేదు, రాజభక్తిలేదు. అతనిని క్షమించరాదు.

శిశునంది వట్టి భీరుఁడు. కావున ఆయన నుండి మనకు వచ్చు నాపద లేదు. నేనిదే శిశునంది వద్దకు పోవుచున్నాను. పోక తప్పదుగద! పోవుచుంటినన మరల తిరిగి రానను కొందును. వారు నన్నచ్చట బంధింతురనుకొందును. అచ్చట నా శక్తియుక్తులు, సామర్థ్యము నాకుఁదోడ్పడవు. నా ధనువు నాకక్కరకు రాదు. కాని వారు నన్నేమియుఁజేయరు. శాలిని మన యధీనములో నుండునంతకాలము వీరు నన్ను శ్రద్ధగ చూచెదరు. స్వామీ! మరి యొక మాట. పరిస్థితులొకవేళ విషమించుచో నేనేమై పోయినను శాలినిని మీరు సగౌరవముగ ప్రతిష్ఠానమునకు పంపవలయును.

క్షహరాట రాజ్యమున నాల్గుచెఱగుల సమరాగ్ని ప్రజ్వరిల్లి రాజ్యమంతయు పతనమైపోవుచున్నది. మనసేనల కెదురు లేదని విని సంతసించితిని. మన మహాప్రభువు గౌతమీపుత్ర శ్రీసాతకర్ణి వైజయంతి స్కంధావారమున నున్నట్లు తెలియ వచ్చినది. వారికి నా భక్తి పూర్వక ప్రణామముల నందఁజేయుఁడు. రాజమాత

గౌతమీ బాల శ్రీదేవిగారికి నా నమోవాకములు. మహారాజ్ఞి వాసిష్ఠీ దేవికి నా హృదయపూర్వక వందనములు. వారు నాపై నిల్పిన కార్యభారమును నాశక్తి చాలిన మేరకు నిర్వహించితిని. సర్వము మనకు శుభాంతము కాగలదని విశ్వసించుచున్నాను. వారి నంద అను నేను తిరిగి దర్శింపఁగలనో లేదో! ఒక చిత్రమును చూచితిరా స్వామి! నాడు నేను ధర్మ విచారణము చేయుచున్నప్పుడు మీరు రాజధర్మము వైఖరి వేరనినారు. అవునది నిజమని నా యత్న ఫలితములు నిరూపించినవి. నేను నెఱపిన తంత్రములకు పరిణామములు బాగున్నవి. కాని యవి నా స్వీయ విషయమున బెడిసి కొట్టినవి!

తోడి యాడుదాననై శాలినిని మగవానివలె నటించి మోసగించిన దానికి ఫలితమేమగునో! ఆమె మనోవేదన నా ప్రేమ జీవితమును సాగనీయదేమో! అటులకానిచో వప్పస్వామి సర్వము సుసంపన్నమైయుండ నీ చివరి క్షణమున నిచ్చ్యుటికేల రావలయును? ఆ నా కృత్రిమాచరణమున కిది ఫలితమే మో! అనుక్షణము మోసముతో నడుగువేయు నా బ్రదుకు బాటలో నిట్టి సంకటము లనివార్యములేకద! నా జీవన స్రవంతి వక్ర మార్గము పట్టునో లేక యింకియే పోవునో! పోనిండు. మన కర్తవ్యము చాల వరకు చక్కగా నిర్వహింపఁబడినదను తృప్తి యొకఁడున్నదిగద! సాతవాహనీదేవి యనుగ్రహ మున్నచో నచిర కాలముననే కలసి కొనఁగలము ప్రస్తుతమింతే. చిత్తగించవలయును.

వినయపూర్వక నమస్సులతో
మీ పాటలి

పుండరీకుని వదనమున కత్తివాటునకు నెత్తురుచుక్క లేదు. మహారాజు మనస్సు చింతా వ్యాకులమయ్యెను. పుండరీకుని హృదయము క్షోభించిపోయినది. అతని మనస్థితి మహారాజు హృదయమును కలఁచి వేసినది. పాటలీ పుండరీకుల మధుర ప్రణయగాథ యామున కంతకు పూర్వమే పరిచితమై యుండెను. ఆయన విచారమున కవధిలేకుండెను.

శ్రీ సాతకర్ణి మహారాజు పుండరీకునితో నిట్లనెను — "నీవు సత్వరముగా కల్యాణికి పొమ్మ. పాటలీ సంరక్షణము మనకు ప్రథమ కర్తవ్యము. పాపమా యువతి చిన్నవయస్సుననె యెన్ని కార్యముల నిర్వహించినది! నిజమునకీ పశ్చిమ దిగ్విజయము మీ యిరువురి కృతముగనే జరుగుచున్నదోయీ! ఏమి పాటలి!

తలంచుకొనిన నాకు హృదయము నీరగుచున్నది. ఆ కోశాగార మెట్లు కొల్లగొట్టినది! ఆ సేనాపతి నెట్లు వశంవదునిగఁ జేసికొని నది! అంతయు చిత్రము. ఈ వప్పస్వామి యెవరోయీ! మన సామ్రాజ్యమున నింతటి నీచులున్నారా? అచ్చట పోరాట మంత తీవ్రమైనది కాదనుకొందును. అయినను తగు సైన్యమును వెంటఁ గొనిపొమ్ము. కల్యాణిని జయించి స్వాధీనమొనర్చుకొని, నీ ప్రియు రాలిని వెంటనిడుకొని క్షేమముగ తిరిగిరమ్ము. నేను మీ కిరువురకు కల్యాణము జరిగింతును. పుండరీకుఁడు సిగ్గుఁజెంది — "చిత్తము మహాప్రభూ!" అనెను.

పుండరీకుడు వెళ్ళిపోయెను.

సాతకర్ణి మహారాజు పాటలీ పుండరీకుల మనస్థైర్యమునకు రాజభక్తికి మురిసిపోవుచుండెను. ఇట్టి జంటలు దేశమునం దంతట నుండుచో తమ సామ్రాజ్యమాకల్పాంతము స్థిరమై యుండగల దనుకొనెను.

వైజయంతీ స్కంధావారమున సాతకర్ణి మహారాజు విశ్రాంతి తీసుకొనుచుండెను. ఆయనకు యుద్ధవార్త లెప్పటికప్పుడు తెలియ వచ్చుచున్నవి. రాజధాని నగరమైన కళ్యాణిని వదలి యించు మించు క్షహరాజ రాజ్యమంతయు తమకు హస్తగతమైనదనియే చెప్పవచ్చును. రాజస్థానమునుండి వార్త రాలేదు. కల్యాణి నగరము విషయము పుండరీకుఁడు నిర్వహించుకొని రాగలఁడు. ఈ పర్యాయము తన మాతృదేవికి పరమానందమును జేకూర్చి సంఘటన లెన్నియో జరిగినవి. తన జనని పాటలిని పిలిపించి యెంత సులభముగ వ్యూహరచన మొనర్చినది!

పాటలిని గూర్చి యోజించినకొలది సాతకర్ణి మహారాజున కాశ్చర్య మెక్కుడగుచుండెను. ఆమెను ఘనముగ సమ్మానించ వలెననుకొనెను.

వైజయంతి స్కంధావారమున ప్రభువిట్లాలోచించు చుండగా కల్యాణిలో యమదంష్ట్రికా దళము పాటలిని చెఱసాలలోనుంచి రన్న వార్త తెలిసి క్రోధోన్మత్తమై ప్రభుత్వమును నిరసించుచు, రాజధాని యందంతట సభలు సమావేశములు జరుప నారంభిం చెను. ఒకవైపున పల్లెసీమలనుండి యుద్ధావసరములకని వసూలు చేసిన యదనపు పన్నుల భారముచే క్రుంగి విసిగిపోయిన కృషీ వలు లందఱు తండోపతండములుగ నుద్రిక్తులై కత్తులు కఱ్ఱలతో

రాజధానిపై దండెత్తి వచ్చుచుండిరి.

పుండరీకుని నాయకత్వమున సాతవాహన సైన్యము మేఘములపై పర్వెత్తి వచ్చుచున్నట్లున్నది. రాజమరాళుఁడు నగరమున లేడు. శత్రుసైన్యము మున్నెన్నడును వాలువలె దూసికొని వచ్చుచున్నది. శిశునందికి భయమయ్యెను. తానెవని సాహాయ్యమున రాజ్యపాలన మొనర్చుచున్నాడో యా రాజప్రతినిధు లీవరకే శత్రువుల యధీనము నందుండిరి. తన కుమార్తె యపహరింపఁబడినదను దుఃఖముతో భూమకుడు సతమత మగుచుండెను. తన సర్వ సైన్యాధ్యక్షుఁడు రాజస్థాన యుద్ధరంగమున నుండెను.

శిశునంది భయస్థుఁడే కాని యాలోచనాపరుఁడు. తనకు మిగిలిన దొక్క కల్యాణి దుర్గము మాత్రమే! రాజధానిలో మూలబలమున్నది. ఈ బలము చాలునో చాలదో! మూఁడు నాలుగు రంగములలో విజయమును చూఱగొనిన సాతవాహన సైన్యములు సమవేతమై కల్యాణి పైకి రాగలవు. అప్పుడిక కల్యాణి యేమి కావలెను? తన యంతఃపురము గతియేమి? సాతవాహన సేనానివహమునందు పుండరీకుఁ డత్యంత సమర్థుఁడని వార్తల వలన తనకుఁ దెలిసినది. చప్పస్వామి పాటలీ పుండరీకులు పరస్పరము ప్రేమించుకొన్నారని చెప్పెను. వారిరువురు రాజనీతి సమగ్రముగ నెఱిఁగినవారు. ధనుర్విద్యయం దద్వితీయులు. ఖడ్గవిద్యయం దసమానులు. పాటలిని చెఱలోనుంచిన వార్తఁ దెలిసికొని పుండరీకుఁడు తన సైన్యమును సమీకరించి కల్యాణీదుర్గమును ముట్టడించఁగలఁడు.

యుద్ధము జరుగనేరాదు. పుండరీకుని ప్రతారించి మార్గమధ్యముననే మట్టుపెట్టవలెను. అదియెట్లు? వప్పస్వామి రాజనీతి చతురుఁడుగాడు. ఖడ్గవిద్య నెఱిఁగినవాఁడు గాడు. ముగ్ధదీపుని యొద్ద తాను ఖడ్గవిద్యను నలుగురికి నేర్పించెనుగద. ఆ నలుగురు ఖడ్గవిద్యా విశారదులను గొనిరమ్మని శిశునంది వప్పస్వామిని పంపెను. వారు నల్గురును మహారాజును దర్శించిరి. వారందఱు రాజునకు వీర నమస్కార మొనర్చిరి. శిశునంది వారలతో నిట్లనెను — "ఓ ఖడ్గ విద్యావేత్తలారా! మన రాజ్యమిప్పుడు సంకట స్థితిలోనున్నది. నేను మీ నలుగురికి ముగ్ధదీపుని వద్ద కత్తి యుద్ధము నందలి యనేకములైన క్రొత్త మెలకువలను నేర్పించితిని. ఆ ముగ్ధదీపుఁడు పురుషుఁడుగాడు. ఆతడు స్త్రీ. ఆమె పాటలి! ఆమె సాతవాహన సామ్రాజ్యమునుండి గూఢచారిణిగ వచ్చినది.

క్షహరాట రాజ్యము నామె యల్లకల్లోలమొనర్చినది. తనతోడి గూఢ చారులతో మంతనముచేసి మన కోశాగారమును చమత్కారముగ కొల్లగొట్టినది. తుదకీ వప్పస్వామి యెదురెత్తులవలన మనచేతఁ జిక్కినది. మేమామెను చెఱసాలలోఁ బెట్టించితిమి.

మన చెఱసాల నగరమునకు చాల దూరమున నున్నదిగద. అచ్చట మన సైన్యమున్నది. పుండరీకుఁడొకవేళ తొలుత తన ప్రియురాలిని కారాగారమునుండి విడిపించుకొనుటకై ఆ దెసకే తన సైన్యమును నడప వచ్చును. కళ్యాణి దుర్గముపై నెత్తిరాడను కొందును. రాజమరాళుఁడు రాజస్థానపుటాహవమున నిర్జింపఁబడె నని వార్తవచ్చినది. అతఁడు పరాజితుఁడగుటన్నది యితఃపూర్వ మెన్నఁడును జరుగనిది. ఈ మహా సంగ్రామమున మేమూహించని సంఘటనలెన్నో జరిగినవి. అందులో నిది ప్రముఖమైనది!

వప్పస్వామి యిట్లనెను — నేనింకను లోతులు తీసి కను గొన్న విశేషములను మనవి చేయుచున్నాను. పాటలియే దీపశిఖ గద! రాజమరాళుఁ డామెను కామించెను. దీపశిఖ తీయని మాట లతో చేష్టలతో రాజమరాళుని వశమొనర్చుకొని వానినుండి వాగ్దా నము గైకొన్నది. యుద్ధసమయమున క్షహరాట సైన్యమును సాత వాహన సైన్యముతో కలిపివేసి సాతవాహనులకు విజయము చేకూ ర్చెదనని వానిచే వాగ్దానము చేయించుకొనినది. ఇదివరకే తమతో మనవి చేసితినిగద. 'యమదంష్ట్రిక' యన్నపేరుతో మనరాజ్య మున సాతవాహన గూఢచార దళమున్నదని! ఆ దళమునందొకని నెట్లోవశము చేసికొంటిని. అతని ద్వారమున పాటలి రహస్యము లను కొన్నిఁటిని తెలిసికొనఁ జాలితిని.

శిశునంది: ఓ ఖడ్గ విద్యావిశారదులారా! మీరు రాజభక్తి కలవారు! మీ వలనఁగాని యీనాడు కల్యాణీదుర్గము నిలువదు. మీరు నల్వురును మేము చెప్పినట్లు చేయవలయును. అప్పుడు మన దుర్గమున కెట్టికీడును వాటిల్లదు. పుండరీకుఁడు ససైన్య ముగ మన నగరముపై నెత్తివచ్చుచున్నాడు. దుర్గ రక్షణభారము మేము వహింతుము. బురుజులు కోటగోడలు భద్రపరచవలయును. అగడ్తయందు నీరు నిండింపవలయును. ఆ సర్వమును మేము నిర్వహింతుము. ఇఁక మీ నల్వురిలో ముగ్గురు సాతవాహన సైనికుల వలె నటించుచు పుండరీకుఁడు మన రాజధాని నగరముపై కెత్తి రాకుండ మార్గమధ్యమునుండియే వెనుకకు మళ్ళింపవలయును. నాల్గవ వాడును వప్పస్వామియు కారాగార రక్షణలో నప్రమత్తులుగ

నుండిపోవలయును. జయానందా! అంశుమాలీ! సుబలా! మణిమంతా! మీ నలుగురికి ముగ్ధదీపుఁడు గురువు. నిజమునకు మీకు గురువు ముగ్ధదీపుఁడుగాని పాటలి కాదుగద. అసలావిద్యను మీకు నేర్పించిన దిట్టి యవసరములు వచ్చిన నాదుకొందురనియేకద! మన రాజ్యమునకీనాడు మీతో నవసరము వచ్చినది. మీ విద్యాపాటవమునకు పరీక్షాసమయము వచ్చినది. మీరు మీ విద్యావైదగ్ధ్యమును ప్రదర్శించి నగర సంరక్షణమొనర్చి మీ రాజభక్తిని దేశభక్తిని నిరూపించవలయును.

అంశుమాలి కారాగారము నొద్ద నుండవలెను. జయానందుఁడు, మణిమంతుఁడు సుబలుఁడు పుండరీకుని కెదురునడచి వంచనచేసి పుండరీకుని మార్గమునందే సంహరింపవలెను. అవసరమగుచో నుపాంశువధకైనను వెనుదీయరాదు. లేకున్న ముగ్వురొక్కుమ్మడి దొమ్మిగఁ గవిసి యుద్ధ మొనర్చియైన సరే, యెట్లయిన నాతని వధించి తీరవలెను. ధర్మయుద్ధమునం దాతఁడపరాజితుఁడు. మీరీ కార్యమును సాధించినచో నాతని యనీకిని నిస్సహాయ మగును. మనకంతట కార్యము సులువగును.

వప్పస్వామియు నంశుమాలియు చెఱసాల యొద్దకు పోవలెను. అంశుమాలి కారగారమును రక్షించుచుండవలెను. వప్పస్వామి యచ్చటి పరిస్థితుల నెప్పటికప్పుడు మాకుఁదెలియఁ జేయుచుండవలెను. అంశుమాలీ! నీవు నిర్వహింపవలసిన విధులు రెండున్నవి. పాటలి యెట్టి పరిస్థితి యందును తప్పించుకొనిపోరాదు. పాటలీ పుండరీకు లిరువురు వప్పస్వామిని చంపుటకు యత్నింతురు. నీవు వప్పస్వామిని రక్షించుచుండవలెను. అతఁడు మనకాశ్రితుఁడు. ఆతని రక్షించుట మనధర్మము. నా కాయనతో కావలసిన పని యెంతోయున్నది.

రాజమరాళుని వయస్సేమి? ఈ కాముకత్వమేమి? పెండ్లము బిడ్డలు కలవాఁడు. రాజ్యమున పేరుమోసినవాఁడు. జీవితమును సమృద్ధిగ ననుభవించినవాఁడు. ఇన్నేండ్లుగ రాజభక్తి నకుంఠితముగ నెఱపినవాఁడు. ఇప్పుడీనాడొక దొంగనర్తకి చేతిలో మోసపడినాడనగా నా కబ్బురముగనున్నది. ఓ వీరాగ్రణులారా! మీరు భద్రముగ నుండవలెను. ప్రయోజన మున్నప్పుడె మీరు ఖడ్గవిద్యను వెలయింపుడు. లేని తావుల మీ తెలివితేటలే మీ కండగ నుసలవలెను. అంశుమాలీ! నీవు మోహపెట్టఁబడవచ్చును. పాటలి నిన్ను బెదరించును. తాను నీకుపాధ్యాయిననును. తన్నెదిరింప

చేయుండు. ఆసైన్యమీరాత్రి కిచ్చట బసచేయును. మరునా డుదయమున నిటనుండి కదలిపోవును. ఇందు మీకు నష్టమగునది ధనమేకద! ఆ నష్టము మీ కెట్లును తప్పదు. మీ గృహములు భద్రముగ నుండును. తరువాత నేమిచేయవలయునో మేము చెప్పెదము. మీ కెల్లరకు మేము చెప్పిన దంగీకారయోగ్యముగ తోచినచో మిగిలిన విషయమును మేమే నిర్వహింతుము."

ఆ గ్రామమునందు పోగా మిగిలిన పెద్దలందఱుఁజేరి కొంత తడవు తర్జన భర్జనలు చేసికొని తుదకు వారి సూచనకు తమ యంగీకారమును దెలియఁజేసిరి. సాతవాహన దళపతియైన పుండరీకుడొక గొప్ప ధనవంతుఁడైన వర్తకునియింట నతిథిగ నుండుటకు నిర్ణయము జరిగినది. తక్కిన సేనాపతులు నట్లే యితర ధనిక వర్తకులిండ్లనుండి పోవుటకుఁగా నిర్ణయము జరిగెను. గ్రామమంతయుఁజేరి యా సైన్యమునకు వలయు భోజన పదార్థముల సమకూర్చు నేర్పాటు గావించుకొనిరి. అంశుమాలి, సుబలుఁడు, జయానందుఁడు మాత్రము తమ పదక మెవ్వరితోడను చెప్పలేదు. పుండరీకునికే గృహాధిపతి గృహమున నాతిథ్య మేర్పాటు చేయుటైనదో ఆ గృహపతి కొక్కనికే వారి యభిమతమును విశదపరచిరి.

ప్రొద్దు క్రుంకువేళకు గ్రామమునందలి జనులందఱు వ్యగ్రులగుచుండిరి. చందమామ యాకసమున పారిజాతమాలా విసరము వలె విరియుచున్నవేళకు, సాతవాహన సైన్యము బిలబిల లాడుచు వీరాలాప వికటాట్టహాస ముఖరిత దిగంచలములై, జవనాశ్వఖుర సంఘట్టనములచే నంబరవీధికి సాగిన ధూమరేఖలచే గ్రామ దహన భ్రాంతిని గల్పించుచు శంఖ భేరీ కాహళ ఢక్కా పణవాది వివిధములైన యాహవ వాద్యఘోషము లాకాశమును శబ్దమయ మొనర్చు నొక ఝంఝా ప్రకంపనమువలె గాలిలో నెగురుచు రెపరెపలాడు కేతనములతో నౌకాబలమట్లు సాగి వచ్చుచుండెను.

గ్రామమునందలి పెద్దలు పిన్నలు ఎల్లరును సేన కెదురు పోయిరి. పండ్లు పూలమాలలు పలువిధములైన వంటకములు పాయసములు, పానకములు, సర్వమును సైన్యము కొఱకాయత్తమై యుండెను. వండెడివారు వడ్డించెడువారు తగిన పాత్రలలో సర్వవిధ సంభారములూరి మొగదలనే యమరించిరి. సాతవాహన సైన్యము నివ్వెరపోయెను. తాము యుద్ధమునకేగుచున్నారా లేక విందుభోజనమునకా తెలియకుండ నున్నది!

అచ్చటి పెద్దలందఱు పేరు పేరు వరుసన సేనాపతులను

తమతమ గృహములకు విందున కాహ్వానించిరి. వారెల్లరంగీక రించిరి. పుండరీకుఁడు గ్రామమునందెల్లరకంటె ధనవంతుఁడైన నందిగుప్తుని కతిథిగ పోయెను. వంటకింకను నాలస్యమున్నది. వంటసాలయందుండి బహువిధ రుచ్యఖాద్యములు తయారగు చున్న సువాసనలు, తాలింపుల ఘుమఘుమలు వాయు సంచార మున సాగివచ్చి పుండరీకుని జిహ్వాగ్రమునఁ జవు లూరించుచుం డెను. పుండరీకుఁడు స్నానాదికముల నిర్వర్తించి యూయెలబల్లపై కూర్చుండెను.

నందిగుప్తుఁడచ్చటికి వచ్చి వినయ వినమితగాత్రుఁడై పుండ రీకునికి నమస్కరించి యిట్లనెను—అయ్యా! సేనాపతులవారూ! నాదొక మనవి. చిత్తగించవలెను. నా కిరువురు మేనల్లుండ్రున్నారు. వారు వట్టి మూర్ఖులు. వారిలో నొకఁడవిటివాఁడు. ఇరువురు నెదో కొంచెము కత్తిపట్టుట నేర్చుకొన్నారు. మా కులవృత్తిఁ జేయమం దురు. తాము సేనానాయకు లగుదురఁట! మీరు నాయందు దయయుంచి వారిని తమ సేనలో దినబత్తెమునకుఁ జేర్చుకొన్నచో నా కుపకారముఁ జేసినవారగుదురు.

పుండరీకుఁడు నవ్వి—వారిని పిలిపించుఁడు చూచెద మనెను. నందిగుప్తుఁడు వారినటకు రావించెను. మూఁడవయాతఁడు కూడ వారిరువురివెంట వచ్చెను.

పుండరీకుఁడు : ఏమోయీ! నీకు కత్తియుద్ధము చేతనగునా?

జయానందుఁడు : చేతనగును.

పుండరీకుఁడు : నీ పేరు ?

జయానందుఁడు : జయానందుడందురు.

పుండరీకుఁడు రెండవ వానినిసైతమట్లే ప్రశ్నించెను.

రెండవ : నా పేరు మణిమంతుఁడు. నాకుఁగూడ కత్తిపట్టుట తెలియును.

జయానం : అతఁడు నా స్నేహితుఁడు, సుబలుఁడు. ఖడ్గ విద్యలో నారితేరిన దిట్ట. మా యిరుప్వర కాతఁడు గురువు.

పుండరీకుఁడు : నే నెవరనో మీకుఁదెలియునా ?

జయానం : తెలియదు. ఎవరైన మాకేమి ? నీవు మాతో కత్తియుద్ధము చేసెదవా ?

ఆతఁడనిన మాటలో మర్యాదలేదు. లెక్కలేని తనమున్నది! తిరస్కార భావమున్నది !

నందిగుప్తుఁడు భయముఁ జెందుచున్నట్లు నటించెను.

పుండరీకుఁడు : మీతో యుద్ధముకూడ చేయవలెనా ?

జయానం : మాటలతో నేమిపని ? చేతనైనచో సిద్ధపడుము. అప్పుడు చూచెదవుగాని !

పుండరీకుని కొడలుమండిపోయెను. ఒఱయందలి తన ఖడ్గమునుదూసి వాని నెదో చేయఁబోయెను. పుండరీకుని కది సాధ్యము కాలేదు. ఆతని మొగము బిగిసెను. యుద్ధము కావలెనంటివికద చేయుదును రండనెను. వారల నా గృహమునకు వెనుక వైపుననున్న బ్రహిఃప్రదేశమునకుఁ గొంపోయెను. వెన్నెలలు పాలు ప్రవహించునట్లు సచ్ఛములై ప్రకాశించుచుండెను. జయానందుఁడా బహిరావరణ ప్రదేశమునఁ బుండరీకునితో తలపడెను. పుండరీకుఁడు మణిమంతునిగూడ పాల్గొమ్మనెను. అతఁడుగూడ నందు ప్రవేశించెను. పుండరీకుఁ డిరువురితో నొకేసారి పోరాడమొదఁగెను. వారల యుద్ధ ప్రక్రియలు పుండరీకుని కాశ్చర్యముఁ గొల్పెను. వారి యొడుపులన్నియు, తమ రాజ్యమునందలివి. ఆ మెలకువలు తనకును పాటలికిని గాక వేరెవ్వరికిని తెలియనివి. పాటలి రాజమాతనుండి యింకను క్రొత్తపద్ధతులను కొన్నింటిని నేర్చుకొనియుండును.

పుండరీకుఁడిట్లు భావించు చుండగా దూరమున నుండి యాపోరాటమును చూచుచున్న సుబలుఁడు పుండరీకుని యుద్ధము చేయు రీతి యచ్చముగ ముగ్ధదీపునిఁ దలపించుచున్నది. వీరిరువురు నొకే గురువునొద్ద నభ్యసించి యుందురు. యుద్ధమీగతి నడచుచో నీ రాత్రి కది తెమలదు. ఇరుదెసల సమానబల మున్నట్లున్నది. పుండరీకుఁడు చండునివలె నున్నాడు. మణిమంత జయానందులు విద్యయందు చురుకైనవారు. కాని వారి నిర్వుర పుండరీకుఁడూపిరి తీసికొన నిచ్చుటలేదు. యుద్ధమిట్లే ధర్మపద్ధతిలో నడచుచో పుండరీకుని చేతిలో వారిరువురుఁ దెగుట నిశ్చయము. ఇచ్చట వెన్నుపోటు పొడిచినఁగాని కార్యము సానుకూలముకాదు. అదుగో ఆ దెబ్బ మణిమంతుని గాయపఱచినది. అయ్యో ! జయానందుని రొమ్ము రక్తము చిందుచున్నది. ఆ పుండరీకుఁ డినుపగుదియ ! వాని దేహమునందొక్క కత్తిగీటులేదు. చూచుచు నూరకొన్నచో ప్రయోజనములేదు. సుబలుఁడు లక్ష్యమునకై నిరీక్షించుచుండెను.

పుండరీకుఁడు : వీరులారా ! మీరీ యుద్ధ ప్రక్రియల నెచ్చట నభ్యసించినారు ?

జయానం : ఏమి ! నీకు నిలువరించుకొనుట కష్టమనిపించు

చున్నదా ? ముగ్ధదీపుఁడు నేర్పినాడు.

మణిమంతుఁడు : కాదు—దీపశిఖ—కాదు—పాటలియంట! ఆమెయొద్ద.

పుండరీకుఁడు : ఏమి ? పాటలియొద్దనా ?

జయానం : ఆశ్చర్యముగ నున్నదా ? ఓహో ! ఆమె నీ ప్రియురాలు కాబోలును ! ఆమెను మా ప్రభువులు రాజద్రోహ నేరమునకై ఖైదుచేసినారు.

మణిమంతుఁడు : నీకు చేతనగునేని మమ్ముల( గడచి యామెను రక్షించుకొనుము.

అట్లనుచు వారిరువురు తమ ఖడ్గములను విచిత్రముగ ఝళి పించిరి.

పుండరీకుఁడు : అటులనే చేసెదను. ఇదిగో యీ దెబ్బను గాచికొనుఁడు. తరువాత చూచుకొందము. గురుద్రోహులారా !

పుండరీకుఁడు పదియడుగులు వెనుకకు లంఘించి యొక్క లిప్తలో తన కత్తిని వారిపై విసరఁబోయెను. ఆ ఖడ్గపాతము జరుగుచో నిఁక మణిమంతుఁడులేడు, జయానందుఁడులేడు! తత్క్షణము సుబలుఁడు గుఱిచూచి తన ఛురికను పుండరీకుని వెన్నున విసరెను. పుండరీకుఁడబ్బా! యనెను. అతని చేతినుండి ఖడ్గము జారిపోయెను. అది యదనుగ జయానంద మణిమంతులు లవ్వోత్తున పుండరీకునిపైఁ గలిసి తమ ఖడ్గముల నాతని రొమ్మునఁ గ్రుమ్మిరి.

పుండరీకుఁడాయాసముతో — పిరికిపందలారా ! ఇందులకా మీ యీ విందులు ! ఛీ ! మీ మొగముఁజూచిన పాతకములు చుట్టు కొనును. దొంగబ్రదుకు బ్రదుకు మీకు కత్తి యుద్ధ మెందులకు ? పాటలి మిమ్ము సంహరించును లెండు. అప్పుడుగాని నా యాత్మ శాంతించదు. మా ప్రభువు మీ రాజ్యమును ధ్వంసముచేయును. మీ కొఱకు గోతులు త్రవ్వఁబడి సిద్ధముగ నున్నవి.

పుండరీకుఁడిక నిలువఁజాలకుండెను. అతఁడు—"పాటలీ ! పాటలీ ! నేను పోవుచున్నాను. మన కలయిక యిఁక పరలోకము నందే !" యనెను.

పుండరీకుఁడు నేలఁగూలెను. ముగ్గురు మొగములు చూచి కొనిరి.

ఆ మువ్వురచటినుండి వెళ్ళిపోయిరి. వారు మిగిలిన సేనా పతులు బసచేసిన వారి యిండ్లకేగి వారికి విడివిడిగ పుండరీకుని వధ వార్త నందించిరి.

సాతవాహన సైన్యమున కీ వార్త తెలియదు. నందిగుప్తుఁడీ వార్త మిగిలిన సేనాపతుల కందఁజేయుటయు, దారిలోనే వారిని, వారి రక్షకభటులను, వధించుటయుగ నిర్వహించిరి. క్రమముగ తెల్లవారు వరకీ వార్త గ్రామమునందంతట పాక్కిపోయెను. సైన్యము గ్రామమునఁ బ్రవేశించి యంతయు దోచుకొని గ్రామము నంతను ధ్వంస మొనర్చి తగులఁబెట్టి పోయెను.

ఆ ముగ్వు రేమైనారో తెలియదు.

.... .... .... .... ....

కల్యాణి నగరములో వప్పస్వామి వార్తలు తీసెను. యమ దంష్ట్రికాదళము, అదనపు పన్నుల భారముతో నసంతుష్టులైన ప్రజానీకము మూకలు మూకలుగ చెఱసాల వైపునకు పర్వెత్తి వచ్చు చున్నారని వార్త వినిపించెను. అతఁడు వచ్చి అంశుమాలి కీవార్తను దెలియఁజేసెను. అంశుమాలి చెఱసాల కవాటములు మూయించి, అచ్చట కొంత సైన్యమును కాపుంచెను. యమదంష్ట్రికాదళము నకును ఆ సైన్యమునకును చిన్నచిన్న పోరాటములు జరుగు చుండెను. రెండు మూఁడు దినములిట్లు సాగెను. మూఁడవనాడు సందెచీకటులు ముసరుకొనువేళకు సుబలుఁడును జయానంద మణిమంతులును కల్యాణికి తిరిగివచ్చిరి. పుండరీకుఁడును, మిగిలిన సేనాపతులును వధింపఁబడిన వివరములు రాజున కందఁ జేసిరి. సాతవాహన సైన్యము వెనుకకు మరలిపోయిన దనిరి.

వారు నల్వురును మూలబలమునుండి కొంత సైన్యమును వెంటఁదీసికొని చెఱసాల చుట్టును మూగియున్న ప్రజా సందోహ మును చెల్లాచెదరు జేసిరి. మరుసటిదినమున కల్యాణిదుర్గమునకు సంబంధించినంతవరకు భద్రత యేర్పడినదని చెప్పుట కనువైన స్థితికల్పనము జరిగినది.

మరునాడు శిశునంది మహారాజు సభతీర్చెను. పాటలి యా సభలోనికిఁ దీసికొనిరాఁబడినది. ఆమె నిలువెల్ల గొలుసులతో బంధింపఁబడి యుండెను. పాటలి యవమానితురాలై కురురాజు సభలో నిల్పఁబడిన పాంచాలీ దేవివలె దుర్నిరీక్ష్యయై యుండెను! ఆమె నిలువెల్ల నభిమానముతో కంపించిపోవుచుండెను. ఆమె కన్నులగ్నిజ్వాలలు మియుచుండెను. జయానందుఁడు శిశునంది మహారాజు చెవిలో నెదియో చెప్పెను.

మహారాజు పాటలి సంకెలల నూడదీయించి యిట్లనెను— పాటలీ! నీవసలు పాటలివో, దీపశిఖవో, ముగ్ధదీపుఁడవో తెలియదు.

సాతవాహన సైన్యము మా క్షహరాట బలము ముందాగజాలదు. మా సేనాపతియైన రాజమరాళుని నీవు వలలో వైచికొని, మా సైన్యమును యుద్ధసమయమున సాతవాహన సైన్యముతో గలిపి, మమ్ము పరాజితులఁగావించి సాతవాహనులకు విజయముఁ జేకూర్చునట్లా తనిచే వాగ్దానముఁ జేయించుకొనినావు. మోసమును మోసముతోనె యెదుర్కొనవలయును. ఇఁక నిన్ను విడిపించి తీసికొని పోవుటకు నీ పుండరీకుఁడు రాడు. అతఁడు మా యోధవరులచే సంహరింపఁ బడినాడు.

పాటలి యపహాసముగ నవ్వెను.

శిశునంది: నీకు నమ్మకము కల్గుటలేదుకాబోలు! నిజమే. ఆ పుండరీకుఁడట్టివాఁడే కాని కాలము సర్వవేళలం దొక్కరికే యనుకూలించదు కద!

జయానందుని కనుసన్నచే పుండరీకుని ఖండింపఁబడిన శిరస్సు పాటలికిఁ జూపింపఁబడెను. పాటలికి దుఃఖము నాశ్చర్యము క్రోధ మొక్కసారిగ నుబికి వచ్చినవి. ఆమెకి మూఁడును కంఠ గతములై యామె నివ్వెరపడి నిలబడిపోయెను. ఆమె స్థాణువో శిలయో యన్నట్లుండెను!

అది చూచి వప్పస్వామి — పాటలీ! నిన్ను వీ రిప్పుడు వధింతురు. నీకొక్కటే మార్గమున్నది. నీ వెంతటి కుటిల నీతిని నెఱపితివో నేను నంత కపటముగనే వర్తించితిని. నీ పుండరీకుఁడు చనిపోయినాడుకద! నీ విఁక నన్ను వరింపుము. శిశునంది మహారాజులు నిన్ను విడిచిపెట్టుదురు. నీ కపట ప్రవర్తనను మాని ఋజుమార్గమున సంచరించుచు మహారాజును సేవించుచో నాయన నిన్ను క్షమించెదరు. శిశునంది మహారాజు క్షహరాట రాజ్యమును వృద్ధిఁజెందింతురు.

వప్పస్వామి యిట్లనుచుండగా పాటలి యాతని దెసఁజూడ లేదు. ఆమె శిశునందితో నిట్లనెను—మహారాజా! నా ధర్మమును నేను నిర్వర్తించితిని. నే నిప్పుడు మీకు బందినినై యున్నాను. మీరు నన్నేమి చేసినను చేయఁగలరు. వధించిన వధింపఁగలరు.

జయానం: నిన్ను మహారాజులు వధింపరు. నీవద్ద మేము నలుగురము ఖడ్గవిద్య నభ్యసించినాము. మహారాజు మమ్ములను నీ నుండి ఖడ్గవిద్యారహస్యములను తెలిసికొనుట కేర్పాటు చేసినారు. మేము నీకు శిష్యులముగాము. నీవు గౌతమీపుత్ర శ్రీసాతకర్ణి కెట్టు గూఢచారిణివో మేము నట్లే మా మహారాజునకు గూఢ

చారులము. ఇదుగో మేము నల్వుర మిచ్చుట నున్నాము. నీవు మాలో నొక్కొక్కరితో ద్వంద్వ యుద్ధము సేయుము. నీవు మమ్ముల నల్వురను వధింతువేని మా ప్రభువులు నిన్ను వదలి పెట్టుదురు. తరువాత నీ యిష్టము.

పాటలి కన్నులనుండి విస్ఫులింగములు రాలుచుండెను. ఆమె క్రోధోన్మత్త భద్రకాళియై మండిపడుచు నిట్లనెను—ఏమీ మీ నల్వురతో విడివిడిగ పోరాడవలెనా! మీ విద్యకు తోడు మిమ్ము నల్వుర నొకేసారి వధించలేనా? నల్వురొకేసారి తలపడవచ్చును. మిమ్ముల నల్వుర నణకలేనిచో నేను పాటలినే గాను.

వప్పస్వామి: నీవు పాటలి వెన్నడును కావు. నీవు పాటలివో—దీపశిఖవో—ముగ్ధదీపుడవో నీకే తెలియును.

పాటలి: సిద్ధముగండు. జయనందా! మణిమంతా! సుబలా! అంశుమాలీ! నేను మిమ్మందఱ నొకే క్షణమున వధించి తీరెదను.

జయానం: మేము నల్వురమును కలసి పోరాడము. నీ భర్తయైన పుండరీకుని సంహరించినది నేనే. నిన్ను సైతము నేనే వధింతును. ఖడ్గవిద్యలో నీకుఁ దెలిసిన మెలకువ లన్నింటినిఁ నీవు మాకు నేర్పినావు. మా విద్యారహస్యములు నీకుఁ దెలియవు. నేనా రహస్య ప్రక్రియలచే నిన్ను సంహరింతును. మా ప్రభువులు దయార్ద్రహృదయులు. మా నల్వుర నీవు సంహరించుచో, వారు నిన్ను విడిచిపెట్టుదురేమో! అయినను నీవిఁక బ్రతికి యుండ రాదు. నీవు సగమాడుదానవు. సగము మగవాఁడవు. నీలో సగమును నీ భర్తను మే మిదివఱకే కడతేర్చినాము కద. పాపము నీవును సగము చచ్చియే యున్నావు. ఇప్పుడిఁక పుండరీకుఁడు చావగా మిగిలిన పాటలి భాగమును తుదముట్టింతుము. అసలీపాటికి నీకై నీవే చావవలసి యుండెను

పాటలి జయానందుని నిప్పుకన్నులఁ జూచెను. జయానందుఁడు భయపడెను. ఈమె తన్ను ఖండించునేమో! తన శిష్యులందఱిలో పాటలి తన్నెక్కువగ మన్నించెడిది. విద్య నెక్కుడు నేర్పినది. తానామె ప్రాణాధిక ప్రియుజనుని వధించి నాడు. ఆమె యేమైనఁ జేయవచ్చును. తానును సర్వమునకు సిద్ధ పడియే యున్నాడు.

వారు నల్వురును వప్పస్వామియు శిశునంది మహారాజును ఖడ్గయుద్ధమున కనువైన బహిఃప్రదేశమున కరిగిరి. మహారాజెంత

తెలివిగలవాఁడో అంత భయస్థుఁడు. ఎంతధీరుఁడో అంత జాలి గుండె గలవాఁడు. ఎంతటి రాజకీయ వేత్తయో అంత మన స్థైర్యము లేనివాఁడు. ఆయన నల్వురను పాటలి నొక్కమ్మడిగ నెదుర్కొనుఁడనెను.

జయానం: మహారాజా! నే నీమెను వధింప లేకున్నచో తక్కిన ముగ్వుర నామెతో పోరనిండు. నే నొంటరిగనే యామె నెదుర్కొందును.

రాజటులే కానిమ్మనెను.

జయానం: పాటలీ! నీవు సర్వాంధ్ర మహా సామ్రాజ్య గూఢచార దళాధిపతి ప్రియురాలవు గావచ్చును. నీతి యందు కౌటిల్యుని మరపించుదానవే కావచ్చును. సామ్రాజ్యములఁ గూలద్రోయుట కనువైన వపుస్సౌందర్యము కలదానవే కావచ్చును. దిగ్దంతుల వంటి మహా వీరుల నికొనగోళ్ల నాట్యమాడించు నంతటి కుటిల నీతిని నెఱపగల నెఱజాణవే గావచ్చును. కాని యిన్ని యుండియు నీవు పాపము స్త్రీవి. శైలూషివి! నే నాడుదానితో పోరాడను. నీవు మగదీపుఁడవై రమ్ము. అప్పుడు నీతో పోరుదును.

పాటలికి నఖశిఖా పర్యంతము దహించుకొని పోవుచుండెను. కాని, యామెకు యుద్ధము ప్రధానము. ఆ నల్వురను మట్టుపెట్టుట ప్రధానము. అందుచే నామె వారొసంగిన ముగ్ధదీపుని దుస్తులను ధరించి తనకు గౌతమీపుత్ర శ్రీసాతకర్ణి మహారాజు బహూకరించిన చంద్రహాసమును తెప్పించుకొని జయానందుని కెదురు తీరి యిట్లనెను—"ఓయీ! జయానందా! నీ వాడదానితో యుద్ధము సేయవా? మూర్ఖుఁడా! ఆడ దానివద్ద ఖడ్గవిద్య నెట్లునేర్చితివి? ఆమెకు శిష్యరికము చేసితివికద. నీ మగఁటిమికి నా స్త్రీత్వ మడు వచ్చినదా! వేషాంతరమైనచో నాడతనము మాసిపోవునా కుటిలుఁడా! సత్యభామాదేవి యాడదికాదా? ఆమె నరకాసురుని వధించిన నాఁడాడదియే యందువా? బుద్ధిహీనుఁడా! రమ్ము. నీతో నాకు వాగ్వాదమెందులకు! ఒక మహావిద్య ప్రకాశించుటకు స్త్రీపురుషభేదము లడువచ్చునా! నీకు నా విద్యారహస్యములు తెలియునంటివి. విషయము తెలియుటవేరు. ప్రయోగవేళ నా విద్యయందు నేర్పును చూపగల్గుట వేరు. ఆ నేర్పెట్టిదో చూపింతునురమ్ము" అనుచు పాటలి చంద్రహాసమును చిత్రముగ

ఘుళిపించుచు జయానందునిఁ దాకెను.

పాటలి మాటలకు జయానందుఁడు సిగ్గుఁజెందెను. భయపడెను. నాల్గయిదు నిముసములు గడచువరకు యుద్ధము సామాన్యముగనే సాగుచుండెను. పాటలి ప్రహారములఁ దట్టుకొనుట జయానందునికిఁ గష్టమగుచుండెను. పుండరీకుని యందుకన్న నీమెయందీవిద్య యధికముగఁ బ్రకాశించుచున్నదనుకొనెను.

పాటలి : జయానందా! ఈ ప్రహారము నొద్దుకొనుము. దీనిని నేను నీకు నేర్పలేదు. దీనిని నాకు మహారాజమాత గౌతమీ బాలశ్రీదేవి నేర్పినారు. ఇది తెలుఁగువారి దెబ్బ! వందలయేండ్లుగ నాంధ్ర రాజకుటుంబములలో నిక్షిప్తమై వచ్చుచున్న విద్య. దీనిని తప్పించుకొనలేవు. చూడుము, నీవెటు మలిగినను నిది నిన్ను విడువదు.

ఇట్లనుచు పాటలి జయానందునిపై జందెపు దెబ్బను ప్రయోగించెను. ఆ ప్రయోగ వైఖరి యెట్టిదో యెవ్వరికిని బోధపడలేదు. మరుక్షణమున జయానందుఁడు నిలువెల్ల రెండు చీలికలుగ నేలఁ గూలెను. చూచువారికన్నుల నాంధ్యము క్రమ్మినట్లయినది.

అంశుమాలి మణిమంత సుబలులు మనస్సులందు భయపడి పోయిరి.

పాటలి : ఏమోయీ అంశుమాలీ! నీవు సిద్ధపడెదవా? మణిమంత సుబలులారా! యేమందురు?

మీరు మువ్వురేకమై నన్నెదుర్కొనుఁడు. చావునకు ముందు వెన్కాలెందుకు! మీ మువ్వురును మిత్రులుగద, సతీర్థులుగూడ పాపము! మువ్వురనుకలిపి పుండరీకుని క్షమాభిక్ష నడుఁగుకొనుటకై యూర్ధ్వలోకమునకుఁ బంపింతును. జయానందుఁడు నాకు ప్రియతమ శిష్యుఁడని మీకు తెలియునుగద. అతఁడే నా స్వామిని వధించెనఁట. అతఁడీపాటికి పుండరీకుని పాదములపైఁబడి క్షమాభిక్ష నర్థించుచుండును.

సుబలుఁడు : పాటలీ! పుండరీకుని వధకు ప్రధాన కారణము నేను. నేనాయనపై దొంగపోటుగ చుఱకత్తిని వెన్నున గాథ నేసితిని. ఆయన చేతిలోని ఖడ్గము జారిపోవుటకది హేతువైనది. అంతట నీ జయానందుఁ డాయనను సంహరించెను.

ఈమాటలలో పాటలి పదిబారలు లంఘించి వారి మువ్వురిపైఁ బడి—"ఏమి! నా భర్తను వెన్నుపోటు పొడిచితిరా? లేకుండిన నా మహాయోధుఁడు మీవంటి యనదల చేతిలో పడిపోవునా? రండు

నా పగఁ దీర్చుకొందును" అనుచు వారి మువ్వురను వరుసగ జందెపుదెబ్బలతో రెండేసి తుండెములుగ ఖండించి వికటాట్ట హాసము చేయుచు—"ఇంక నెవరైన నన్నెదుర్కొనువారున్నారా ?" యని ప్రశ్నించెను.

పాటలి : శిశునంది మహారాజా ! నేను నా ప్రతిజ్ఞను నిలుపు కొంటిని. చూచితివికదా ! మీ వీరాగ్రణుల యుద్ధనైపుణి ! పాటలి యాంధ్ర యువతి ! తెలుగువారి పౌరుషమన్య దుర్లభము. వారు యుద్ధ తీవ్రులు. చురుకుదన మెక్కువ గలవారు. తెలిసినదా !

ఆమె విజయ గర్వితురాలై ఠీవిగ నిలిచెను. అప్పుడామె నెంత మంది యెదుర్కొనినను నందఱ నఱకుటకు సమర్థయై మహిషా సుర మర్దనివలె భయంకరాకృతిగఁ జూపట్టెను.

శిశునంది : పాటలీ ! నీవు నిజముగ నన్నంతపని చేసితివి. ప్రత్యక్షముగ కనిపించుచున్నది. నేనును నా మాట నిలబెట్టుకొం దును. నేను నీకు స్వేచ్ఛ నొసంగుచున్నాను. నీ గాయములకు చికిత్స చేయింతును.

పాటలి నవ్వి—"మహారాజా ! మీరు సంబోధించుచున్న యువతి యేనాడో గతాయువైనది ! ఏ క్షణమున పుండరీకుఁడు సంహరింపఁబడెనో యా క్షణమునఁ బాటలియు మనసా మరణిం చినది. మీకుఁ గనిపించునది వట్టి ప్రతిహింసామూర్తి ! కర్తవ్య కఠినురాలై భర్తృ హంతకుల నులివెచ్చని రక్తధారలతో నాత్మపతికి తర్పణ మిడుటకై ప్రాణధారణ మొనర్చుచున్న జీవన్మృతురాలు ! నాతో మీకుఁగాదగినదేమున్నది ? మీకే గాదెవరికిమాత్ర మేముం డును ? నా భర్త యరివీర భయంకరుఁడు ! ఆయనను మీరు మోసముతో వధింపించితిరి. వీరు నల్వురు నా వద్ద పరమ వినీతు లైన ప్రియ శిష్యులవలె నటించి విద్య నేర్చినారు. నా నుండి నేర్చిన విద్యచేతనే నా స్వామిని సంహరించి నాకుఁ దీరరాని యప కృతిఁ జేసినారు. నా ప్రాణపతి నన్ను దలచుకొని నేను తప్పక పగ సాధింతు ననుకొనియుండును. వీరిని వధించకపోయినచో నా వీరాగ్రేసరునియెడల నపచార మొనర్చినదాననగుదును. లోకాం తరమున నా పతి నన్ను మన్నించునా ? ఇదిగో యిప్పుడిక నా యాత్మపతి కీ రుధిర ధారలతో నీ శ్మశాన సదృశమైన దేశమున నీ రక్తవాహినియొద్ద తర్పణ మొసఁగుచున్నాను" అనుచు పాటలి యచ్చట పడియున్న నల్వుర కంఠదేశములందలి నులివెచ్చ రక్త మును దోసిలుల గ్రహించి నేలపైఁ బారపోయుచు, "స్వామీ ! మీ

పాటలి మీకు శత్రురుధిర ప్రదాన మొనర్చుచున్నది. గ్రహింపుఁడు. మనకు సంతానము లేదు. మనము సంసారులము గాము. మన భావనామయ దాంపత్యము మనల శలాటువులుగ నిల్పినది. మన యుత్తమ గతులను మనమే కల్పించుకొనవలయును. వీరాగ్రణులకు రక్తతర్పణమును మించి కోరఁదగినదేముండును! నేను దేవి శ్రీసాతవాహని నుత్తమగతుల మనకుఁ గల్పించుమని యాత్మార్పణ మొనర్చి యర్థింతును. మీరుపదేశించిన భావనామయ దాంపత్యము లోకాతిగమై పరలోకగామిగ పరిణమించినది. కానిందు మన కేలోకమైననేమి! మన దాంపత్యజీవన మచ్చటనే వర్ధిల్లును."

పాటలి శిశునందిని సమీపించి—"మహారాజా! నేనొక్కటి మనవి చేయుచున్నాను. మీప్రక్కన నిల్చియున్నవాఁడు పరమ దుర్మార్గుఁడు. వాఁడు కీచకుఁడు. రాజమరాళునికంటె రెండాకు లెక్కువ చదివినవాఁడు. రాజమరాళుఁడు నా కొఱకై క్షహరాట రాజ్యమును బలివెట్టుటకైన వెనుదీయలేదు. ఈతఁడు నాకోసమై సాతవాహన సామ్రాజ్యమును బలివెట్టి దేశద్రోహి యైనాడు. వీరిరువురికి మరణశిక్ష పడితీరవలెను" అనెను.

వప్పస్వామి తలవంచుకొనెను. పాటలి యింకను నను చుండెను—"మహారాజా! వీఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. కృషీవలుఁడు మిమ్ము మోసగించినాడు. నిజమునకు మీరిర్వురును జేరి నాస్వామి నుపాంశు వధ చేయించినారు. ప్రతిక్రియగ మిమ్మిరువురను నేను వధించవలసియున్నది. వధించగలనుకూడ. కాని దానివలన నాకగునదేమున్నది? అది యట్లుంచి దీపశిఖగ మీరు నన్నెంతయో మన్నించితిరి. ముగ్ధదీపునిగ మీ సైన్యమునఁజేర్చుకొని వేతన మొసఁగినారు. మీ యుపకృతిని మిమ్ము వధింపఁజాలను ఇఁక నీ ద్రుచ్చును వధించుట గోటిమీఁదిపని. ఈతనిని వధించుట నా ఖడ్గమున కవమానము!

మహారాజా! మరియొక విషయమును జెప్పుచున్నాను. పుండరీకుని హత్యావృత్తాంత మీవరకే సాతకర్ణి మహారాజునకుఁ దెలిసియుండును. ఆయన క్రోధోన్మత్త గ్రీష్మ మధ్యాహ్న మార్తాండ మూర్తియై తరలివచ్చును. మీ ప్రాణము లెట్లును నిలువవు. నా కంతయు కన్నులకుఁ గట్టినట్లు దర్శనమగుచున్నది. క్షహరాట రాజ్యము నిస్సంశయముగ నిరవశేషమగును. మీ రాష్ట్రములన్నియు మా సేనల హస్తగతములైనవి. ఇఁక కల్యాణి నిలుపము. మీ యంతఃపుర రహస్యము లన్నియు మా ప్రభువులకుఁ దెలిసినవి.

నెల దినములలోనే సర్వము సమాప్తమగును".

పాటలి మరి మాటాడలేదు. యుద్ధభూమిలో రక్తకుల్యలు ప్రవహించుచుండెను. నాలుగుశవముల తుండెములు శిరస్సులు కత్తులు డాళ్లు పడియుండెను. నిలువెల్ల పుష్పించిన కింశుక వృక్షమువలె యొడలినిండ రక్తాక్తమయిన గాయములతో చినిగిన దుస్తులతో చేతిలోని చంద్రహాసముతో ముడివీడిన శిరోజములతో పాటలి దయనీయురాలై కరుణమూర్తియై కనిపించెను. ఆమెను చూచి శిశునంది మహారాజు నేత్రములలో నీరుమలగెను. ఆయన "క్షహరాట రాజనర్తకియా యీమె !" అనుకొనెను.

పాటలి దుఃఖించుచుండెను. — "స్వామీ! అన్నిట మీరే ముందు నడచుచుండగా మీ యాజ్ఞలఁబడి నేను నడచునట్లు చేసితిరి. తుదకీ చరమ క్షణమున సైతము నేను మిమ్మనుసరించ వలసినదని నిర్దేశించినారా! నేనిదే వచ్చుచున్నాను. మహారాజా! ఈ దీనురాలి యభ్యర్థనను మన్నించి నా పతి శిరమును నా కొసఁగి నచో సంతసముతో నా భర్తతో సహగమన మొనర్తును. ఒక స్త్రీకి భర్తృదానము చేసిన ఫలము మీకు దక్కును." అనెను.

శిశునంది పుండరీకుని శిరమును దెప్పించి యామెకొసఁగెను. పాటలి యా శిరస్సును తన వక్షమునఁ జేర్చుకొని ముద్దిడి శిశు నందితో—"మహారాజా! నేను రెండేండ్లుగ మీ పాల్యవర్గములో నున్నదానను. మీరు నా కాజ్ఞ నొసఁగుడు. నేను నా ప్రాణనాథునితో నీలోకమునే పరిత్యజించి పోవుచున్నాను. సాతవాహన సామ్రా జ్యమున వందలు వేలుగ పాటలులు పుండరీకులు నున్నారు. ఆ సామ్రాజ్యము సాతవాహనీదేవిది! ఆమె జగన్మాత! ఆమె తన సామ్రాజ్యమును తానే రక్షించుకొనును. మా నామములు మా తరువాత వీర యశోగాథలలో జయగీతికలై నిలిచిపోగలవు" అనెను.

పాటలి: వప్పస్వామీ! మరి నీవేమగుదువు? నన్ను పెండ్లి యాడెదనంటివిగద! మృత్యువును వరింతువా? దీపశిఖను ముద్దిడుకొందువా! మూర్ఖుఁడా!

వప్పస్వామి: పాటలీ! నీవు నాకక్కఱలేదు. నాకేగాదు. ఇఁక నేపురుషునకును భార్యయగుట కనర్హురాలవు.

పాటలి: ఛీ! వదరుబోతా! నన్నీపేరునఁ బిలువకుము. ఆ పేరునఁ బిలచు నధికారము నీకులేదు. నేనొక్క పుండరీకునికే పాటలిని, స్త్రీని, ధర్మపత్నిని తెలిసినదా! మిగిలినవారికి పాటలి దీపశిఖ, ముగ్ధదీపుఁడు. దగ్గఱకు వచ్చితివా చచ్చితివే!

వప్పస్వామి గడగడలాడుచు దూరముగ నిలబడెను.

పాటలి : పిఱికిపందా! సమీపించినఁ జంపుదునని నీ భయము. పొమ్ము నీచుఁడా! పొమ్ము........జయశ్రీ సాతవాహనీ దేవీ జయ! జయశ్రీ గౌతమీపుత్ర సాతకర్ణిజయ! గౌతమీబాల శ్రీదేవీ! జయ. ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మీ! జయ!....స్వామీ! ఇదిగో మీ పాటలి! మీ ప్రియ సహచారిణి! సహధర్మచారిణి! మీ సహ గామిని యగుచున్నది. స్వీకరించుడు!

ఇట్లనుచు పాటలి తన చంద్రహాసమును ముద్దిడుకొని, పుండరీకుఁడొసఁగిన రవ్వల యుంగరము దీసి కన్నుల కద్దుకొని క్షణము నిమీలితాక్షియై ధ్యానమొనర్చి చంద్రహాసముతో తనశిరస్సు నొక్క్రవేటున ఖండించుకొనెను, రక్తము సెలయేటి బుగ్గవలె చిమ్మనగ్రోవితో చిమ్మినటుల నలుదెసల నెగసిపడెను. పాటలీ పుండరీకుల మస్తకములు మంతనములాడుచున్నట్లు నేలపైఁబడి యుండెను.

శిశునందికి తలతిరిగిపోయెను. ఆయన యిట్లనుకొనెను— "ఓహెూ! ఏమిపాటలి! ఈమె సాక్షాత్తు రూపొందిన రణచండి! ఈమె వ్రాకుచ్చిన దక్షరముల జరిగితీరును. తనకింక రక్షణలేదు, చావు తనకెట్లును తప్పదు. సాతవాహనులు తన్ను సంహరించి తీరుదురు.

శిశునంది మహారాజు భయకంపితుఁడై యటనుండి వెడలి పోయెను.

వప్పస్వామి యొంటరిగ నిలిచియుండెను. అతఁడిట్లను కొనెను—"పాటలీ! ఎంతపని చేసితివి! నీవు నిజమున కప్రధృష్యు రాలవు! అనభిగమ్యురాలవు! చచ్చిగూడ నీ ప్రాణేశ్వరుని విడ లేదు! నేను వట్టి ద్రోహుడును, బీడును. నాకు హృదయములేదు— దయలేదు—దాక్షిణ్యములేదు—కృతజ్ఞతలేదు. వట్టి శలాటువును! జీవితమునవెలుఁగు మాసినవాడను. నాకు నిష్కృతిలేదు."

వప్పస్వామి దారుభూతుఁడై నిలిచిపోయెను!